# బొంగరం

## విహారి కథలు



రచన సాహిత్యవేదిక
కడప








# విహారి కథలు

రచన సాహిత్యవేదిక
కడప

# కొండ అద్దమందు............

"బిందువులో సింధువు"ను చూడగలిగిన ద్రష్ట, "వాక్యం నుండి విరిగి పడ్డ క్రియ"ను గుర్తించగల బుద్ధిజీవి,
"కల్లు పాకకు సైతం కవిత వినిపించాలనే" ఆశ కరదీపికగా, "అక్షరాగ్నిలో పురం పెట్టిన నాలుక"తో "ధ్వనిమేలిమి"ని ప్రవింపజేస్తున్న కవితా మర్మజ్ఞుడు. "కవిమనసధార - మానవత"గా చాటుతూ చైతన్య గమనం చేస్తున్న నిత్య సత్యాన్వేషి! నిరంతర సాహిత్య విద్యార్థి!

– విహారి.

**విహారి రచనలపై ప్రముఖుల, పాఠకుల అభిప్రాయాలు :**

"విహారి కథలలో ఒక ఆర్ద్రభావమూ, మానవ సంబంధాలలో ఉండవలసిన నాజూకు తనమూ, సృజన సుకుమారత- ఆహ్లాదం కలిగిస్తున్నాయి"

– మంజుశ్రీ

"కథాశిల్పం పుటికి పుచ్చుకున్న విహారిలాంటి వాళ్ళకి ఏదిరాయాలన్న సమస్యరాదు. ఏదిరాయకూడదనేదే అప్పుడప్పుడు సమస్య అవుతుంది"

– డా. పరుచూరి రాజారామ్

"విహారి కథలన్నిటిలోనూ ఆత్మ పరిశీలన, ఆత్మ సంస్కారం – వాస్తవికతా దృష్టికి వన్నె తెచ్చి మట్టిని బంగారం చేస్తోంది. విహారి ఆశావాది. జీవితం పట్ల , తోటి మానవుని పట్ల ఆయనకు గల విశ్వాసం గొప్పది"

– ఆర్.యస్. సుదర్శనం.

"ఇవీ మా తెలుగు కథలు అనిగర్వంగా చెప్పుకొనేంతటి మాస్టర్ పీసెస్. స్మృతీ, చలనం కథలు. ఎత్తుపల్లాలు, చలనం, నిప్పు-వంటివి ఎప్పుడోగాని రానివి. గాలివాన లాగా ప్రపంచ కథానికల్లో చోటు చేసుకోగల సత్తా ఉన్న కథ – నిప్పు"

– పి.ఎస్.ఎన్. శాస్త్రి

"నిప్పు కథానిక అత్యద్భుతం. మీ ప్రచండమైన శైలీ వేగానికి, కవితా భావాలకూ,

వస్తు విలక్షణతకీ, శిల్ప శిఖరాలకూ
అభివందనం. ఈ కథచాలు - మీ స్థానాన్ని
రాచకొండ పక్కనో, బీనాదేవి పక్కనో, కాళీ
పట్నం పక్కనో కూర్చోబెడతారు విమర్శకాగ్రేసర
చక్రవర్తులు"

- కె. విజయ ప్రసాద్.

"చలిలో సూర్యుడు" కథ ఒక మాస్టర్
పీస్ ఈ కథ ఇతర భారతీయ భాషలన్నింటిలోకీ
అనువాదం కావాలి."

- పి. వెంకటేశ్వర్లు.

"గుండెలో కోయిల... అనిర్వచనీ
యమైన భావానికి అత్యుత్తమ రూపకల్పన.
విశ్వనాథ్ వంటి ఉత్తమ దర్శకులు
చిత్రీకరించవలసిన ఆణిముత్యంలాటి కథ
ఇది."

- జి.సి. ప్రసాద్.

"డీప్‌గా, క్షుణ్ణంగా సాహిత్యాన్నీ, జీవితాన్నీ
చదివిన అనుభవశాలి, ఇంటలెక్చువల్...
మీరు. కనుకనే గొప్ప రచయిత, కవి...
అయ్యారు. మీ సద్యఃస్ఫూర్తి గొప్పది. నాకు ఒకటే

విచారం... మీ కథలో తాత్విక చింతన, శిల్ప పరాకాష్ట శైలీ విశిష్టతల మీద ప్రత్యేక వ్యాసాలు రాలేదే అని. మేము గర్వించే రచయితలు మీరు."

– పార్థసారథి

**కథా సాహిత్యంపై విహారి నిర్దిష్టమైన అభిప్రాయాలు :**

1. కథ చిన్న నవల కానేకారాదు. కథలో జీవితమంతా చాటభారతంలా రాకూడదు. జీవిత ధ్వని, ఛాయ ఉండాలి అంతే.
2. జీవితం కాన్వాస్‌మీద 'మనిషి' బొమ్మరావాలి కథలో.
3. శిల్పం, శైలి బలంగా, విశిష్టంగా లేని వస్తువు... కథని వ్యాసాన్ని చేస్తుంది. అది పాఠకునికి ఉన్నత, ఉత్తమ మానవతా విలువల పట్ల ప్రగాఢతని అందించదు.

**విహారి రచనల వెనుక గల బలమైన తాత్విక చింతన :**

1. 'మనిషి – శ్రుతీ, అపశ్రుతీ మేళవించిన కలగా పులగమైన రాగ విరాగ ధ్వని"
2. 'మానవుడు చిరంజీవి, మంగళ గీతాలను ఆలపించే భావి".

3. మనిషి పట్ల చెమర్చిన కళ్ళ తో చూడు. గుండె తడితో మాట్లా డు.
4. జీవితం నిరంతర స్రోతస్విని. అది వరద గోదారి; శాంతకృష్ణ.

**ప్రస్తుత కథా సాహిత్యంపై అభిప్రాయం :**

1. కథపేరుతో చిన్న నవలలు రాసే పెద్ద కథకులపై కినుక.
2. మంచి కథకి ఇవ్వవలసిన స్థానం ఇవ్వకుండా, పేర్లు న్న పాత కథకులపేర్లే - న్యూస్‌లో, వ్యూస్‌లో, రెవ్యూస్‌లో- మళ్ళీ మళ్ళీ పునశ్చరణ చేస్తున్నారే అనే కోపం.
3. పత్రికలు తెలుగు కథని అల్పంచేసి, చిన్నచూపు చూస్తుంటే, కథ కులూ, విమర్శకులూ తెలుగు కథని ప్రాంతీయంగా చీలుస్తున్నారే అనే ఆవేదన.
4. రచనలో మాండలికం "క్రేజ్" గా మారితే- కథకి సగటు పాఠకుడు కూడా మిగలడేమో అనే భయం.

**అభిరుచులు :**

1. ఉత్తమ సాహిత్య పఠనం; తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియల్లో నూ రచనాధోరణుల విశ్లేషణ.

2. (పరీక్ష ఉత్తీర్ణత, రిజిస్ట్రేషన్ కల - డాక్టరుగా) దీర్ఘరోగాలతో బాధపడుతున్న రోగులకు హోమియో వైద్య విధానంలో చికిత్స ద్వారా సమాజసేవ.

3. కథా రచనను యజ్ఞంగా భావించి, ఔత్సాహికులకు సలహాలూ, సూచనలు అందజేస్తూ వర్క్‌షాపుల నిర్వహణ.

**రచనకు గల ప్రేరణ:** సాహిత్యం వ్యక్తివికాసానికీ, ఉత్తమ మానవతా విలువల పరిరక్షణకూ-తోడ్పడుతుందనే "కన్విక్షన్".

**విహారి సాహిత్యాభిమానులు :** కృష్ణశాస్త్రి, సినారె; ముళ్ళపూడి; ఆదివిష్ణు.

# అవీ... ఇవీ... అన్నిటిలో కొన్నీ....

1994లో కథ పరంగా తెలుగు దేశంలో పెద్ద సంచలనం తెచ్చాడు డా.వేదగిరి రాంబాబు. కథ సదస్సులు నిర్వహించాడు. ఆ సదస్సుల నిర్వహణలో అతని కోరిక మేరకు నేను నా పాత్ర నిర్వహించాను. "రచన" పత్రిక శాయి వంటి ముఖ్యులూ ఆ యజ్ఞంలో ఉన్నారు. ఆసందర్భంలో పత్రికల్లో చాలా వ్యాసాలూ, రిపోర్టులూ, విశేషాలు, వ్యాఖ్యానాలూ, న్యూస్, వ్యూస్, రెవ్యూస్... అసంఖ్యాకంగా వచ్చాయి. నేనూ అధిక సంఖ్యలోనే (నా పేరుతోనూ, పేరులేకుండానూ) వ్రాశాను. రాంబాబు "కొత్తకథ" తెచ్చాడు. కథ సంకలనాన్ని వేశాడు. కథాంశాలు కలిగిన ఇతర పుస్తకాలు తెచ్చాడు. 1994 "కథ సమీక్ష" గ్రంథం తీశాడు. తెలుగు దేశంలోని ప్రసిద్ధ కథకుల్నీ, విమర్శకుల్నీ అత్యధిక సంఖ్యలో ఆప్రయత్నంలో పాల్గొన జేశాడు. అతను చేసిందొక యజ్ఞం. చాలా ప్రయాసలకి గురైనాడు. చాలా చేతిచమురు వదుల్చుకున్నాడు. అతని బృహత్ప్రయత్నం వలన - కథ - గాలిపటంలా లేచింది. ఒక ఉప్పెనలా రేగింది. తెలుగు కథకు అతను కూర్చిన సంబరం అద్భుతమైనది.

నా సంగతికి వస్తే- నేనా సదస్సులకి "పౌరోహిత్యం" వహించాను. (ఈ పదం వాకాటి ఆంధ్ర ప్రభ వీక్లీ సంపాదకీయంలో నాగురించి వాడారు.) కొందరు నన్ను పులుసులో ముక్క అన్నారు. వాకాటి వాడిన పదంతో సహా, ఆ తర్వాత జరిగిన కొన్ని సంభవాల నీడలు నామస్సును చివుక్కుమనిపించాయి.

సాహిత్య కార్యకర్తగా - పదిమంది శ్రోతలనుంచీ, పదివేల మంది శ్రోతలవరకూ ఉన్న సాహిత్య సభల్ని నిర్వహించిన వాణ్ణి నేను.

"తెలుగుదేశంలో రచయితగా, కథకుడుగా, నాటక కర్తగా, పద్య వచన కవితా కవిగా - బహుముఖీనమైన మీ ప్రతిభా వ్యుత్పత్తులకు తోడు మీరు సాహిత్య కార్యకర్తగాకూడా అద్భుత విజయాలు సాధించారు" అని శ్రీ మధురాంతకం, సినారెలవంటి పదిమందిచేత ఔననిపించుకున్న వాడిని నేను.అయితే,1995 వాతావరణం నా వ్యక్తిత్వానికి "ఇరుకు"గా తోచింది. ఆతరువాత ఒక స్తబ్ధత నాకు తెలీకుండానే నన్ను అలముకుంది.

1994లోనే ఆ కథా సదస్సులు జరుగుతుండగానే, నేనొక మహోత్తరమైన ప్రయత్నానికి పూనుకున్నాను. తెలుగులో వచ్చిన కథల్లో గొప్ప కథల్ని కొన్నిటిని ఎన్నుకొని వాటిని సమీక్షిస్తూ... "తెలుగు కథ తేజోరేఖలు..." గ్రంథ రచనకు పూనుకున్నాను. కథకుడి పేరుతో ప్రమేయంలేకుండా - గొప్పకథ ఎవరు వ్రాసిఉన్నా ఆ కథ ఈ గ్రంథంలో రావాలని నా ఆకాంక్ష. ఎన్నెన్నో కథలు సేకరించాను. ఎన్నిటిమీదో సమీక్షలు పూర్తి చేశాను. కొన్నిటిని కొన్ని పత్రికల్లో ప్రచురించాను కూడా. అయితే దురదృష్టవశాత్తు నేను అనుకున్న పని పూర్తి కాలేదు. కొంతమంది కథకులనుంచి, మిత్రులనుంచి- కోరి తెప్పించుకున్న కథలను కూడా పోగొట్టుకున్నాను. (బెంగుళూరు, బొంబాయి ట్రాన్స్ఫర్ల వలన.) కొందరికి ఆవిధంగా నిరుత్సాహం మిగిల్చినవాడినైనాను. పరోక్షంగా వారికి క్షమాపణలు చెప్పుకున్నాను.

ఇప్పుడా "తెలుగు కథ-తేజోరేఖలు" ని ఏంచేయాలా అనే ఆలోచన నన్ను వేటాడుతోంది. అయినంతవరకు పుస్తకరూపంలో తెస్తే దానిలో చేరవలసిన ఎందరికథలో ఉండవు. పోనీ, పూర్తి చేద్దామా అంటే- మళ్లీ "ఓం" అంటూ ప్రారంభించాలి. (కథా సేకరణ, పఠనం, రచన). ఇప్పుడా మనస్సూ, సమయం, శక్తీ చాలవనిపిస్తోంది. దీనిగురించి ఒక

నిర్ణయం తీసుకోవాలి.

ఈ విషయాల నేపథ్యంలో .....

1995 తరువాత కథ వ్రాయలేదు నేను. కారణాలు ఎన్నో ఉన్నా ముఖ్యమైనది నా మనన ధోరలో వచ్చిన మార్పు.

40 ఏళ్ల నా సాహితీ ప్రస్థానంలో - రెండు కళ్లు - కవిత; కథ. వీటిలో కథతో చాలా పరుగులు తీశాను. చాలా లోకం చూశాను. చాలా జీవితాలు చదివాను. చాలా మంది మనుషుల్నీ, మనీషుల్నీ అర్థం చేసుకున్నాను. కవితా పరంగా పదిమంది మెచ్చుకున్న "చలనమ్" "కలంకన్ను" సంపుటాలు ప్రచురించాను. ఎందుకో... మరి,

పరిణామ శీలమైన కాలం తన ప్రభావాన్ని తానూ నామీద చూపిందికాబోలు;

బుద్ధీ, మనస్సు- రెండూ- వేరే ధ్యేయం వైపూ, లక్ష్యం వైపూ- కదిలినై.

విశ్వనాథవారికి తమ తండ్రి చేసిన సూచన స్ఫురించింది - ఒకనాడు.

రామాయణం కదిలింది. శిష్టంగా, పటిష్టంగా, విశిష్టంగా, ఛందోబద్ధంగా, కావ్యంగా నా పదచిత్రరామాయణం ప్రారంభమైంది. నాలుగు వేల పద్యాల వరకూ అయినై. మూడు కాండలు పూర్తి అయినై.

ఇదీ సందర్భం.

ఈ సందర్భంలో....

ఏదో పనిమీద కర్నూలు వెళ్తే - నాకు ఆప్తుడు, ఆత్మీయుడు శ్రీ విజయప్రసాద్ కలిశాడు. అతను మంచి రచయిత, ఉన్నత విద్యాభ్యాసం చేసి ఐదు ఎం.ఏ., లు పొందిన విద్యార్థి. "వియోగి"

కలంపేరుతో కథకుడుగా, నాటక కర్తగా చాలా విజయాలు సాధించినవాడు. ఆకాశవాణిలో పెద్ద బహుమతి తీసుకున్న నిగర్వి. ఇరవై ఏళ్ల పరిచయం మాది. ఇద్దరమూ కూర్చుని సాహిత్య విహంగ వీక్షణం చేశాము. మనసులు కలబోసుకున్నాము. అతనికి నా పట్ల గురుభావం, గౌరవం. వాటిని నేనూ గౌరవిస్తాను.

అప్పుడు విజయప్రసాద్ అన్నాడు, "గురువుగారూ, మీ కథల్ని సంపుటంగా తేవాలి" అని.

ఆలోచించగా "ఇదీ మంచిదే. ముగిసిన నా "కథ" అధ్యాయానికి ముద్రణ రూపం ఇచ్చి, "ఇకచాలు" అనుకోవడమూ బాగానే వుంటుంది. అనిపించింది.

"సరే" అన్నాను. ముద్రణ భారం తానే వహించి కర్నూలులోనే పని ప్రారంభింపజేశాడు.

"బొంగరం" కథా సంపుటి మీ చేతిలో ఉంది.

ఈ కథ నాకు చాలా ఆత్మీయమైనది.

ఒక కారణం- వస్తువు ఎంతో తాత్త్వికతతో కూడినది. జీవన వాస్తవానికి కథాత్మక చిత్రణ.

మరొక కారణం - నేను కథ రాసే పద్ధతికి, అంటే నా శిల్పానికి, శైలికి - ఈ కథ ఒక "మోడల్"గా నేను భావిస్తున్నాను. ఎందుకంటే నా కథనంలో, కథా సంవిధానంలో... నాదైన ముద్ర- ఒక 'క్రిప్టిక్ నెరేషన్' ఉంటుంది. ఒక గాఢత, ఆర్ద్రత, తాత్వికత- అంతర్లయగా కథలో ధ్వనిస్తూ ఉంటాయి. ఈ గుణాన్ని హర్షిస్తూనే మా గురువుగారు మధురాంతకం రాజారామ్ గారు- "మీ కథలు నెమ్మదిగా, నిలకడగా చదవాలిసార్. సాధారణ పాఠకుడు అంతశ్రమ తీసుకుంటాడా

ఆలోచించండి." అంటూ వుండేవారు. వాకాటి పాండు రంగారావుగారు - కేంద్ర సాహిత్య అకాడమికి వేదగిరి రాంబాబుతో కలిసి ఒక కథా సంకలనం (బంగారు కథలు) కూరుస్తూ, నాకథ "గోరంత దీపం" దానిలోకి ఎన్నుకున్నారు. ఆ తరువాత ఒకసారి నాతో నా కథల గురించి మాట్లాడుతూ, "మీతో ఇన్నేళ్ళ పరిచయం ఉండికూడా మీ కథల్ని క్లోజ్‌గా పరిశీలించలేక పోయాను. ఇప్పుడాపని చేసిన తరువాత, మీ కథల్లో ని డెప్త్, స్పెసిఫిక్ గ్రావిటీ తెలిసినై". అన్నారు. ఈ లక్షణాలు - ఈ కథలో- దండిగా ఉన్నాయి. రచయిత వైయక్తికమైన అనుభూతి అతని రచనల్లో ప్రతిబింబిస్తుందనే సత్యానికి ఈ కథ దృష్టాంతమని నేను భావిస్తున్నాను. అలాగే కథకి క్లుప్తతే ప్రాణం అని నేను విశ్వసిస్తాను. ఈ కథలో ఆ క్లుప్తత కుదురుగా కూర్చుంది.

అందుకు - ఈ కథ నాకు ఆత్మీయమైనది.

నా రచనలు పుస్తకాలుగా వస్తుంటే నాకంటే హర్షించే వాళ్ళు ... గుత్తికొండ సుబ్బారావు, మా అన్నయ్య ఈ విజయప్రసాద్.

వీళ్ళ ంతాకూడా గొడుగులాంటి మనుషులు. ఈ శీర్షికతో వీరికి ఆనందం కలిగించే కథకూడా ఈ సంపుటిలో వుంది.

1994లో నా కథా ప్రస్థానంలో కొంత ఊపు తెచ్చిన వేదగిరి రాంబాబుకి ఈ సందర్భంగా నేను కృతజ్ఞత చెప్పుకుంటున్నాను. విజయప్రసాద్‌కి హృదయపూర్వక అభివందనాలు.

ఈ పుస్తకం రచన సాహిత్యవేదిక పక్షాన వెలువడుతోంది. మహాకవి కీ.శే. గడియారం వెంకటశేషశాస్త్రి గారి స్మారక అవార్డ్ 22ఏళ్ళ నుంచి అవిరళంగా ఇస్తున్న సంస్థ - రచన సాహిత్యవేదిక. ఆ యజ్ఞంలో నాభాగస్వాములు శ్రీయుతులు ఎస్.సి. రామసుబ్బారెడ్డి

అన్నవరం ఆదిశేషయ్య ఎం.జానకీ రాం గారలు, ఇతర సాహితీ మిత్రులు. వీరందరికీ నా నమోవాకాలు.

కథా సంపుటిని అందంగా కూర్చిన శ్రీమతి రమాదేవి మరియు శ్రీ బి.వి. క్రిష్ణారెడ్డి ( **శ్రీ పరమేశ్వరి గ్రాఫిక్స్, 52/53, పోర్ట్, కర్నూలు, ఫోన్ : 08518 314132.**) వారికి ధన్యవాదాలు.

శుభాకాంక్షలతో, సెలవు.

**- విహారి.**

తేది : 1-9-2003.

ఈ సంపుటిలోని కథలన్నీ వివిధ తెలుగు పత్రికల్లో ప్రచురింపబడినై. పరిధి కథ ఆకాశవాణిలో ప్రసారమైంది. ఆ యా పత్రికా సంపాదకులకు, కార్యక్రమ నిర్వాహకులకు రచయిత కృతజ్ఞతలు. కథలమీద తమతమ అభిప్రాయాల్ని, ప్రత్యేక స్పందనని తెలియజేసిన పాఠకులకు అభివందనాలు. ప్రత్యేకించి శత్రువు, ఎత్తుపల్లాలు కథలమీద తమ అభినందనలు కురిపించిన అనేకానేక పఠితలకు, సాహితీ మిత్రులకు రచయిత ధన్యవాదాలు.

# మనసూ, మనన ధారా...

(కొన్నేళ్ల క్రితం ప్రసిద్ధ రచయిత, కవి, విమర్శకుడు డా. ద్వానా శాస్త్రిగారు నన్ను ఇంటర్వ్యూ చేస్తూ కొన్ని ప్రశ్నలు వేశారు. వాటికి యథాతథంగా నేనిచ్చిన సమాధానాలు కాకున్నా, నా అంతరంగ భావాల్ని కథా పరంగా ఈ సమాధానాలు ఆవిష్కరించాయి.)

* కథ కవిత్వాన్ని డామినేట్ చేస్తున్నదన్నది వాస్తవమేనంటారా?

- అవును. రాశి దృష్ట్యా, వాసి దృష్ట్యా కూడా మంచి కథలు వస్తున్నాయి. గొప్ప కథలూ ఉన్నై; కథ మళ్లీ తన ఉనికిని, గౌరవాన్ని నిలుపుకున్నదని చెప్పటానికి మరికొన్ని అంశాలు చెప్తాను. గతంలో వాసికెక్కిన, ప్రసిద్ధమైన కథల్ని చాలా పత్రికలు పునర్ముద్రించి ఈ తరం పాఠకులకు అందజేస్తున్నాయి. తెలుగు కథ వికాసాన్ని గురించీ, తీరు తెన్నుల్ని గురించి చక్కటి సాహిత్య వ్యాసాలు ఎక్కువ సంఖ్యలోనే వచ్చినై. వీటితోపాటు, కథకుల వైయక్తిక ప్రతిభా వ్యుత్పత్తుల్ని గురించిన ప్రొఫైల్స్ కూడా చాలా వచ్చినై. ఉత్తమ కథ విశ్లేషణతో వ్యాస పరంపర మొదలైంది. సుప్రసిద్ధ కథకులతో ఎన్నో ఇంటర్వ్యూలూ వచ్చినై.

కాగా, కథల పోటీలు కూడా బాగా నిర్వహింపబడ్డినై. రచయితలకు మంచి ప్రోత్సాహకాలు కలిపించబడ్డినై. కథకు ఇచ్చే పారితోషికాన్ని ఎంతో ఎత్తుకు తీసుకువెళ్ళాయి పత్రికలూ, సంస్థలూ.

మరో ముఖ్యమైన పరిణామం. కథతో లేదా కథలో, పాఠకుల ప్రమేయం పెరిగింది. కథల్ని చదివి అభిప్రాయాలు రాసే ఉత్తరాధీశులు మూస ఉత్తరాల స్థాయినుంచీ, చక్కటి విశ్లేషణచేసే స్థాయికి ఎదిగారు. పాఠకుల్ని కథ ప్రియమని అనేక విధాలుగా ఇన్వాల్వ్ చేయడం జరుగుతోంది.

ఇక గ్రంథ సమీక్షలు సరే సరి. చాలా కథా సంకలనాలపై మంచి సమీక్షలు వచ్చినై. కథా సంపుటాలు, సంకలనాలు వెలువడుతున్నాయి.

మరొక విషయం. ఆనాడు 1994లో వెలువడిన కథలమీద సమీక్ష- అన్ని పత్రికల్లో నూ పడిన అన్ని కథల్ని పరిశీలిస్తూ సుమారు 30 మంది కథకులు, ప్రసిద్ధ విమర్శకులు వ్రాసిన విశ్లేషణాత్మక వ్యాసాలతో - శ్రీ వేదగిరి రాంబాబు ఒక సంకలనం తెచ్చారు, అదీ జనవరి 26 నాటికి అత్యంత వేగంతో. ఇదొక బృహత్ప్రయత్నం మాత్రమే కాదు. సాహసోపేతమైన విజయం.

ఇక్కడ మరో యదార్థమూ సమాధానంగా చెప్పుకోవాలి. 1994లో రచన, సాధన సాహితీ ప్రవంతి, నేనూ, రాంబాబు కలిసి... ఆరు కథా సదస్సులు నిర్వహించాము రాష్ట్రమంతటా. కథా సాహితీ, కథా వేదిక, తెలుగు రచయితల సహకార సంఘం - ఇలా అందరూ అనేక విధాల పుస్తక ప్రచురణతో, సమావేశాల నిర్వహణతో కథని నడిపించారు. ప్రత్యేకించి చెప్పుకోవలసిన వాస్తవం మరొకటి ఉంది. పత్రికలన్నీకూడా ... కథాభ్యుదయానికి మంచి ప్రోత్సాహాన్నిచ్చాయి. సంపాదకీయ వ్యాఖ్యల్లో కథ పదేపదే చోటుచేసుకుంటోంది. పదేళ్ల క్రితం నేనూ, మధురాంతకం రాజారాంగారూ, కథా సందర్భం ఇలా ఉంటుందని ఆశాభావాన్ని వ్యక్తంచేశాము. ఆ ఆశ నిజమైంది. కొత్త కథకులు ప్రత్యేకించి తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలనుంచీ వాస్తవికత ప్రధానంగా అద్భుతమైన కథలు వ్రాస్తున్నారు. రచయిత్రుల సంఖ్య కూడా బాగా పెరిగింది.

ఇన్ని సంభవాల వలన కథ తన ఔన్నత్యాన్ని తిరిగి నెలకొల్పుకొన్నదనే వాస్తవాన్ని మనమందరమూ అంగీకరిస్తాము కదా!

✷ కవిత్వాన్ని డామినేట్ చేసిందన్న మాటని మీరు ఒమిట్ చేస్తున్నారు ఎందువలన?

ఎందువల్ల నంటే, కవిత్వపరంగా కూడా - ఇట్లాంటివి చాలా జరిగినవంటూ వీ వంటి ప్రసిద్ధులు ఒక పట్టికని నా ముందుకు తెచ్చి చర్చలోకి దించుతారేమోనని. సరేనా?

✷ గత కాలపు స్మృతులు, బాల్యం గురించి రాయడం సబబుకాదనీ, వర్తమానం గురించే రాయాలనీ కా.రా. మాష్టారు అన్నారు. మీరు ఏకీభవిస్తారా ?

- హైదరాబాదులో కొన్నేళ్ల క్రితం కథాప్రగతి చర్చాగోష్ఠి జరిగింది అక్కడే మాస్టారు మాట్లాడింది. ఆగోష్ఠిని నేనే నిర్వహించాను. వారన్నది ఇదీ. "రచయితలకి నోస్టాల్జియా ఎక్కువగా వుంటుంది. వర్తమానం విశదం కావడానికి గతం అవసరం కావచ్చు కానీ, వర్తమానం ముఖ్యం. సమాజమూ, వ్యక్తులూ ముందుకు సాగాలి- ఇక్కడనుంచీ. కథకుని దృక్పథం ఆ దిశగా సాగాలి".

మాష్టారు ఇచ్చిన ఈ సలహా చాలా విలువైనదిగా నేను భావిస్తున్నాను. మొత్తం సలహాని చదవాలి మనం. మొదటి భాగాన్ని మాత్రమే తీసుకొని కొందరు పెద్దలు ఆ సభలో మాష్టారి అభిప్రాయాన్ని వ్యతిరేకించారు. కేవలం "గతమెంతో ఘనకీర్తి గలది" అని అక్కడ ఆగిపోవడం సబబుకాదు అని మాష్టారి అభిప్రాయం. ఆ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. కథ - ఈనాటి వాస్తవికతను ఆవిష్కరించాల్సిన అవసరం ఉంది. అది అలా ఆవిష్కరిస్తూ చాలా ముందుకు వచ్చేసింది.

✷ కథల్లో ఇతివృత్తం ముఖ్యమా? శిల్పం ముఖ్యమా? సందేశమా?

- ఇతివృత్తం, వస్తువు - ఈ రెండూ వేరు. ఇతివృత్తం సూక్ష్మమైనది, వస్తువు స్థూలమైనది. ఇతివృత్తం బీజరూపమైనది. వస్తువు మొక్క లేదా వృక్షం. అబద్ధం ఆడటమో ఆడకపోవడమో ఇతివృత్తం. గాంధీగారి టీచర్ కథో, హరిశ్చంద్రుడికథో... అది వస్తువు. ఇతివృత్తం చైత్రగానం అయితే; వస్తువు పంచాంగ పఠనం కావచ్చు, కవి సమ్మేళనం కావచ్చు. మంచి ఇతివృత్తమూ, దానిలోని ఒక విలక్షణత కథకునికి ప్రేరణ కాగలిగితే మంచి వస్తువు ఆవిష్కరింపబడటానికి ఎక్కువ అవకాశం ఉంది. ఇక్కడే శిల్ప ప్రాధాన్యత గురించి మనమంతా చెప్పుకునేది. ఏం చెప్తున్నామన్నది, ఎంత గొప్ప విషయమైనా, చెప్పేవిధంగా, చెప్పాల్సిన పద్ధతిలో చెప్పకపోతే... పాఠకుడే తిప్పి కొడతాడు. శిల్పం గురించి ఒక వాక్యం చెప్పారు దుర్గానంద్. "గుర్రం గుగ్గిళ్లు తింటోంది" అనేది స్టేట్‌మెంట్. " గుర్రం గుగ్గిళ్లు తింటూ తోకాడిస్తోంది" అంటే కథలోకి వెళ్తున్నట్లే అని. ఈ వాక్యం... కథకుడుగా నన్ను చాలా ప్రభావితం చేసింది. మంచి కథనం లేనిది మంచి కథ రాదు. కథలో ఒక్కవాక్యమన్నా పాఠకుణ్ణి తన దగ్గర క్షణం సేపు నిలబెట్టుకోగలగాలి. అతన్ని ఆలోచనలో పెట్టాలి. కథ మొత్తంగా ... పఠితని ఎంతో కొంత కలవరపరచాలి. నేపథ్యం, పాత్ర చిత్రణ, సన్నివేశ కల్పన, వర్ణనల ఆంతర్యం... భాష, శైలి... ఇలాంటి అనేక అంశాల సమాహార రూపం శిల్పం. మరి ఇది లేని కథని మీరూ, నేనూ, ఏపాఠకుడు కూడా గుర్తించడు. దీనికి ఒకటే కారణం. కథ చదవగలిగితే కదా, కథా వస్తువును గురించి ఆలోచించగలిగేది, హర్షించగలిగేది!

సందేశం అన్నారు. కథలో సందేశం వాచ్యంగా వుండకూడదు.

మంచికథలు సిద్ధాంతాల్ని వల్లించవు; నినాదాల్ని ఘోషించవు. "జల తరంగిణి"లోని ఆ "జలం" - సందేశం.

**✷ స్త్రీవాద కథలు, దళితవాద కథలు, చదువు కథలు ఇలా విడివిడిగా రావడం అవసరమా?**

... చదువు కథల్ని మొదటి రెంటితో కలపకండి. ఇతివృత్తంలో ఏకత్వం ఉన్న కథల్ని సంకలనాలుగా తీసుకురావడం అవసరమే. దానివలన తెలుగువారి సాంఘిక జీవనానికి ఉన్న విభిన్న పార్శ్వాలూ వెల్లడి కావడానికి అవకాశం ఉంటుంది.

... ఇక స్త్రీవాద కథలు, దళితవాద కథలు. గురజాడ నుంచే ఈ అంశాలు, సమస్యలు మన కథల్లో చిత్రితమౌతూ ఉన్నై. సమకాలీన సామాజిక సమస్యలూ, వాటి తీవ్రతా...మంచి కథల్లో కళాత్మక వాస్తవికతతో ఎంతో ప్రస్ఫుటంగా ఆవిష్కరింపబడుతూనే వున్నై. మంచి పాఠకుడు ఏం చెప్పిందీ గమనిస్తాడు, ఎలా చెప్పిందీ పరిశీలిస్తాడు; "ఎవరబ్బా ఇంత బాగా చెప్పింది" అని పేరు చూస్తాడు. అంతేగాని ఇది ఫలానా "వాద" కథ కనుక బాగుంది అనుకొనే పఠిత ... రాజకీయం ఆశిస్తున్నాడేగానీ, మంచి కథని కాదు. కథా హృదయం వేరు. అలాంటి పఠితకి ఈ హృదయ సాన్నిహిత్యం కరువైందన్నమాట. నిర్ద్వంద్వంగా చెప్తున్నానీ అభిప్రాయాన్ని.

పఠితని జీవితపు ఉన్నత పథాలవైపు నడిపే కథకి ఉప శీర్షిక అక్కర్లేదని నా నమ్మకం. తన శీర్షంతో తాను దిట్టంగా నిలబడగలదు. ప్రాంతీయ, వర్ణ, వర్గ, వాద, నినాద భేదాలకి అతీతమైనది ... మంచికథ. దానికి ఈ టాగ్‌లు అక్కర్లేదు. సో కాల్డ్ ఇంటెలిజెన్షియా సృష్టించిన లేబుల్స్ ఇవన్నీ. తెలుగు కథని ఇలా చీల్చుకుంటూ పోకూడదని నా అభిప్రాయం.

**✷ వెనుకటి తరం కథకులకీ, ఈ తరం కథకులకీ మీరు**

గుర్తించే తేడాలేమిటి?

... చిత్తశుద్ధి, లక్ష్యశుద్ధి ఆతరం వారిలో ఎక్కువ మందికి ఎక్కువ డిగ్రీలో ఆ లక్షణాలు ఉండేవి. ఈ తరం వారిలో తక్కువ మందికి ఎక్కువ డిగ్రీలో ఆ లక్షణాలు ఉంటున్నై. వారంతా ఎక్కువ నేర్చుకుని తక్కువ రాశారు; వీరంతా తక్కువ నేర్చుకొని ఎక్కువ రాస్తున్నారు. వారి జీవితం, జీవనం - సమాజం చుట్టూ తిరిగేవి. వీరి బతుకూ, పద్ధతీ... తమ చుట్టూ తాము తిరుగుతున్నై.

✱ కథకు ఇంత కథ ఉన్నా కవిత్వానికున్న ప్రాచుర్యం కథకి లేకపోవడంలో ఆంతర్యం ఏమిటి?

.... బుచ్చిబాబు కూడా వచన రచయితలకి చాలా కాలం వరకూ నోబుల్ ప్రైజు రాలేదని విచారిస్తూ ఉండేవాడు. ఇప్పుడు పరిస్థితులు మారినై. నా ఉద్దేశ్యంలో ఇవాళ కథకులకున్నంత మంది పాఠకులు కవిత్వానికి లేరు. కవిత్వానికున్న సోకాల్డ్ ప్రాచుర్యం - కవుల్లో నూ, విమర్శకుల్లో నూ, పత్రికల వ్యాసాల పేజీల్లో నూ, సభలూ , సమావేశాలూ, కవి సమ్మేళనాల్లో నూ... మాత్రమే ఉంటున్నదని నా అభిప్రాయం.

✱ మనకథలకి జాతీయ స్థాయిలో గుర్తింపు లేకపోవడానికి కారణాలు ఏమిటంటారు?

..... ఇప్పుడిప్పుడు మన కథలకి కొంత గుర్తింపు లభిస్తోంది. అనువాదాలు ఎంత ఎక్కువగా వస్తే అంతగా ప్రాచుర్యం, గుర్తింపు లభిస్తాయి. ఇటీవల ఆ కృషి బాగానే జరుగుతోంది.

✱ మంచికథలు రాకపోవడానికి పాఠకులు కారణమా? రచయితలా?

..... చెప్పాను కదా. మంచి కథలూ, గొప్పకథలూ వస్తూనే వున్నాయి.

✷ మాండలికాల్లో కథలు రాయడంవల్ల అసౌకర్యం ఉందా? అవగాహన క్షయత్వం ఉండదా?

.... కథ వస్తువుని బట్టీ, నేపథ్యాన్ని బట్టీ, పాత్రలూ, సంఘటనల్ని బట్టీ... మాండలికాన్ని నిర్ణయించుకునే స్వేఛ్ఛని రచయితకి ఉండవచ్చు. పాఠకులంటారా, వారివారి అభిరుచిని బట్టి ఆయా కథల్ని ఆనందిస్తారు- ఆరూపంలో కథ వారికి చేరువ కాగలిగితే.

✷ 1962 నుంచీ కథలు, నవలలు, నాటికలు, విమర్శ, కవిత్వం... రాస్తున్నారు గదా. సాహిత్యంలో మీ కృషికి తగిన గుర్తింపు మీకు లభించిందంటారా?

... రచనల పరంగా, వ్యక్తిగా, ప్రత్యేకించి సాహిత్య కార్యకర్తగా నాకు విశేష సంఖ్యలో అభిమానులున్నారు. ఔత్సాహిక రచయితలకి నా అనుభవాల్ని పంచి, రచనా పరంగా కొన్ని ఇబ్బందుల్ని అధిగమించడానికి వారికి సలహాలివ్వడం, సహాయపడటం... నలభై సంవత్సరాలుగా నా దైనందిన కార్యక్రమాల్లో ఒకటిగా నేను సాగిస్తూనే ఉన్నాను. వారందరూ నన్ను గుర్తించే ఉన్నారు. నా కథల్ని అమితంగా ప్రేమించే పాఠకులు నాకు అధిక సంఖ్యలోనే ఉన్నారు. మరోవైపు చూస్తే, ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. నోరి నరసింహ శాస్త్రి, కెవిఎల్ ఎన్ ఆచార్యులు, డి. రామలింగం వంటి ఆనాటి పెద్దలూ, నా రచనల్ని మెచ్చుకున్నారు. "మీరు నిఖార్సయిన కవిత రాశారు" అన్నారు కుందుర్తి. పత్రికలో ఐదారు సార్లు నా కథలకి బహుమతులూ వచ్చినై. నారచనలమీద శ్రీమతి ఎ. విజయలక్ష్మిగారు ఉస్మానియా యూనివర్సిటీలో పి.హెచ్‌డి.

చేశారు. అన్న వరం ఆది శేషయ్యగారు నా కథలమీద విపులమైన సమీక్షా వ్యాసాన్ని వ్రాశారు. ఇదంతా గుర్తింపేగా మరి. ఎటొచ్చీ కథ సాహిత్యం గురించి ఈనాడు రాసే పెద్దలకి నావంటి వారి పేరు స్ఫురించకపోవచ్చు కారణం వారు నా కథల్ని సరిగా చదివి ఉండకపోవడంకావచ్చు, ఒకరిద్దరు చదివి ఉన్నా నాకథల్లోని తత్వం వారు కోరుకునే తత్వాలకి, వాదాలకి దగ్గరగా ఉండి ఉండకపోవచ్చు

ఈ విషయంలో నాకే విధమైన నిరాశ, నిస్పృహలేవు. "విపులాచ పృథ్వీ" అనే సూక్తిని అభిమానిస్తాను నేను!.



# ఇందులో ఇది కథల వరుస...





కానుక

కథా రచనలో విహారి నా గురువుగారు
అనిచెప్పుకోగలిగిన సాహితీ మిత్రుడూ,

నన్నూ, నా రచనా శక్తినీ, వ్యక్తినీ
అభిమానించే మంచి మనిషీ,

ప్రస్తుతం నాకొక కృతి కూర్చిన
సహృదయుడూ,

శ్రీ కె. విజయప్రసాద్(వియోగి)కి
అభినందనలతో....

- విహారి

# చిరంజీవి ఆశ

ఎండ కరకర లాడుతోంది.

బిల బిల మంటూ వెంకటప్పయ్య గారి కళ్ళంలోకి చేరారు చాలా మంది పిల్లలు.

కొంతమంది డొంక ప్రక్కన చింతచెట్లమీద తమ ప్రతాపం చూపుతున్నారు.

కొందరు ఎదురుగా ఉన్న పడమటి చెరువులో ఈత పోటీల్లో నిమగ్నమై యున్నారు.

ఈత వరకూ ఎదగని సన్నవాళ్ళది వేరే జట్టు. వాళ్లంతా చెరువుకు దక్షిణం చివరన ఉన్న తామరమడుగులో పూలు కోయటం, ఆకులు తుంచటం, కాడలు పెరకటం చేస్తున్నారు.

వెంకటప్పయ్యగారి చేనుని ఆనుకొనే కరణం గారి చేను, కరణం గారి పాలేరు రామయ్య. వాళ్ళ చేలో మెరక సర్దుతున్నాడు.

కళ్ళంలో పిల్లలకి సూరి నాయకుడు. సూరి మునసబుగారి అబ్బాయి. వాళ్ళఇంట్లో వాడు పాడింది పాట, వాళ్ళ ఊళ్లో వాడు ఆడింది ఆట వాడి జతకత్తె లక్ష్మి. లక్ష్మి సూరి అత్తకూతురు. వీళ్ళిద్దరినీ అంటి పెట్టుకొని ఉండేది చాలా మంది. వాళ్ళందరికి సూరి లక్ష్మిలనుంచి తాయిలాలూ, పెన్సిలు ముక్కలు దొరుకుతాయి. ఏతావాతా ఎలిమెంటరీస్కూలు పిల్లలంతా సూరి అడుగుజాడల్లో పోతూ ఉంటారు.

మునసబుగారి పాలేరు సుబ్బయ్య. సుబ్బయ్య రెండో కొడుకు చంద్రం. వాడూ, సూరి, లక్ష్మి – ఒకటే తరగతి. చంద్రాన్ని చూస్తే – సూరికి చులకన, లక్ష్మికి జాలి.

ఇప్పుడు సూరికి, చంద్రానికి మాటా మాటా పెరిగింది. సిద్ధమంటే సిద్ధం అనుకున్నారు.

పిల్లలందరిని కేకేశాదు సూరి.

లక్ష్మి - "వద్దు బావా, వద్దు" అంది, లక్ష్మి - "వద్దు చంద్రం, వద్దు" అంది. చంద్రాన్ని కళ్ళతో అభ్యర్థించింది. సూరిని బుంగమూతితో బెదిరించింది. ఇద్దరూ వినలేదు. కాళ్ళు తాటిస్తూ వెళ్ళి తుమ్మచెట్టు కింద కూర్చుంది.

కళ్ళం నిండుకున్నారు పిల్లలు. చింతచెట్లు చిన్న బోయిన్నై. పడమటి చెరువులో నీటికి నిలకడ చిక్కింది. తామర మడుగులో చేపపిల్లలు 'హమ్మయ్య' అనుకున్నై.

అందరికి మంచి వినోద ప్రదర్శన అది. యాభై తాటి ముంజల్ని అపకుండా తినాలి చంద్రం. చంద్రం గెలిస్తే ఐదు రూపాయలిస్తాదు సూరి. ఓడిపోతే సూరిని గుడిదాకా భుజాల మీద మొయ్యాలి చంద్రం. పందెం కాగానే ఆవకాయ బాగా తినేస్తే జబ్బు చెయ్యదనే ధైర్యం చంద్రానిది. ఎవరో చెప్తే విన్నాదు. 'ఈ చంద్రం గాడెటూ గెలవడు. కర్మకొద్దీ వాడే గెలిచినా, వెధవ అయిదు రూపాయలు పారేస్తే చాలు. మనం గెలిస్తే - వాడి భుజాలు హూనం కావటం ఖాయం' - ఇది సూరి ం.

రామయ్యని పిలిచి తాటి చెట్టెక్కించాదు సూరి.

గెలలు తెగుతున్నై. కాయల తలలు తెగుతున్నై, కుడిచేతి బొటనవేలిని ముంజెలోనికి జూనిపి గోటితో అట్లాగే నోట్లోకి జర్రుకుంటున్నాదు- చంద్రం. కాయ తర్వాత కాయ చంద్రం చేతికి అందుతోంది.

పిల్లలంతా చప్పట్లు కొదుతున్నారు. ఈలలేస్తున్నారు. లయ విన్యాసాలతో కేరింతలు కొదుతున్నారు. ఊళ్ళోకి పోయే బళ్ళ బాటమీద బళ్ళు ఆగుతున్నై. వివరం తెలుసుకొని సాగుతున్నై. కొన్ని కొన్ని ఈ చోద్యం చూద్దామని నిలబదుతున్నై.

ఆకాశంలో పిట్టలు బితుకు బితుకు మంటూ నిమ్మళంగా సాగుతున్నై.

ఒకటి.... రెండు.... మూడు..... ఏడు....ఎనిమిది.... తొమ్మిది........

జోరు తగ్గింది.

పదకొండు... పన్నెండు.... పదహారు.... పదిహేడు..... అంకె కదలడం కష్టంగా ఉంది. కనుగుడ్లు మిటకరిస్తున్నాడు చంద్రం. చేతుల్లో సత్తువా, అన్నమయ కోశంలో ఖాళీ తగ్గిపోతోంది. తేపులు వస్తున్నాయ్. బ్రే... ఒకటి... బ్రే...వ్....రెండు.

"తినరా నాయాలా... తింటానంటివిగా?" - ఎకసెక్కెం... ఎద్దేవా.... హేళనా.... హాసాలూ.... పరిహాసాలూ...!!

పదిహేడు....

కాయని వదిలేశాడు చంద్రం. కడుపులో ఎక్కడో తెలియని బాధ, ఏదో వికారం. కాళ్ళు తేలిపోతున్న భావన. కళ్ళు మూతలు పడుతున్నట్లు. ఏవిటో.... ఏమీ తెలియడం లేదు. భళ్ళున వాంతి చేసుకున్నాడు.

జనం మూగేరు. ఈ వార్తని ఊళ్ళోకి చేరేసింది లక్ష్మి. అందరికీ తెలిసి అట్టుడికినట్టుడికింది. గబగబా ఇంటికి చేర్చారు చంద్రాన్ని.

చంద్రానికి వాంతులూ, బేదులూ.

గంట గడిచింది. మనిషి డీలా పడిపోయేడు.

ఆకాశంలో సూర్యుడు మబ్బుల చాటున మొహం దాచుకుంటున్నాడు.

సుబ్బయ్య పెళ్ళాం పిల్లలూ- నెత్తి నోరు బాదుకుంటున్నారు. ఆచారిని పిలిపించారు. నాడీ, నాలుకా ఏ సూచననీ ఇవ్వలేదు. నా వల్ల కాదని జారుకున్నాడు. గూడుబండిలో పిల్లాడ్ని పట్నానికి తీసికెళ్ళారు.

నాలుగురోజుల తరువాత ఇంటికి తీసుకొచ్చారు చంద్రాన్ని. బతికి బట్టకట్టాడు.

ఆ రాత్రి – " ఆ పందెంలోకెందుకు దిగావురా అసలు?" అని లాలనగా , బాధగా అడిగాడు సుబ్బయ్య, కొడుకు తల నిమురుతూ.

ఊ ఆలతో చాలా సేపు గునిశాడు చంద్రం. చివరకు నెమ్మదిగా బెరుకు బెరుకుగా అన్నాడు– "ఆ ఐదు రూపాయలొస్తే రెండు పుస్తకాలొస్తయ్ కదా అనీ.... నిరుడు కూడా అన్నీ కొనలేక పోయాంగా. రోజూ ఆ లక్ష్మి ఇస్తుంటే తీసుకోవాలి...."

తండ్రి గుండె గతుక్కుమంది. పక్కనున్న భార్యకేసి చూశాడు, ఆమె వెంకన్న పటానికి దణ్ణం పెడుతోంది!

(ఆంధ్ర సచిత్రవారపత్రిక 3 అక్టోబర్ 1990)



# బొంగరం

ఇవ్వాళే హైదరాబాద్ రమ్మని రమణ నుంచి ఫోన్.

రమణ నా అన్న కొడుకు. ఏడాది నుంచీ అడిగినచోట అడక్కుండా విచారిస్తున్నాడు. హైదరాబాద్‌లో ఫ్లాట్ కొనుక్కోవాలి. ఇదీ ప్రయత్నం. ఆ ప్రయత్నం మీద అడపా దడపా - వరంగల్ నుంచీ హైదరాబాద్‌కి నాకు ప్రయాణం చేయక తప్పడంలేదు.

'చదరపు అడుగు మూడు వందల యాభై అయితే అడ్వాన్స్ ఇస్తాను' అన్నాడు రమణ.

'నేను కేవలం మేనేజర్ని. ఉండండి' అని ఎవరికో ఫోన్ చేశాడు - అంతసేపూ మాతో మాట్లాడిన వ్యక్తి.

'మా బాస్ రమ్మన్నారు. రండి. మాట్లాడదాం' అని రిసీవర్ హుక్‌చేసి కదిలాడు.

ముగ్గురమూ వాళ్ల కార్లోనే బయల్దేరాం.

హోటల్ ముందు కారుదిగాం. తలెత్తి పైకి చూశాను. తాటి చెట్టుని పెకలించి, తొండంతో పైకెత్తి నిలిచిన మత్తేభంలా వుంది భవనం. 'మాసివ్, మాజెస్టిక్, మోనోలితిక్' అని నా పదపరిజ్ఞానాన్ని నెమరువేసుకున్నాను.

లోపలికి నడిచాం. బోర్డ్‌రూమ్ అని బ్రాస్‌మెటల్ అక్షరాలున్న టేకు తలుపును తోసుకొని లోపలికి సాగేడు మేనేజర్. గుండెమూలలన్నీ ముడుచుకున్నట్లవుతోంది నాకు. అతన్ని అనుసరించాం రమణా నేనూ. అంత ఖరీదైన హోటల్లో ఎంత భారీగా ఉండాలో అంతకంత అపురూపంగా వుంది ఆ హాలు.

నమస్కారాలతో మొదలైంది సంభాషణ. క్షణాల తర్వాత కాఫీలు వచ్చినై.

కాఫీ సిప్ చేస్తుండగా సదరు బాస్ చూపులూ నాచూపులూ కలుసుకున్నై. 'నువ్ మూర్తివి కదూ' అని అతనూ, 'నువ్వు ఉమాపతి కదూ' అని నేనూ ఒకేసారి

ఆశ్చర్యపోయాము.

ఆ తర్వాత....

కొద్ది సేపు పాత కథలూ, కొత్త అనుభవాలూ, పరామర్శలూ జరిగిపోయినై మా సంభాషణలో.

– రమణకి ఫ్లాట్ స్థిరమైంది. మూడువందల అరవైఐదుకి రేటు కుదిరింది! రమణ నాకు చాలా థాంక్స్ చెప్పి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

నాలాంటి వాడి పాద స్పర్శని వెక్కిరిస్తున్నట్టువున్న ఫ్లోరింగ్, రెండేసి టెన్నిస్ కోర్టులు కలిపి పరచినట్లున్న హాళ్లూ; వాటిలో తివాచీలు, సీలింగ్‌కున్న గులేబులూ– అన్నీ అబ్బురంగా చూశాను.

ఉమాపతి ప్రస్తుతం తన చేతులో ఉన్న వెంచర్స్ గురించి, ఇదివరలో తాను చేసిన అడ్వెంచర్స్ గురించి చెప్తూ నడిచాడు నాతో.

అతని మాటల్లో దొర్లిన అంకెలకి ఎన్నెన్ని స్థానాలు వుంటాయో, ఎక్కడెక్కడ కామాలు పెట్టాలో వితర్కించుకొంది నా మనస్సు.

ఆ రాత్రి ఉమాపతి నన్ను తన ఇంటికి తీసుకువెళ్ళాడు. అతని భార్య రజని నాకు తెలుసు. వాళ్ళ కొడుకు, కూతురు – ప్రసాద్, సుజనల్ని కూడా నేను ఎరుగుదును. ఇద్దరూ ఇంట్లోనే ఉన్నారు. ఆ నెల్లోనే స్టేట్స్‌కి వెళ్తున్నారట. ఇక్కడ ఇంజనీరింగ్ అయిపోయింది.

భోజనాలైన తర్వాత హాల్లో కూర్చున్నాం.

'ఎలా వుంది సార్ మా ఇల్లు?' అంది రజని.

'ఇల్లుకాదు ప్లీజ్ – బంగళా అను....' అని, 'నేను ఆరగించిన విందులా ఉంది. భుక్తాయాసంగా వుంది' అన్నాను. అందరూ సంతృప్తిగా నవ్వారు.

మర్నాడు – ఆదివారం.

ఉమాపతి దగ్గర సెలవు తీసుకొని రమణ ఇంటికి వచ్చేశాను. ఉమాపతి

గురించిన ఆలోచనలు చాలా రోజులపాటు వదల్లేదు.

ఆ ఆలోచనల్లో గబగబా పదిహేనేళ్లు వెనక్కినడిచాను.

స్వామి మా కంపెనీలోనే పనిచేస్తూ వుండేవాడు. మనిషి స్వభావం మెత్తన. నలుగురికీ తలలో నాల్కలా వుండేవాడు.

ఒకరోజు...

రాత్రి ఏడున్నరయింది. భార్యా నలుగురు పిల్లల్నీ తీసుకుని మా ఇంటికి వచ్చాదు స్వామి

పరామర్శలూ కబుర్లూ సాగుతున్నై, కాఫీతాగుతున్నాం. నెమ్మదిగా చెప్పాదు స్వామి.

"ఇవ్వాళ ఇంటికి వస్తూ వస్తూ నేను నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చివచ్చాను".

నేను ఉలిక్కిపడ్డాను. తలెత్తి అతనికేసి చూశాను. కాఫీ పూర్తిచేసి నా కళ్ళలోకి సూటిగాచూస్తూ, స్ఫుటంగా చెప్పాడు. "అవును మాష్టారూ ముందువెనుకలు బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. సరోజిని కూడా అదే సలహా ఇచ్చింది."

సరోజిని అతని భార్య. ఆమెకూడా చెప్పింది, "అవును అన్నయ్యగారూ. ఎన్ని రకాలుగా ఆలోచించినా అదే మంచిదనిపించింది. ఇంకో మూణ్ణెళ్ళు ఈ ఊరితో అనుబంధం. అంతే! ఆతరువాత బెంగుళూరు వెళ్దామని..."

సరోజినిది అసలే నవ్వుమొహం. ఈ మాటలు నవ్వుతూనే చెప్పింది ఆమె.

ఆ తర్వాత మా సంభాషణ అతని నిర్ణయిం గురించే సాగింది. పదహారేళ్ల సర్వీసు ఉన్న ఉద్యోగి అతను. ఎక్కడో పాల్ఘాట్ నుంఁచీ వచ్చి కేవలం తన స్వశక్తితో, మంచిదనంతో ఇక్కడ కుదురుకుని హాయిగా ఉన్న వ్యక్తి–స్వామి.

ఈ ఉద్యోగం వదిలేసి తనకు వచ్చే డబ్బుతో ఒక లారీ కొనాలనీ, చిన్న చిన్న కాంట్రాక్టులు మొదలెట్టాలనీ, తద్వారా నాలుగు రాళ్ళు సంపాదించి త్వరత్వరగా కూతుళ్ల పెళ్లిళ్లు చేయాలనీ, తాము కూడా 'ఉన్నవాళ్ళు' కావాలనీ-ఇది పథకం స్వామిదీ, సరోజినిదీ!

చివరికి కొంచెం కటువుగానే అన్నాను నేను, "అందని మ్రానిపండుని చేతిలో వున్న కాయతో కొట్టాలనుకుంటున్నావ్ స్వామీ. మళ్లీ ఒకసారి ఆలోచించు. అవివేకం అనను గానీ, అనాలోచన మిమ్మల్ని కష్టాల్లోకి తోయకూడదనే నా ఆందోళన".

" అన్నీ ఆలోచించాం. ఇదే సబబుగా తోచింది. కానీయండి చూద్దాం. ధైర్యంచేసి ఒక అడుగు వేస్తున్నాం. ఆ తర్వాత భగవదేచ్ఛ" అన్నాడు స్వామి.

మూణ్ణెల్ల తర్వాత...

స్వామికి వీడ్కోలు పార్టీ ఇచ్చాము. అతను ఆ మర్నాడే కుటుంబంతో సహా బెంగుళూరు వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం అతన్ని సాగనంపి ఇంటికి వస్తూంటే, దారిలో అన్నాడు ఉమాపతి.

"ఎందుకనో నాకూ స్వామి ఆలోచన బాగుందనిపిస్తోంది మూర్తీ. ఒక దూకు దూకితే గానీ అటో ఇటో తేలిపోదు. ఖాళీ గ్లాసులో చీమలా అంగుళం పైకి పోనూ రెండంగుళాలు క్రిందికి జారనూ- ఎన్నాళ్ళిలా జారుడు మెట్లమీద పల్టీలు కొట్టటం. ఈ వానపాము బతుకు లాభంలేదు. ఏదో ఒకటి చెయ్యాలి"

"ఏం నీకూ ఏదో పురుగు తొలుస్తోంది" అని పరిహాసంగా అన్నాను.

"అవును. ఎవరెస్ట్‌ను ఎక్కాలనుకున్నా, మొదటి అడుగుని నువ్ వేయాల్సిందేగా. ప్రపంచంలో అన్ని విజయాలు ఒక నిర్ణయం తీసుకోవడంతోనే మొదలౌతాయ్.. చూద్దాం. నేనూ స్వామిని అనుసరిస్తే - రేపొద్దున్న -

మూర్ఖపోబోకు" అన్నాడు.

మేము మా ఇళ్లదారిపట్టాము.

నెలతిరిగే సరికి ఉమాపతి కూడా మా కంపెనీని వదిలేసి వెళ్లిపోయాడు.

ఇన్నాళ్లకిన్నాళ్లకి....

మళ్లీ ఉమాపతి కలిశాదు.

రాత్రి అతనన్నాదు, " ఇప్పుదు చెప్పుమూర్తి. నేను ఉద్యోగం నుంచి తప్పుకుంటున్నప్పుదు నువ్వన్నావ్ - ' అదుగు తీసి అదుగు వేసేటప్పుదు జాగ్రత్తగా ఉందాలి. పెద్ద రిస్క్ తీసుకుంటున్నావ్. జీవితం అంటే కాస్తంత భయమూ, మరికాస్త భీతి అవసరం'అని నీ హెచ్చరికల్ని విని సన్నగా నవ్వేశాదు గుమాస్తా ఉమాపతి. ఇవ్వాళ - చూశావుగా నా ప్రోగ్రెస్ ఇప్పుదు చెప్పు" అని రిమ్‌లెస్ కళ్ళజోదు సవరించుకున్నాదు ఉమాపతి.

నేనేం చెప్పగలను?

దిక్చక్రం కళ్లముందు తిరిగింది.

బియ్యే ఫైనలియర్. మొదటి పరీక్ష రాశాను. ఆ రాత్రి నాన్న పోయాదు. తర్వాత పరీక్షలు వ్రాయలేకపోయాను. కర్మాంతరాలు చివరిరోజున మా పెద్దనాన్న చెప్పాదు;

'జీవితం నీకు ఎప్పుదు ఏమి ఇస్తుందో దాన్ని స్వీకరించు. ఇది రాలేదనీ, అది కాలేదనీ ఆలోచనల్తో కుంగిపోయి కూర్చోకు'

ఉద్యోగం, పెళ్లి, సంసారం, పిల్లలు, చెల్లెళ్ల పెళ్లిళ్లు, తమ్ముళ్ల చదువులు

అన్నీ ఒక వరుసలో జరిగిపోయినై.

ఇవ్వాళ్టికీ, నేను గ్రాడ్యుయేట్‌ని కాదు. గోర్రెతోక ఉద్యోగం; మధ్యమ పురుషుడి నత్తనడక; నెలాఖరుకు భయం భయం!!

ఇదీ నేను. నేనేం చెప్పగలను ఉమాపతికి?

ఒక నెల రోజుల తర్వాత,

ఆఫీస్ పనిమీద బెంగుళూరులో మకాం చేయాల్సి వచ్చింది. గెస్ట్ హౌస్‌లో దిగాను.

....తెలతెలవారుతోంది. తాగిపడుకున్నవాడిలా మసలుతోంది నగరం.

నేను కాఫీకోసం గెస్ట్‌హౌస్‌ముందుకు వచ్చి నిలబడ్డాను. ఇంకా హోటళ్లు తీయలేదు. సిగ్గు సిగ్గుగా వీస్తోంది చల్లగాలి. అటూ ఇటూ చూస్తున్నాను. ఎదురుగా సందులో ఒక బండి కనిపించింది. రోడ్డు దాటి అటుగా వెళ్ళాను.

కాఫీ చెప్పి దిక్కులు చూస్తున్నాను. ఆకాశం కలనేత చీరెగా తయారౌతోంది. మబ్బు బొమ్మలు పల్చబడుతున్నై.

కాఫీ గ్లాస్ చేతికి అందించి నాకేసి తేరిపార చూశాదు అతను. ఒక్క క్షణం ఆగి " మీరు మూర్తిగారు కాదూ?" అన్నాడు.

నేనూ గుర్తుపట్టాను. అవును....అతను స్వామి!

నేను సంభ్రమంతో బ్రమాన్పడిపోయాను!

ⓞⓞⓞⓞⓞ

ఆ రాత్రి

గెస్ట్‌హౌస్‌కు వచ్చి బలవంతాన తన ఇంటికి తీసుకువెళ్లాడు స్వామి.

జరిగిందంతా వివరించారు భార్యాభర్తలు.

"ఒక మంచి ఆశించాం. రెండు చెడులు జరిగినై. ఇదొక చేదు అనుభవం, పీడకలా. చిల్లర ఏరుకోవడంతో మళ్లీ మొదలైంది మా జీవితం" అంది సరోజిని. కదలిక లేని నదిలా అనిపించింది. ఆమె కళ్లల్లో తడిని గమనించాను. గాలి బిగదీసినట్లయింది నాకు.

చివరగా అన్నాడు స్వామి, " నావిషయంలో మీరు చెప్పే అన్ని సిద్ధాంతాలకీ విఘాతమే వచ్చింది. చిన్నచేపలు మింగేసినై నన్ను. డ్రైవర్లూ క్లీనర్లూ కలిసి నిర్దాక్షిణ్యంగా కట్టు బట్టలతో మిగిల్చారు మమ్మల్ని."

మనస్సు కలుక్కుమంది.

హఠాత్తుగా ... ఉమాపతి కోట్ల విలువైన హోటల్, దానికి ధీమాగా, దీటుగా ఉన్న బంగళా, నెలకి ముప్పైవేలు మాత్రమే అద్దెల్ని యిచ్చే కమర్షియల్ కాంప్లెక్స్- అన్నీ గిర్రున నా కళ్లముందు కదిలినై.

తాడు పేనటం తెలిసినవాడికి గట్టి ఉయ్యాలలే లభిస్తాయ్, నట్టు పట్టుతప్పిపోనిస్తే మహామహా యంత్రాలైనా కుంటుపడిపోతాయ్!

బహుశా శాస్త్రం ఇంతవరకే చెబుతుందికాబోలు, సమన్వయం ఎవరు చేయాలి మరి?!

ఇదంతా సరి. సరోజిని అన్న రెండో చెడు సంగతి? వాళ్ల పెద్ద కూతురు ఒక జన్మకు సరిపడ కుళ్లి కుళ్లి ఏడ్చి నిద్ర మాత్రల్ని సేవించి చనిపోయిందట. ఎవడు ఆ మోసగాడు అని నేనడగలేకపోయాను, వాళ్లని.

అనుభవాలే జీవితానికి అర్థాలు మారుస్తాయేఏమో?

గాయపడిన గుండె లోయలు - షనుభవాలకి కొత్త భాష్యాలు చెప్తూనే

వుంటాయి కాబోలు!

వీటన్నిటినీ అవగాహన చేసుకోగలదా- నా వంటివాడి జిజ్ఞాస? బొంగరం తెరుగుతోంది! ఏ సూత్రాలకి ఏది కట్టుబడి వుంది? ఏమో???

చీకటి మీదపడి బెంబేలెత్తిస్తోంది, నన్ను!

చీకటి మీదపడి బెంబేలెత్తిస్తోంది నన్ను!!!

( పల్లకి వినూత్న వారపత్రిక 10 ఫిబ్రవరి 1993.)



# సులోబు కథ

దాన్ని మేము సులోబు అనేవాళ్లం. అసలా పేరు ఎలా వచ్చిందో 'ఇంగ్లీషు స్లోప్' కాబోలు! వంకర టింకరై సులోబుగా రూపుదిద్దుకుంది. అదే-లెవెల్ క్రాసింగ్!

దానికి ఆ వైపు–గూడెం వెళ్లే డొంకదారి, ఈ వైపు పాలెం కంకర్రోడ్డు.

పాలెం రోడ్డు పనస చెక్కలా ఉండేది. గూడెం దారి తాటి మట్టలా సాగేది.

సులోబు పక్కన ఒకవైపు కలువ కుంట, రెండోవైపు గుర్రపు డెక్క ఆకుల్తో పాత చెరువు. కలువగుంట ఆడపిల్ల చూపులా అనిపించేది. పాత చెరువు తాగినోడి నోరులా వాసనేస్తూ ఉండేది.

గట్టుమీద వోవైపు తాళ్లు, వోవైపు ఈతలూ, తుమ్మలూ.

'పాలెంకీ, గూడెంకీ మధ్య సమ అంతరాన్ని సూచిస్తూ రైల్వే లైను!

సులోబుకి... తరాలూ, అంతరాలూ, తరాంతరాలూ, అంతరాల తరాలూ....అన్నీ తెలుసు.!

పాలెం పారిజాతం, గూడెం గున్నయ్యా తనకాడే ఊసులాడుకోవడం బాస చేసుకోవడం అన్నీ సులోబుకి తెలుసు!

దోసిట్లో చీకటి పెట్టుకొని పారి పోయిన పంతులమ్మ కథా, కరణం గారి వాముల దొడ్డిలో దెబ్బలు తిన్న మంగి వ్యథా... సులోబు రాయికి ఎరికే!!

పంతులమ్మకి మునుసబు మిగిల్చిన మచ్చకీ, మంగికీ కరణం కొడుకు వేసిన 'దొంగ' ముద్రకీ ఆరాయి చెమర్చింది. అదీ అర్థరాత్రి రాలుచుక్క సాక్ష్యంగా!

అందుకే, మా పద్మనాభం ఆ రాయిని "ఇది జలగర్భ శిలరా" అనేవాడు. వాడి కథ విని కూడా అది అలాగే చెమ్మగిల్లింది మరి!

పద్మనాభం అడకత్తెరలో పోకచెక్క. ఇటు సవత్తల్లి, అటు సొంత తండ్రీ...

ఎప్పుడూ పిడికిళ్ళు బిగించడం, పళ్ళు కొరకడం, డొక్కచించి డోలు కట్టడం!!

సులోబుకి మా జట్టంటే చాలా ముచ్చట. మేమంతా మరి కిష్కింధ సంతతి వాళ్లం!

తీగె మేకుల్ని రైలు పట్టాల మీద పెట్టి దూరంగా పరు గెత్తుకుపోయి నిలబడటం. రైలు వెళ్లిన తరువాత సాగి, చచ్చుపడి బద్దలా మారిన మేకుల్ని తెచ్చుకోవడం సత్యంకి అదో సరదా. వెర్రి ఆనందం. "పట్టాల్లేని ఇంజన్ తయారు చేస్తానురా... పెద్దయితే" అంటూ ఉండేవాడు. వాడి కళ్లలో కోటి ఇంజన్‌ల హెడ్‌లైట్లు!

వెంకటేశ్వర్లుకి గ్రీజ్ కడ్డీలు కావాలి. ఔటర్ సిగ్నల్ దగ్గర ఏదో రైలు ఆగుతూ ఉండేది. వెంటనే వెంకటేశ్వర్లు అక్కడ ప్రత్యక్షం. డ్రైవర్‌తో 'బట్లర్' ఇంగ్లీష్ మాట్లాడేవాడు. డ్రైవర్ వో నాలుగు గ్రీజ్ ముక్కలు విసిరేవాడు. అవి తీసుకొని ఒకటే సంబరపడే వాడు.

ఆ గ్రీజ్‌తో రకరకాల బొమ్మల్ని చేసి చూపుతూ ఉండేవాడు. తానోపెద్ద శిల్పినన్నట్టు!

పున్నారావ్ మా జట్టులో బండవెధవ!

వాడు తాటి గెలలూ, ఈత గెలలూ దించడంలో అందెవేసిన చెయ్యి!

పందెం కాసి తాటి ముంజలు తినేవాడు. రాత్రికి మా ఇంటికి వచ్చి 'పెద్దమ్మా... ఆవకాయ, అన్నం రానీ' అని కూచునేవాడు. పెరట్లో అరటి ఆకుని కోసుకొచ్చేది నా చెల్లెలు వరాలు!

నిజానికి సులోబు మా అందరి సహోదరి! నిజానికి సులోబు మా అందరి గుండెల దరి!

ఓపికలేక వదిలేసిన హోమ్ వర్క్ సాక్ష్యమూ, వర్షంలో తడిసి, నీరు పిండుతున్న చొక్కాల ఎక్కాల భాష్యమూ, సులోబే!

అదిగో...

సులోఖుకి దగ్గరగా....

నిమ్మళంగా సాగుతోంది దున్నపోతులబండి. దానిమీద వడ్ల గింజల బస్తాలు.

వెనగ్గా... జేబుల్లో గోళీలతో, చేతుల్లో ఈతకాయల్తో మా జట్టు- నేను, వెంకటేశ్వర్లు, పున్నారావు, సత్యం, పద్మనాభం. నెమ్మదిగా వస్తున్నాం.

సులోఖుమీద ఆగిపోయింది బండి.

బసవయ్య బాబాయి దున్నపోతుల్ని చెర్నాకోలతో అదిలిస్తున్నాడు; కొడుతున్నాడు; మధ్య మధ్య తిడుతున్నాడు. దాపటెనుపోతు మొండికేసింది.

దూరంగా రైలు కూత!

బసవయ్య గుండెల్లో గుబులు. పట్టాల మధ్యలో వుంది బండి! మా అందరికీ వినోదం, సంబరం!

'అరేయ్... వో చెయ్యెయ్యండ్రా' పిలిచేడు. కాదు అరచాడు! మాకు వొకటే నవ్వు!

పట్టాలు అదురుతున్నై.

కోపంగా చూస్తూ మళ్లీ గట్టిగా అరచాడు. 'ఒరేయ్ ప్రకాశం చూస్తారేరా... రండిరా'

నేను మా వాళ్లకి సైగ చేశాను.

విద్యుద్దీతలా కదలిక!

ఒక్క తోపుతో కదిలింది బండి!

క్షణంలో పల్లంలోకి పరుగో పరుగు!

రైలు వెళ్లిపోయింది. పెట్టెల్లో నిలబడిన ప్రయాణికులకీ... మా నుంచి చిత్ర విచిత్ర భంగిమల్లో ప్రశ్నలూ, పొలికేకలూ, వెక్కిరింతలూ, వ్యాఖ్యలూ!!

మేమంతా ఒక్కొక్కరాయిమీద ఒక్కొక్కళ్లం కూర్చున్నాం. ఈత పళ్లు నములుతున్నాం.

ఎక్కణ్ణుంచో...

గాలి మోసుకొస్తున్న పుష్ప విలాపం!

దూరంగా డొంకపక్క తురాయి చెట్టు కొమ్మల్లో... గొడ్లకాపరి. వెదురు గొట్టంనుంచి..

ప్రాణ స్వరాల్ని వొలికిస్తున్నాడు.

'బుద్ధదేవుని భూమిలో పుట్టినావు'!

ఏదో ధరణీ రహస్యాలు చెప్తున్నాడు!

దాని ముందు పద్యాలూ, దాని తరువాత పద్యాలూ చదువుకుంటూ ఇళ్లకేసి సాగేము.

అన్నం పెడుతూ చెప్పింది అమ్మ, 'బసవయ్య బాబాయి పంపించాడురా... గడ్డ పెరుగు వేసుకో. బుట్టెడు మొక్కజొన్న పొత్తులూ పంపాడు. సులోబుకాడ పెద్ద సాయం చేశారంటగా ... మీరంతా?

మనసంతా... రేగడి పెరుగే అయింది నాకు! మా జట్టులో అందరికి బాబాయి చల్లదనమే ఆరాత్రి! సులోబూ, రైలు పట్టాలూ...రెక్కలు ఊపుకుంటూ నా మేధస్సులో గిరికీలు కొట్టసాగినై.

బసవయ్య బాబాయి నాచుట్టూ ఒక అభిమాన ప్రాంగణం రచించి ఇచ్చాడు.

... ముప్పై ఏళ్ల తరువాత....

ఇవాళ

మా సత్యం.... సెక్రటేరియట్‌లో గుమాస్తా. వెంకటేశ్వర్లు తెనాలిలో క్లాత్ మర్చెంట్‌ట. పున్నారావు ఎక్కడున్నాడో తెలియదు. పద్మనాభం టీచర్. నేను సరే...

చిత్రకారుడిగా స్థిరపడ్డాను.

బసవయ్య బాబాయి కీర్తిశేషుడై నా స్మృతి ధారలో కదుల్తూ నిలిచాడు. అవును, మనిషి శాశ్వతం కాకపోవచ్చు కానీ, అతను పంచిన మనసు చిరంజీవి!

అన్నట్టు... మా సులోచుకీ కరెంటు వచ్చిందట. ఇప్పుడు దాని 'కతే' వేరు!

(పల్లకి విన్నూత్న వారపత్రిక 24 ఫిబ్రవరి 1993.)



# పది గెలుపు

ఆమె వెళ్ళిపోయింది.

పదిహేను నిమిషాల క్రింద జరిగింది చెప్తాను.

వీడియోలో జేమ్స్‌బాండ్ 'నెవర్ సే – నెవర్ ఎగైన్' చూస్తున్నాను. కాలింగ్ బెల్ మోగింది. వెళ్ళి తలుపు తీశాను. ఎదురుగా – ఆమె! ఆశ్చర్యంతో శిలలా అయిపోయాను.

"లోపలికి రానివ్వండి" సన్నగా నవ్వుతూ అంది. ఉలిక్కిపడి పక్కకు తప్పుకున్నాను. ఆమె లోపలికి వచ్చి టేబుల్ ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంది. వీడియో వాల్యూమ్ తగ్గించి, నేను బెడ్ చివరగా కూర్చున్నాను.

"చల్లకొచ్చి ముంత దాచటం కాకుండా సూటిగా చెప్పాను." కుర్చీని నా వైపు తిప్పుకుంది. టేబుల్ మీద గ్లాస్ పేపర్‌వెయిట్‌ని చేతిలోకి తీసుకుంది. "వారం నుంచీ మీరు ఈ హోటల్‌లో వున్నట్లు తెలుసు," నా కళ్ళల్లోకి చూస్తూ చెప్పింది... "నేను మిమ్మల్ని చేసుకోవాలనుకుంటున్నాను."

గుండె చిక్కపట్టినట్లైంది. నిలువు గుడ్లతో అలాగే చూస్తూ ఉండిపోయాను. నవ్వింది.... గాజు పెంకుల్ని సీసాలో గలగల లాడించినట్లు.

"ఎవరో కవి... వాక్యంలోనించీ జారి పడ్డ క్రియని పట్టుకుంటానన్నాడు. అలాగే నా వాక్యంలోనించీ జారిపోయిన పదాన్ని మీరు పట్టుకున్నారు కదా. అదేనండీ...పెళ్లి." అమె గలగలా మాట్లాడేస్తోంది. మళ్లీ చెప్పింది.."నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకొంటున్నాను. నా గురించి మీకు కొంత వరకూ తెలుసు గదా! మిగిలిన వివరాలు తీరిగ్గా ఆ తర్వాత చెప్పాను. మీ గురించి నేనేమీ అడగను."

నాకు తల దిమ్ముగా ఉంది. ఈ హఠాత్సంఘటన నుంచీ తేరుకోలేక పోతున్నాను. మాట్లాడకుండా కూర్చున్నాను.

ఆమె లేచి నిలబడింది. టీపాయ్ మీద జగ్‌లో నీళ్ళని గ్లాస్‌లోకి వంచి "తీసుకోండి," అంటూ నా ముందుంచింది. నేను గటగటా తాగేశాను. ఆ వెంటనే

అక్కడే వున్న ఫ్లాస్క్‌ని తీసుకుంది. మూత తీసి చూసింది. "అరె! టీ వుందే, గుడ్" అంటూ రెండు కప్పుల్లోనూ పోసింది. ఒకటి తను తీసికొని, ఒకటి నాకిచ్చింది. మంత్రముగ్ధుడిలా తాగేశాను. తనూ పూర్తిచేసింది. రెండు కప్పుల్నీ తీసి గోడ వారగా వున్న టేబుల్ మీద పెట్టింది.

క్షణాల తర్వాత ... "నే వెళ్ళొస్తాను. రేపు మాట్లాడుకుందాం మళ్ళీ," అంటూ నాటకంలో పాత్రలా నిష్క్రమించింది.

ఆమె చొరవకి ఆశ్చర్యపోయాను. నన్ను నేను సంబాళించుకున్నాను. తలుపు వేసి వచ్చి బెడ్ మీద పడుకున్నాను. "నా గురించి కొంతవరకూ తెలుసుకదా?" ఆమె మాటలు గుర్తుకొచ్చినై.

ఆలోచనల్లో వెనక్కి నడిచాను.

ఆరోజు...

ఉదయం ఆరు గంటలు...

నేను దాదర్ స్టేషన్‌లో ప్లాట్‌పారమ్‌మీద పచార్లు చేస్తున్నాను. మీనార్ ఎక్స్‌ప్రెస్‌లో మా అక్కయ్య రాధ, మేనల్లుడు రామం రావాలి. వాళ్ళని రిసీవ్ చేసుకోవటానికి స్టేషన్‌కి వచ్చాన్నేను. మీనార్ ఒక గంట లేటన్నారు.

లేడీస్ వెయిటింగ్ రూమ్ గుమ్మంలో నిలబడి పిల్చింది ఆమె. "సార్" అంటూ... ఆమె సల్వార్ కమీజ్‌లో వుంది. నడక ఆపి, అటుగా వెళ్ళాను. ఆమె పక్కగా మరో యువతి. నన్ను పిలిచిన అమ్మాయే చక్కటి ఇంగ్లీషులో అడిగింది. "ఈ వూళ్ళో ఒక ఫేమస్ సోప్ ఫ్యాక్టరీ వుంది. దాని అడ్రస్ తెలుసా సార్ మీకు?" ఒక్క క్షణం వాళ్ళని తేరిపార చూశాను. ఒకటి రెండు పేర్లు చెప్పాను. అవి కావని తల తిప్పింది రెండో యువతి. అసలు విషయమేమిటో వివరంగా చెప్పమన్నాను. మళ్ళీ మొదటి అమ్మాయే చెప్పింది.

"ఈమే నేనూ కొచ్చిన్ ఎక్స్‌ప్రెస్‌లో నుంచీ దిగాం. మాది కేరళా. ఇక్కడే సెటిలయ్యాం. ఈమెది ఆంధ్రాట. ఇక్కడ ఎవ్వరూ లేరు. ఈ నగరమూ తెలీదు. మొదటిసారి వస్తోంది. ఆ సోప్‌ల కంపెనీ వాళ్ళకి మోడలింగ్ చేయడానికి వచ్చిందట

పాపం అడ్రస్ తెచ్చుకోలేదు."

ఆశ్చర్యంగా చూశాను ఆ రెండో యువతి వైపు. ఇరవై రెండేళ్ళ వయస్సు. చక్కటి స్ఫురద్రూపం. కళ్ళల్లో చిత్రమైన మెరుపు. ముఖం ప్రయాణ బడలికితో వడలినా, ప్రసన్నంగా, ప్రశాంతంగా వుంది. ఎర్రంచు తెల్ల పూల చీర మీద ఎర్ర జాకెట్. చెవులకి పెద్ద పెద్ద రింగులు. మెళ్ళో ఒంటిపేట గొలుసు. దాని మధ్యన్న చిన్న లాకెట్‌ని మునిపంట ఆడుకుంటూ సన్నని సిగ్గుతో నాకేసి చూసింది ప్రాధేయపూర్వకంగా.

"ఏ వూరి నుంచి వచ్చారు?" అప్రయత్నంగా తెలుగులో అడిగాను.

"అరే మీరు తెలుగువాళ్ళా?" ఎంతో రిలీఫ్‌తో అడిగింది. ఎగిరి గంతేసినట్లైంది. "ఊ" అంటూ తలతాటించాను. "చిత్తూరు" చెప్పింది.

ఇంతలో ఆ కేరళ అమ్మాయి అంది "కొంచెం ఈమెకి సాయం చెయ్యండి సార్ మీరు. నే వెళ్ళొస్తాను. మా యింటికి చాలా దూరం పోవాలి. పైగా ఈ రోజు ఆఫీస్‌కి కూడా అటెండవ్వాలి నేను. ఎక్స్‌కూజ్‌మీ" అని నా సమాధానం కోసం ఎదురు చూడకుండా తన బాగ్ తీసుకుంది. "ఓకే నీలా, వస్తాను బై బెస్టాఫ్‌లక్" అంటూ చకచకా వెళ్ళపోయింది.

నీలా, నేనూ నిలిచిపోయాం... "ఎట్లా? ఇప్పుడేం చేద్దాం? మీ దగ్గర వాళ్ళు రాసిన లెటరేమైనా వుందా? దానిమీద ఫోన్ నెంబరేదైనా వుందేమో"?

నా మాటలకి ఆమె అదోలా చూసింది. "ఆ కంపెనీ పేరే గుర్తులేక నేనేడుస్తుంటే లెటరంటారేమండీ. లెటరుంటే మిమ్మల్నెందుకు పిల్చేవాళ్ళం అసలు?"

ఆమె ప్రశ్నించిన తీరులో విసుగుదల కన్నా, "ఈ మాత్రం అర్థం చేసుకోలేవా ఫూల్?" అన్న ధ్వనే నాకు బాణంలా తగిలింది. ఆలోచనలో పడ్డాను.

"ఇక్కడ కూర్చుందాం రండి," అంటూ పక్కనున్న బెంచీ మీద కూలబడింది. నేనూ కూర్చున్నాను. "ఇంకా కొన్ని సోప్‌ల పేర్లు చెప్పండి" అంది. నేను వరసగా చెప్పుకుంటూ వెళ్ళాను. "ఆ... అదే... అదే" అని ఒక పేరుని పట్టుకుంది. "అవును అదే ఫ్యాక్టరీ" అంది. నేను హమ్మయ్య అనుకున్నాను.

ఇద్దరమూ బయటకి వచ్చాము. ఎదురుగా ఉన్న హోటల్లోకి నడిచాం. కాఫీకి అర్డరిచ్చి, టెలిఫోన్ డైరక్టరీ అడిగి తీసుకున్నాను. గబగబా పేజీలు తిరగేశాను. ఆమె నా పక్కగా జరిగి ఆత్రుతగా చూస్తూ వుండటం గమనించాను. ఆ పేరు మీద ఎలాంటి టెలీఫోనూ లేదు. సప్లిమెంట్‌లో కూడా చూశాను. అక్కడా కనపడలేదు. ఆమె వైపు చూస్తూ పెదవి విరిచాను.

హోటల్లో చాలా మంది మా వైపు పరీక్షగా చూడసాగేరు.

కాఫీ పూర్తిచేసి, మరి కొన్ని నిమిషాలు మౌనంగా కూర్చున్నాం. నాకొక ఆలోచన తట్టింది. లేచి బిల్ చెల్లించి బయటకు నడిచాను. ఆమె నన్ను అనుసరించింది.

టాక్సీ వాళ్ళు ఎదురొచ్చారు. ఆమే, నేనూ ఏదో అడ్రస్ కోసం వెతుకున్నామని పసిగట్టి ఏవో ప్రశ్నలు కురిపించారు. వాళ్ళని తప్పించుకొని స్టేషన్‌లోకి వచ్చాం.

"మీరు ఆ వెయిటింగ్ హాల్‌లోనే కూర్చోండి, వస్తాను" అంటూ మరోవైపు కదిలాను. లోలోపల నాకు ఆమె మీద చాలా కోపంగా ఉంది. పేరూ అడ్రసూ లేకుండా బొంబాయి లాంటి మహానగరానికి ఒంటరిగా ఎలా వచ్చినట్టు? ఎందుకు వచ్చినట్టు? ఇప్పటికే చాలా మంది మమ్మల్నీ, మా వాలకాన్ని గమనించి అనుమానాస్పదంగా చూస్తున్నారు. ఆమెని అలాగే వదిలేసి, నేను నా పనిమీద వెళ్ళిపోతే, ఆమె గతి ఏమౌతుంది? నన్ను కాకుండా మరొకర్ని ఎవర్నైనా అడిగి వుంటే... ఏమయ్యుండేది? తప్పకుండా ఈ పాటికి మోసపోయి వుండేది. ఏవిటో ఆలోచనలు...

అప్పటికి తెరిచిన షాపుల్లో ఆ సబ్బుకోసం అడుగుతూ వెళ్ళాను. చివరికి ఒక షాపులో దొరికింది. కానీ, దానిమీద మద్రాస్ అడ్రస్ వుంది. నాలుగు రూపాయల అరవై పైసలిచ్చి దాన్ని తీసుకొని స్టేషన్‌కొచ్చాను.

ఆమె ఆ బెంచీమీదే కూర్చునుంది. నన్ను చూసి ఆత్రుతగాలేచి నిలబడింది. సోప్‌ని ఆమె చేతిలో వుంచుతూ అన్నాను " ఆ ఫ్యాక్టరీ మద్రాస్‌లో వుంది". ఆమె

నిజంగానే నీరు గారిపోయింది.

ఆ తర్వాత నా ప్రశ్నలూ, ఆమె సమాధానాలు కలిపితే ఇదీ సారాంశం... వాళ్ళది చాలా పెద్ద సంసారం. ఆరేళ్ళ క్రితం తండ్రి పోయాడు. రైల్వేలో గుమాస్తాగా చేసేవాడు. తల్లి వుంది. ఒక అన్న, ఇద్దరు తమ్ముళ్ళూ, నలుగురు చెల్లెళ్ళూ. అన్నే బండి లాగిస్తున్నాడు.

ఏదో బ్యాంక్‌లో ప్యూను. అతనికి పెళ్ళయింది. నీల ఎనిమిదో తరగతి వరకే చదువుకుంది. పొడిపొడి ఇంగ్లీషు పదాలే తెలుసు. హిందీ రాదు. ఏదో పత్రికలో మోడలింగ్ గర్ల్స్ కావాలని చూసి బొంబాయి ప్రయాణమైంది.

అంతా విని కొంచెం కటువుగానే అన్నాను, "గొప్ప ఘనకార్యం చేశారు కానీ... పదండి. మాతో పాటు మా యింటికి రండి. ఆ తర్వాత ఆలోచిద్దాం. స్టేషన్ బయట మరెవరినైనా అడిగివుంటే... ఎవడో ఒకడు పట్టుకుపోయి, ఈపాటికి అమ్మేసి వుండేవాడు."

నీల నావైపు బిత్తరపోయి చూసింది.

"అవును.ఏవిటనుకొన్నారు. ఇది మహా నగరం. క్షణాల్లో మోసం చేస్తారు. అందులోనూ మీకు ఏ భాషా రాదు; చెప్పటానికి ఎవరి పేరూ తెలీదు," అన్నాడు.

నా మొహం లోకి చూసింది.... ఉన్నట్లుండి మేఘం వర్షించింది. కళ్ళనిండా నీళ్ళు. నేను కలవరపడ్డాను. అసంకల్పంగా నా అంత నేను పెద్దరికాన్ని ఆపాదించుకున్నాను. ఆమె భుజం తట్టూ "పిచ్చిపిల్ల, ఏం ఫర్వాలేదు. ఉండండుండండి. అది మాత్రం వద్దు. ఇది చూస్తే జనం నన్నూ మిమ్మల్నీ కదలనీరు. వెళ్లి లోపల కూర్చోండి. మా వాళ్లని తీసుకు వస్తాను" అని కదిలాను.

ఆమె తనని తాను సంబాళించుకొని సూట్‌కేస్‌తో లోపలికి వెళ్ళింది.

అప్పుడే మీనార్ వచ్చి ఆగింది. నేను మా వాళ్ళకోసం చకచకా నడవసాగేను

అక్కనీ, రామంనీ నీలకు పరిచయం చేసి, నీల గురించి టూకీగా వాళ్ళకి చెప్పాను. "ఈమె కూడా మనతో వస్తుంది" అన్నాను అక్కకేసి తిరిగి. నీల నా కళ్లలోకి చూసింది. ఆ చూపుల్లో ఎంతో కృతజ్ఞత!

ఆ సాయంత్రం నీల పడుకుని వుండగా అక్క చెప్పింది, “ఆ పిల్ల... వాళ్ళ వదిన నగలన్నీ తీసుకొని ఎవరికీ చెప్పకుండా వచ్చిందట. ఇంట్లో అవస్థలు చూడలేక సంపాదన కోసం వచ్చేసింది. తిరిగి ఇంటికి పోలేనని ఒకటే ఏడుస్తోంది,” అని కొంచెం కోపంగానూ, నీలను కొద్దిగా తిట్టూనూ మాట్లాడింది. చివరికి “ఏం చేయాలో ఏమిటో,” అంటూ ముగించింది.

నేనూ ఆలోచనలో పడ్డాను.

వారం రోజులు గడిచినై. ఈ వారం రోజుల్లోనూ అక్కా, రామంతో పాటు నీలకి కూడా సిటీ చూపించాను.

ఈ వారం మధ్యలో వోసారి పట్టాభిగారితో మాట్లాడాను. ఆయన నా శ్రేయోభిలాషీ, మంచిమనిషీ. ఆయనకి హైదరాబాద్‌లో ఒక ఆఫ్‌సెట్ ప్రెస్ వుంది. నీలకథ అంతా విని, ఆయన నీలని తనవద్దకు పంపమన్నాడు. ఆ రాత్రి నేను తృప్తిగా నిద్రపోయాను.

మర్నాడు నీల హైదరాబాదు వెళ్ళిపోయింది. ఆ తర్వాత పట్టాభిగారి దగ్గర ఆమె ఉద్యోగం గురించి తెలుసు నాకు. కొన్నాళ్ళ తర్వాత పట్టాభిగారు పోయారు. నీల ఉద్యోగం మానేసి మద్రాస్ వెళ్ళినట్లు తెలిసింది.

ఆరేళ్ళ క్రితం నీల గురించి నాకు తెలసింది ఇదీ!!

ఇన్నాళ్ళ కిన్నాళ్ళకి మళ్ళీ ఇలా ప్రత్యక్షమైంది! ఇన్నేళ్ళకి వొక ఉప్పెనలా వచ్చింది! ఇవాళ... ఆ మనిషిలో ఎంత మార్పు!

నీల– ఆనాడు బేల; ఇవాళ జాణ! నీల – ఆనాడు మూగ బాసల బొమ్మ; ఇవాళ గలగలల కొమ్మ!

నీల తలపులతో ఆ రాత్రి నా నిద్రపోయింది!

మర్నాడు... నేను నా ఆఫీస్ పనులు చూసుకొని హోటల్ రూమ్‌కి చేరేసరికి రాత్రి ఎనిమిదైంది. స్నానం చేసి ఏదో మాగజైన్ చదువుతుండగా వచ్చింది నీల!

“ఏం సార్, రాత్రి మీ మనసంతా పాడు చేసి వెళ్లానా? ఎలా వున్నారు?” అడిగింది కూర్చుంటూ.

"ముందు మీ విశేషాలు చెప్పండి", అడిగాను.

"ఏం వున్నై. మీ దయ వల్ల ఇలా ఉన్నాను. ఈ హోటల్లోనే పనిచేస్తున్నాను," స్వచ్ఛమైన ఇంగ్లీషులో స్ఫుటంగా చెప్పింది. ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాను. "అవును, రెండేళ్ళ క్రితం ఎమ్మే చేశాను. ఇక్కడ చేరి వో నెలయింది. ఆరోజు బొంబాయిలో మీ అక్కగారన్న మాట గుర్తుందా? నేను నిద్రపోతున్నాననుకొని మీతో అన్నది ఆవిడ ... చదువూ సంధ్య లేకుండా ఏం చేద్దామని వచ్చిందో ఇలా. ఎందుకు పనికొస్తుంది ఇలాంటి పిల్ల... ఏ దిక్కుమాలిన పనో చేయడానికి తప్ప, అన్నారు. ఆ మాటలు నా గుండెల్లో శూలాల్లా గుచ్చుకొన్నై. ఆ వేళ నిర్ణయించుకొన్నాను. ఆ దిక్కుమాలిన పని చేయకపోవటమే కాదు... చదువుకొని నేనూ ఒక మనిషి నని నిరూపించుకోవాలని. నా పట్టుదల వల్ల అంతా సవ్యంగా జరిగింది."

నేను గుక్క తిప్పుకున్నాను. "హార్టియెస్ట్ కంగ్రాచ్యులేషన్స్" అన్నాను.

"నా జీవితానికి అర్థం, పరమార్థం చూపిన మీ కోసమే ఎదురు చూస్తున్నాను. జీతం బాగా వస్తుంది లెండి. మీకు తెలుసుగా ఇక్కడి ఉద్యోగాలు", అని వెంటనే టాపిక్ మారుస్తూ... "డిన్నర్‌ని రెస్టారెంట్‌లో చేద్దాం, రెడీ కండి" అంది.

నా మేధలో అనేక ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నై. ఏవేవో ప్రశ్నలు మొలకెత్తుతున్నై.

ఎదురుగా నా పట్ల ఆరాధనతో అగ్నికీలగా నీల! ఆశయ సాధనతో విజయ భావనతో వెలిగిపోతున్న జ్వాలగా... నీల!

నీల కుదుపుతో తెప్పరిల్లాను. ఆమె నా చేతిని తన చేతుల్లోకి తీసుకుంది. "ప్లీజ్, నా ఆహ్వానాన్ని మన్నించండి. రండి" ఆర్ద్రంగా, అభ్యర్థన. చూపుల్లో చూపులు నిలిపింది. ఆమెలో ఎంతో ఉద్విగ్నత!

నెమ్మదిగా చేతిని విడిపించుకుని పక్కకు కదిలాను. ఉపకారాన్ని గురించీ, వారి మంచితనాన్ని గురించీ వివరంగా చెప్పి, అంది నీల

"ఎక్కడో సినిమాల్లో జరిగినట్లుగా జరిగింది నా జీవితంలో మీ పరిచయం.

అప్పట్నుంచీ మీ రూపును నా గుండెల్లో నిలుపుకున్నాను. కాదనరనే నమ్మకం నాకుంది"

డిన్నర్ తర్వాత సెలవు తీసుకుంటూ అంది, "ఇంకో నాలుగురోజులుంటారు కదా. కలుద్దాం మరి". నేను తలూపుతూ ఆగిపోయాను.

ఆ రాత్రే మా యం.డి.కి ఫోన్ చేసి, నా టూర్‌ని అంతటితో కాన్సిల్ చేయించుకున్నాను.

తెల్లవారుతూనే రూమ్ ఖాళీ చేసి బయల్దేరాను. నీల పేర నేను రాసిన లెటర్ రిసెప్షన్‌లో అందించి వెళ్ళాను. ఏం చెప్పగలను? "సారీ నీలా! నువ్వు ఎక్కవలసిన రైలు ప్లాట్‌ఫారం దాటి వెళ్ళిపోయింది!"

ఇంటికి వచ్చి నా శ్రీమతికి చెప్పాను నీలగురించి. అంతా విని వోరచూపుతో అన్నది శారద... "అందుకే మమ్మల్ని తక్కువగా అంచనా వెయ్యవద్దనేది నేను. చూశారా... నీల వ్యక్తి కాదు... శక్తి". 'కాబోలు'... అనుకున్నాను నేను.

అక్కకి ఉత్తరం వ్రాశాను... ఈ వివరాలన్నీ. ఆమె జవాబిచ్చింది, "అందుకే నేననేది...గుడ్డును పగలకొట్టకుండా ఆమ్లేట్ వేయలేమురా... అని. ఒక్కొక్కప్పుడు మాటల్లో కటువుగా ఉండటమూ మంచిదే."

ఆమె జాబుని చదువుకున్న తర్వాత కూడా మళ్ళీ నాలోనేను "కాబోలు!" అనే అనుకున్నాను!

***

(రచన సచిత్ర మాస పత్రిక జులై 1993)



# చెర

చాలా కథలు రాశాను; చాలా కథలు విన్నాను, చదివాను. కానీ, ముత్యం కథ ఇలా ముగుస్తుందని కలలో కూడా ఊహించలేదు నేను!

పథ్యం తిని ఇవాళ్టికి రెండోరోజు. మూడు వారాల టైఫాయిడ్ సుభద్రని పీల్చి పిప్పిచేసింది. ఇంకా త్రాణ రాలేదు. తనకు హార్లిక్స్ ఇచ్చి నేను టీ తెచ్చుకున్నాను. కుర్చీలో ముందుకు వంగి హార్లిక్స్ తాగుతోంది సుభద్ర.

పరీక్షగా ఆమెకేసి చూశాను. అసలే పచ్చని మనిషేమో వొక వన్నె తరిగి, శలాకలావుంది. కళ్లల్లో నీరసం.

'వీళ్లు ఎప్పుడు వస్తారో ఏమో?' అంటూ వచ్చి నాపక్కనే కింద కూర్చుంది. 'ఒక ఉత్తరం ముక్క వేయకూడదూ?' తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నది.

నేను ఏమీ మాట్లాడలేదు.

వారం క్రితం ఉదయాన్నే దిగారు వేణూ, లక్ష్మీ, సుధ, రమణ. వేణు మా అబ్బాయి; లక్ష్మి కోడలు. సుధ, రమణ వాళ్ల పిల్లలు.

కళ్లల్లో ప్రాణంతో వున్నా వాళ్ల యోగక్షేమాల ధ్యాసే సుభద్రకి. టిఫిన్ తెప్పించింది. చకచకా తయారై టిఫిన్ కాఫీలు ముగించారు వాళ్లు.

'బాపట్ల వెళ్తున్నాం. మూడోతేది బుధవారం రాత్రికి మా ఢిల్లీ ప్రయాణం. ఈ లోగా వస్తాం' అంటూ వెళ్లిపోయారు.

బాపట్ల వేణు అత్తగారి ఊరు. తిరుగుప్రయాణంలో మళ్లీ మజిలీ... ఇక్కడ!

ఎప్పుడు వస్తారో తెలీదు. అదీ సుభద్ర ఆందోళన!

నా ఆలోచన పరిపరి విధాలుగా సాగింది.

వెళ్తూ వెళ్తూ వేణూ చెప్పిపోయిన విషయం గుర్తుకొచ్చింది. 'కోటమ్మని పిలిచి మాట్లాడండి. ఎట్లాగైనా సరే ఆమెని వొప్పించే బాధ్యత మీదే'.

కోటమ్మ–కాంతయ్య భార్య. కాంతయ్యంటే నాకు చిన్నప్పట్నుంచీ జతగాడు. ఆ కాలంలో కాంతయ్య తాత మా తాతల దగ్గర పనిచేసేవాడుట. అయినా అన్నదమ్ముల్లా మసిలిన వాళ్ళు. వాళ్ళ రోజులు పోయినై. వాళ్లూ పోయారు. ఆ మళ్లూ మాగాణాలూ.. అన్నీ పోయినై.

నేను టీచర్‌గా కుదురుకున్నాను. కాంతయ్యకి జనపనార తాళ్లు పేనడమే వృత్తిగా మారింది. వేణ్ణీళ్లకి చన్నీళ్లుగా ఒకటి రెండు గేదెల్ని సాకుతోంది, కోటమ్మ. వీళ్లకి నలుగురు సంతానం. నలుగురూ ఆడపిల్లలే. అక్కడక్కడా సంసారాలు చేసుకుంటున్నారు. అయితే పెద్దపిల్ల యశోద వీళ్లతోనే వుంటుంది. ఆమె భర్త వో పుతారూపాయి; తాగుబోతు. వాళ్లకీ నలగురు ఆడ సంతానం. కాంతయ్యకీ, కోటమ్మకీ.. యశోద సంసారం వెన్ను మీద వుందు.

కాంతయ్యకో చిత్రమైన అలవాటుంది. మా వూరినుంచీ పట్నాలకి పోయి ఉుళ్లేవాళ్ల భోగట్టా, ఉద్యోగాలు చేసే వాళ్ల వివరాలూ ఆయనకి కంఠోపాఠం. వీటికో చిఠావుంది.

వాళ్లందరికీ అడపాదడపా వో కార్డు ముక్క గీకుతూ వుంటాడు. దసరాకి జమ్మిపూజ అంటాడు; కృష్ణాష్టమికి ఉట్టి కొట్టాలంటాడు. శ్రీరామ నవమికి పందిళ్ళు, కళ్యాణం అంటాడు. హనుమజ్జయంతికి తాలింఖానాలో సంబరాలంటాడు. మధ్య మధ్యలో భాగవత సప్తాహాలంటాడు. అవీ ఇవీ లేనప్పుడు హరికథలూ, పద్య నాటకాలూ వుండనే వుంటై. తోచిన విరాళం పంపమని విన్నవించుకుంటాడు. వాటితో ఈ హడావిడి అయిందనిపిస్తూ వుంటాడు.

అదుగో... అలా గీకిన ఒక కార్డు ముక్కలో యశోద సంసారం గురించి వ్రాస్తూ... ఆమె కూతురు ముత్యం గురించి వ్రాశాడుట, వేణూకి.

ముత్యంని ఢిల్లీ పంపమని వేణూ అడగడం, కాంతయ్య సరేననడం...

జాబులూ జవాబుల్లో జరిగిపోయింది. ముత్యంని తమతో వుంచుకుంటే ఇంటిపనికి సహాయంగా ఉంటుందని వేణూ లక్ష్మిల ఆలోచన.

ఈ సంగతి కోటమ్మకి తెలిసింది. చాలా సార్లు ఈ విషయం నాతో మాట్లాడింది. మనవరాలు ముత్యంని ఢిల్లీ పంపటం ఆమెకు సుతరామూ ఇష్టంలేదు.

అందుకనే 'ఆ కోటమ్మని ఎలాగైనా ఒప్పించటం మీ బాధ్యత' అంటూ వేణూ నాకు హెచ్చరిక చేసి వెళ్లింది.

నాకు మనసు మనసులో లేదు. హాల్లో పచార్లు చేయసాగాను.

'ఇంటిపనితో కోడలు అస్సలు తెమల్లేక పోతోందిట. వాడికీ ఊపిరాడటంలేదుట. ఇద్దరూ ఉద్యోగాలు వెలగబెడుతుంటే ఇవే ఈతి బాధలు' మాటల్ని కూడగట్టుకుంటూ, నీరసంగా చెప్పుకు పోతోంది సుభద్ర.

'ఆ పిల్లల్ని చూడండి. ఒక మెరుపూ లేదు. నేవళవూ లేదు. రహదారి పక్కన దీపస్తంభాల్లా వున్నారు. ఈ వయస్సులో ఎట్లా వుండాల్సిన వాళ్లు ఎల్లా వున్నారు? వాడికి వాడు మాత్రం చిక్కి పోయి పళ్ల బిగువున తిరుగుతున్నాడు. ఏం ఉద్యోగాలో, ఏం ఊళ్లో. పట్నవాసపు బతుక్కు వొక సుఖమూ లేదూ, శాంతీ లేదు. మొహాల మీద సంతోషాన్ని పులుముకుని తిరుగుతున్నా, ఆ కళ్లల్లో దిగుళ్లూ, ఆ మనసుల్లో బెంగలూ మనకు తెలీకుండా పోతాయ్యా. ఏవిటో... పిచ్చి మొద్దు. వాళ్ల పరిస్థితిని తలుచుకుంటే నాకు బాధగానే వుంది.'

సుభద్ర మనసూ మాటా నాకు తెలీనివి కావు. కొడుకు ఇబ్బందులకి తల్లి గుండె తడి అది! అందుకనే ఆమె మాటలూ చెమ్మగిల్లినై.

అయినా ఎందుకనో ముత్యం విషయంలో వీళ్ల ఆలోచనలు చిట్లిన పాళీతో రాసిన రాతలుగానే తోచినై నాకు. పదేళ్ల ముత్యం నాకళ్లల్లోకి చూస్తూ మా మనవరాలు సుధ పక్కన నిలిచి ఏవో ప్రశ్నల బాణాలు గుప్పిస్తున్న భావనే కలుగసాగింది నాకు.

దీనికి బహుశా నాలోని ఉపాధ్యాయ మనస్తత్వమే కారణమనుకుంటాను!

'అదేంకాదు. మీది మరీ చిత్రమైన తత్వం. ఆకు రాలే చప్పుడూ భరించలేరు. తలుపువేసే సవ్వడీ భరించలేరు. ఎవరికో ఇంజెక్షన్ ఇస్తున్నా మీకు ముల్లు గుచ్చుకున్నట్లౌతుంది. హాస్పిటల్ వాతావరణమంటే బెరుకు, భయం.' ఇలా చాలా ఉదహరిస్తూ పోతుంది సుభద్ర.

కణతలు నొక్కుకుని కళ్ళు మూసుకున్నాను. కళ్ల ముందు రంగులు వెలార్చుతూ దిక్చక్రం తిరుగుతోంది!

చీకటి పడింది.

ఎనిమిదింటికి గుప్పెడు మెతుకులు తిని ఆ లాంఛనం అయిందనిపించుకున్నాం.

పక్కమీదికి చేరేనేగానీ... నిద్ర రావడం లేదు. కలత నిద్ర. ఏవేవో చిత్రాలూ... దృశ్యాలూ...

క్రితం వారం టీ.వి.లో చూసిన సాక్షి కార్యక్రమం. సున్నపుబట్టీల్లో... అగ్గిసెగల్లో పనిచేస్తున్న పిల్లలు. వాళ్లందరి కళ్లల్లో బతుకు భయం. కొలిమితిత్తుల్లాంటి ఊపిరి తిత్తుల్లో, మరమనుషుల్లా...కాళ్లూ చేతులూ వినియోగిస్తున్నా ఆసులో గొట్టాలు! ఏ ముని శాపవశాన్నో భూమ్మీదకి విరిగి పడిన మబ్బు తునకలు! దొల్లలు, నత్తగుల్లలు!

'ఆదివారం సెలవు వుందా?' అని అడిగితే 'ఉంది' అన్న ఆ పిల్ల జవాబు! ఆ వెంటనే 'ఇవాళ ఆదివారమే గదా, మరి పని చేస్తున్నావేం' అని ప్రశ్నిస్తే... మొహం పక్కకి తిప్పుకుని నవ్విన నవ్వు! సభ్య సమాజం మీదికి ఎక్కు పెట్టిన వాడి బాణం కాదూ.. ఆ నవ్వు!

పక్కలో అటూ ఇటూ మసిలాను. టవల్‌తో కళ్లు తుడుచుకున్నాను

నిద్రరాదు. నిద్ర రాకుండానూ వుండదు. మస్తిష్కంలో ఏదో యుద్ధభేరీల

మోత! కళ్లు బరువుగా... రెప్పలు తేలిపోతున్నై. దినపత్రికలో బాలకార్మికుల మీద సీరియల్‌లో సంఘటనలు... విజయవాడ వెళ్తే... పక్కింట్లో చూసిన అగ్గిపుల్లల ఫ్రేములు! పిల్లలు కాంట్రాక్టు తెచ్చి పేరుస్తున్న అగ్గిపుల్లలు. ఉదయం నుంచీ రాత్రి వరకూ విస్తరించిన చిన్నారి చేతుల, చేతి వ్రేళ్లశ్రమ. కాదు శ్రమ నీడ. వారం తర్వాత చేతిలో పడే చిల్లర పైసలు! చెరుకురసం తీసే యంత్రం. ప్రక్కన ఆ రెండు చిన్ని గాజు కళ్లు! హోటళ్లలో కుదురుకుని, కుదించుకుపోయి, కుమిలిపోతున్న క్లీనర్లు. వాళ్ల ఇరుకు బతుకు! దేశంలో నిజంగా చట్టాలు అమలులో ఉన్నాయా?

జీవితాల్ని నలగ్గొడుతున్న సంఘం!

మస్తిష్కంలో శతకోటి ప్రశ్నలు, అనంతకోటి అనుమానాలు! అవ్యక్తమైన ఆవేదన, ఆవేదనకాదు. అంతర్దాహం. కాదు కాదు, అంతర్దావానలం!

***

తెల్లవారింది.

నా పనులన్నీ అయిన తరువాత కాంతయ్య ఇంటికి వెళ్లాను. అంతా వున్నారు. వాళ్ళు చెప్పేవి... సోదలు కలబోసుకోవడం జరిగింది. నేను వచ్చేస్తుంటే... దూడకి పచ్చి మేత తెచ్చుకోవాలంటూ తనూ నాతో కాలు సాగించింది, కోటమ్మ. కొంతదూరం ఆమెతో మాట్లాడుతూ నడిచి నేను ఇంటికి వచ్చేశాను. నా మనస్సులో మాటని కొంచెం గట్టిగానే ఆమెతో చెప్పేశాను. నా సలహాకి ఆమె కళ్లు మెరిశాయి!

మంగళవారం తెల్లవారుతూనే వేణూ, లక్ష్మీ, పిల్లలూ దిగారు. సుభద్ర తాను లేచి ఏదో చేయాలని చూచింది కాని శక్తి చాల్లేదు. సుధ, రమణల్ని పెట్టుకొని గోడకి ఆనుక్కూచ్చుంది. అమ్మమ్మగారింటి కబుర్లు చెబుతున్నారు వాళ్లు.

నేను వెళ్లి కనకమ్మను పిలుచుకొచ్చాను. ఇట్టాంటి అవసరాల్లో వంటా

వార్పుకి ఆమే మాకు సహాయం. సుభద్ర తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

పదిగంటలకి కాంతయ్యనీ, కోటమ్మనీ పిలిపించాను. వాళ్లతోపాటు ముత్యం కూడా వచ్చింది

మాటలు సాగినై. ఇటు వేణూ, లక్ష్మీ, అటు కాంతయ్యా, కోటమ్మా. ఎవరిఇబ్బందుల్ని వారు ఏకరువు పెట్టుకున్నారు. ముత్యంని గమనించాను. సుధ దగ్గర కూర్చుని ఆమె చెప్పే విషయాల్ని ఆసక్తిగా వింటోంది. సుధచేతిలో బోలెడు పుస్తకాలు!

వేణు, లక్ష్మి - కాంతయ్యా కోటమ్మల మధ్య చాలా ఆట నడిచింది. బంతి ఈ కోర్టులోనుంచి ఆ కోర్టులోకి, ఆకోర్టులోనుంచి ఈ కోర్టులోకి మారుతూనే ఉంది. నేను చూస్తూ కూర్చున్నాను. సుభద్ర మధ్యలో ఏదో అనబోయి ఆగిపోయింది.

కోటమ్మ- కాంతయ్య జగడానికి దిగారు. ముత్యంని చదివించి ఉద్యోగం చేయిస్తానంటుంది కోటమ్మ. 'ఉట్టికెక్కలేనమ్మవి, స్వర్గానికి నిచ్చెనలు వేసేమాక' అంటాడు కాంతయ్య. అతని హెచ్చరిక వెనుక అసలైన ఆకర్షణ - పైసలు! కోటమ్మ పట్టుదల వెనుక బలం- ముత్యం తెలివిగల పిల్ల, చదువులో చురుకు, బుద్ధిమంతురాలు అనే నమ్మకం, గురి!

పన్నెండు గంటలవుతోంది. ఉన్నట్టుండి యశోద ఊడి పడింది. వస్తూనే అమ్మానాన్నలమీద ఉరుములు కురిపించింది. మిట్ట మధ్యాహ్నపుటెండలా మిటమిటలాడింది.'పిల్ల తల్లిని, నా ఆమోదం లేకుండా ఏమిటీ చర్చలు?' అని నిలదీసింది.

చాలా సేపు వాళ్ళంతా నీకు తెలీదంటే నీకు తెలీదని ఒకర్నొకరు చివాట్లు పెట్టుకున్నారు. సంప్రదింపులకి ముగ్గురూ కలిసి పెరట్లోకి వెళ్లారు. ముత్యంని పిలిచారు. ఆతర్వాత- వేణూ లక్ష్మి కూడా అక్కడికి వెళ్లారు. మా బాదంచెట్టు ఆకులు వీళ్ల మాటల్ని జాగ్రత్తగా ఆలకించినై.

ఓ పావుగంటకి - ఏడుస్తూ వెళ్లిపోయింది ముత్యం.

వీళ్లంతా లోపలికి వచ్చారు.

క్షణాల తరువాత- కోటమ్మా జారుకుంది, సుభద్ర ఆరోగ్యం గురించి పరామర్శించిన తరువాత.

కనకమ్మ పోసిన కాఫీలతో... వాతావరణంలో పొగలూ, సెగలూ చల్లారినై.!!

కాంతయ్యా, యశోదా వెళ్లబోతుండగా అన్నది లక్ష్మి, 'సరే. నువ్వడిగినట్టే కానియ్. పిల్ల పోషణంతా చూసి ఏడాదికి పదిహేను వందలిస్తాను. మేం వచ్చినప్పుడల్లా తనూ వచ్చి మిమ్మల్ని చూసి పోతూ ఉంటుంది. సరేనా' యశోద మొహం కళకళ్లాడింది. 'అట్టాగే' అంది.

వాళ్ళు వెళ్లి పోయారు. 'యశోద దేవాంతకురాలు.' అంది లక్ష్మి భర్తనుద్దేశించి. 'ఆమె డబ్బు మనిషి అని మీరు బాగానే పసిగట్టారు. అందుకనే బేరం తెగింది.' అని వేణూని మెచ్చుకుంది.

నేను అన్యమనస్కంగా మారాను. ఏదో తెలీని అస్థిమితత్వం మొదలైంది నాలో. ఊపిరి బిగుస్తున్న భావన కలుగుతోంది!!

లేచి వెళ్లి మంచంమీద పడుకున్నాను.

బుధవారం వచ్చింది. మధ్యాహ్నం మూడుగంటలౌతుంది. వాతావరణం మారుతోంది. పైన మబ్బులు కమ్ముతున్నై. గాలి ఒంటికి ఆనడంలేదు. దుమ్ము రేగుతోంది.

సుభద్ర కనకమ్మ దగ్గర కూర్చుని ఏవో వంటకాలు చేయిస్తోంది, పిల్లలకి ఇచ్చి పంపడానికి. వేణూ లక్ష్మి పిల్లలూ గదిలో నిద్రలో ఉన్నారు. నేను టీ తాగి పేపర్లో మిగిలిన వార్తలు చదువుకుంటున్నాను.

అదుగో సరిగ్గా అప్పుడు వచ్చేసింది, ఉప్పెన.

కాంతయ్య, యశోద, ఆమె మొగుడూ మూకుడుగా వచ్చారు. వాళ్ల వెనుగ్గా చాలా మంది ఉన్నారు.

ఉదయం నుంచీ కోటమ్మా, ముత్యం కనపడటం లేదు!

ఆ తర్వాత చాలా రచ్చ జరిగింది. అదంతా ఒక అపస్వరాల పుట్ట. అసహ్య పదజాలాల గుట్ట!

ఆ రాత్రికి

వేణా లక్ష్మీ పిల్లలూ ఢిల్లీ వెళ్లిపోయారు. పోతూ పోతూ వేణా లక్ష్మి జరిగిన దానికంతా నాదే బాధ్యత అన్నట్టు ఒక యాగీ చేసి పోయారు. వాళ్లమాటలకి ఎందుకనో నా మనసు చివుక్కుమనలేదు!!

కిటికీలోంచి బయటికి చూస్తూ కూర్చున్నాను. దూరంగా రావి చెట్టు కొమ్మలు గాలికి ఊగుతున్నై. సన్నగా జల్లు మొదలైంది.

రోజులూ వారాలూ గడిచిపోతున్నై. కోటమ్మా ముత్యంల జాడలేదు. ఎన్నో ప్రయత్నాలు జరిగినై గాని, ఫలితం దక్కలేదు. ప్రశ్న అడగడం, అంజనాలు వేయించడం, జ్యోతిష్యాలు చెప్పించడం అన్నీ విఫల యత్నాలే అయినై. రోజుకోసారి మాయింటి మీద దాడీ, నిందలూ, నిష్టూరాలు సాగిపోతున్నై. ఇళ్లూ, వీధులూ బావురుమంటున్న వాతావరణం నెలకొంది.

ఆరు నెలలు గడిచినై. ఒక నిర్ణయానికొచ్చేశాను నేను. తగిన ఏర్పాట్లు చేసుకున్నాను.

ఆ రాత్రి,

మా శాంతినీ సహనాన్నీ మెక్కి చుట్టచుట్టుకు పడుకున్న ఊరు కొండచిలువకు మేమే వీడ్కోలు చెప్పి వెళ్లిపోయాం.

మా మకాం హైదరాబాదుకు మారింది.

రెండేళ్లయింది.

ఆకాశం నిర్మలంగా ఉన్నప్పుడూ, ప్రశాంతమైన సాయంత్రాల్లోనూ, పచ్చని చెట్లూ, రంగురంగుల పూలూ, గాలికి అలవోకగా ఊగుతున్నప్పుడూ, బిర్లా మందిరం దీప కాంతుల్ని ఆనందిస్తున్నప్పుడూ....

నాకు కోటమ్మా, ముత్యం గుర్తుకొస్తూనే వుంటారు.

నా ఆశాభావం మీద నాకున్న నమ్మకం కన్నా... నా మాట మీద తనకున్న విశ్వాసం గట్టిదని నిరూపించిందా కోటమ్మ? అనిపిస్తూ వుంటుంది నాకు.

అంతలోనే ఒక జటిల ప్రశ్నా ఎదురుగా నిలుస్తుంది. 'నిజంగా వీళ్లిద్దరూ ఏమైనట్లూ?'

ఏమో... విపులాచ పృథ్వి!!

ముత్యంని విద్యాధికురాలిగా, ఉన్నతోద్యోగినిగా చూడాలనే ఆశ, ఆకాంక్ష... స్వర్ణాక్షరాలుగా నా హృదయఫలకం మీద అలాగే నిలిచి వెలుగుతూనే

ఇదంతా కథే అయివుంటే దీన్ని సుఖాంతమో దుఃఖాంతమో చేయడానికి మరో పదిపంక్తులు వ్రాయవచ్చు. సారీ సార్! ఇది సూదిమొన లాంటిజీవితం. అందుకనే వాళ్లింకా నాకు తటస్థపడలేదు.

అన్నట్టు ఇవాళ మా వేణు ఉత్తరం వ్రాశాడు. బాపట్ల నుంచి సీత అనే పిల్లని పిలిపించుకున్నారుట. ఇంటి పనులకోసం!

ముత్యం గురించి ఇంత చెప్పిన తర్వాత, సీత గురించి మిమ్మల్ని అడగడమే ఉచితమనిపిస్తోంది. చెప్పండి మరి!!!

(జాగృతి - స్వదేశీ పారిశ్రామిక ప్రత్యేక సంచిక 1992)

# పరిధి

పన్నెండేళ్లు దేశమంతా తిరిగి తిరిగి మళ్లీ ఆంధ్రప్రదేశ్ చేరుకున్నాం.

ఈ పన్నెండేళ్ళలో....

మా అమ్మాయి రమ పెళ్లి అయింది.

దానికొక బాబు. మా పెద్దవాడు రఘు. బ్యాంక్‌లో ఆఫీసర్‌గా చేరాడు. రమణ ఇంజనీరింగ్ మూడవ సంవత్సరంలో ఉన్నాడు.

తన షష్ఠిపూర్తికి రమ్మని మరీ మరీ రాస్తే... హైదరాబాద్ వెళ్ళి వచ్చాను.

అదిగో....,

అప్పుడు మాటల మధ్యన శారద గురించి చెప్పింది- వదిన. ఆ విషయం విని నాకు నోట మాట రాలేదు.

కొంత సేపటికి తెప్పరిల్లాను. "వాళ్ళిప్పుడు ఎక్కడుంటున్నారు?"

"నీకు తెలీదు కదూ, ఇక్కడే. ఇదివరకు మీరున్న కాలనీలోనే ... రామమందిరం వీధిలో, ఇల్లు కొనుక్కున్నారు".

శారదా వాళ్ళింటికి వెళ్ళొస్తానని బయలుదేరాను.

వదిన చెప్పిన గుర్తుల్ని బట్టి ఇల్లు తేలిగ్గానే గుర్తుపట్టాను. గేటు నుంచీ వరండా క్రింది మెట్లవరకూ దారికిరువైపులా రకరకాల గులాబీ మొక్కలు, వాటికి వెనగ్గా ఒకవైపు... ఆకు కూరలు, కాకర, పొట్ల మొదలైన పాదులూ వున్నై. రెండోవైపు రంగురంగుల బంతులతో పాటు, వివిధ రకాల చేమంతులూ వున్నై. డిసెంబర్ నెల అవటం వలన కాబోలు... మొక్కలన్నీ పచ్చగా నవనవలాడుతూ విరగబూసి వున్నై. అప్పుడే నీళ్ళు పెట్టడం వలన సాయంకాలపు నీరెండ మొక్కల మీద పడి అవి వింతగా మెరుస్తున్నై.

కాంపౌండ్ వాల్‌కు బయటవైపు రోడ్డు ప్రక్కగా పద్నాలుగు పదిహేను

సంవత్సరాల పిల్లలు క్రికెట్ ఆడుతున్నారు. ఎదురింటి వాకిట్లో ఆడపిల్లలు షటిల్ ఆడుతున్నారు. ఇరుగు పొరుగు పిల్లలు పదిమందిదాకా చేరినట్లున్నారు.

నా పిల్లల చిన్నతనం గుర్తొచ్చింది. సన్నగా నవ్వుకున్నాను.

గేటు తీసికుని లోపలికి నడిచేను.

నన్ను చూసి అప్రతిభులైపోయారు శారదా, ఆమె భర్త మధు.

కుశల ప్రశ్నలు అయినై. కాఫీలు కలపటానికి వంటింట్లోకి నడిచింది శారద. నేనూ ఆమెని అనుసరించాను. నా రాకకి కారణం చెప్పాను. చిన్న చిన్న విషయాలు మాట్లాడుకున్నాం.

-హాల్లో కూర్చుని ముగ్గురం కాఫీలు త్రాగుతుండగా ఇంటిని గురించి తాము పడిన అవస్థలు చెప్పింది శారద.

ఇంతలో... సుడిగాలిలా వచ్చాడు కృష్ణ.

“డాడీ అప్పుడే వచ్చేశారా. కొత్త కేసెట్లు తెచ్చాను... చూస్తారా” తండ్రి పక్కన కూర్చుంటూ అన్నాడు. అతనికి సినిమాల పిచ్చి. ఇంట్లో వి.సి.ఆర్ వుండదంతో ఎప్పుడూ ఫ్రెండ్స్ దగ్గిర కానీ, అద్దెకు తెచ్చి అయినా కానీ వేస్తూనే వుంటాడుట.

కృష్ణ శారద రెండో కొడుకు. పెద్దవాడు దినకర్, కృష్ణ తర్వాత ఉష. ఉష తర్వాత వసంత.

కాస్సేపు సినిమాల మీద కబుర్లు సాగినై. వాతావరణం ఉత్సాహంగా మారింది.

ఒక గంట గడిచింది. నేనూ, శారదా వంట ప్రయత్నంలో పడ్డాము. హాల్లో - తండ్రీ కొడుకుల నవ్వులు వినపడుతూనే వున్నై. కూర తరగుతున్నంతసేపు కృష్ణను గురించి సణుగుతూనే వుంది శారద.

శారద వైపు పరీక్షగా చూశాను. వయస్సు తెచ్చిన శారీరకమైన మార్పుతప్ప ఆమె మనస్తత్వం ఆనాడు ఎలా వుందో ఈనాడూ అలాగే వుంది. శారద మొహంలో ఎప్పుడూ ఏదో అసంతృప్తి... చిరాకు, మాటల్లో అసహనం.

వంట పూర్తయ్యేసరికి వసంత వచ్చింది. రోజూ కాలేజీ అయిన తర్వాత అటునుంచీ అటే ట్యూషన్‌కి కూడా వెళ్ళి వస్తుందిట. మొహం అంతా వాడిపోయి వుంది.

అంతా కబుర్లలో పడ్డాం. కానీ, అందులో ఏదో వెలితి కనిపించింది నాకు. శారదతో పిల్లలు అవసరానికి తప్పని సరిగా మాట్లాడుతున్నారు. వాళ్లకు తల్లిదగ్గర చనువు లేదని గమనించాన్నేను.

"రమా వాళ్ళు ఇప్పుదెక్కడున్నారు అత్తా. ఒక బాబేనా వాళ్లకు" కృష్ణ మాటలతో సర్దుకున్నా నేను. కాస్సేపు మా మనుమడిమీదగా సాగినై కబుర్లు. తర్వాత నా కొడుకులు - రఘు, రమణల విషయాలు దొర్లినై.

"రఘు పెళ్లి చేస్తారా ఈ ఏడాది?" శారద అడిగింది.

" అనే అనుకుంటున్నాం. మంచి సంబంధం దొరికితే చెయ్యాలనే".

శారద ఏదో చెప్పబోయి, ఎవరో ఆపినట్టుగా ఆగి, మాట మార్చేసింది.

భోజనాలయినై. వసంత గదిలో పడుకున్నాను నేను.

వసంత చదువుకుంటోంది. నేను లైటు కళ్ళల్లో పడుతుందని వేరే వైపు తిరిగి కళ్ళు మూసుకున్నాను.

మనసు నిద్రపోనీయనని గతాన్ని గుర్తుకు తెచ్చింది.

నేనూ, శారదా ఎలిమెంటరీ స్కూలు నుంచీ కలిసి చదువుకున్నాం. హైస్కూలు చదువు పూర్తికాకుండానే నాకు పెళ్ళయి అత్తవారింటికి వచ్చేశాను. వెంటనే పిల్లలూ... సంసారం గొడవలతో తల మునకలయ్యేను. శారద సంగతి తెలీలేదునాకు.

తర్వాత ఎప్పుడో... శారద పెళ్ళి శుభలేఖ అందుకున్నాను. కానీ, పెళ్ళికి వెళ్లలేకపోయాను.

మా రమణ పసిపిల్లవాడప్పుడనుకుంటాను. బదిలీమీద హైదరాబాదు వచ్చాము. మేము వుండే కాలనీలో, అదేవీధి చివరి ఇంట్లో తన కొల్లీగ్ ఫామిలీతో వుంటున్నాడనీ, ఒకసారి వాళ్ళింటికి వెళ్ళి రమ్మనీ.. తరచుగా అనేవారు ఆయన. కానీ, పిల్లలతో, ఇంటిపనితో వీలు పడక చాలా రోజులు వెళ్లలేకపోయాను.

సంక్రాంతి వచ్చింది. ఇంట్లో వున్న నాలుగు బొమ్మలూ పెట్టి, పిల్లలకు భోగి పండ్లు పొయ్యాలనీ, ఆ వీధిలో ఉన్న నలుగురినీ, పేరంటానికి పిలవాలనీ అనుకున్నాను. సందు చివరి ఇంట్లో కూడా పిలవమని మా వారు మరీ మరీ చెప్పారు.

అదిగో అప్పుడు వెళ్ళాను - ఆ యింటికి. తలుపు తీసిన వ్యక్తిని చూసి నోట మాట రాక నిలబడిపోయాన్నేను. నన్ను చూసి ఆ వ్యక్తి కూడా చేష్టలుడిగిన దానిలా వుండిపోయింది.

ఆమె... శారద!

'ఇంతకాలం ఒకే వీధిలో వుంటూ' - ఎంత చిత్రం!

అప్పట్నుంచీ మా స్నేహం పెరిగింది. మగవాళ్ల మధ్య కూడా ఆత్మీయత పెరిగి నువ్వు అనుకునేదాకా వచ్చారు. పిల్లలు అత్తా అత్తా అంటూ నాతో కలిసిపోయారు.

ఒకరోజు...

నేను వాళ్ళింటికెళ్ళేసరికీ, పిల్లలమీద అరుస్తోంది శారద.

చదువుకోవడం లేదని గట్టిగా అరుస్తోంది. అలా ఒక్కసారేకాదు; చాలాసార్లు శారద పిల్లలమీద విసుక్కోవడం చూశాన్నేను.

ఆ మాటల సారాంశం అర్థమైంది నాకు. ఆమె ఆందోళనకూ, ఆవేదనకూ కారణం కూడా తెలిసింది.

శారదకు నలుగురు ఆడపడచులు. ముగ్గురు మరుదులు. వాళ్ళ మామగారు తక్కువ సంపాదన వలన – పిల్లల్ని సరిగా పోషించలేక సక్రమంగా చదువులు చెప్పించలేకపోయారు. ఇద్దరాడపిల్లలకు పెళ్ళిళ్లు చేశారు. కానీ, ఆ సంసారాలు అంతంత మాత్రమే. ఆయన పోవడంతో సంసార బాధ్యతంతా పెద్దకొడుకైన మధుమీద పడింది. అతను కష్టపడి ఇద్దరు చెల్లెళ్లకు పెళ్లిళ్లు చేశాడు కానీ, అప్పటికే వయసు దాటిపోతుండటంతో వాళ్ళు కూడ గ్రంథాలు నడిపారంటుంది శారద. తమ్ముళ్ళను చదివించాలని చూశాడు కానీ, వాళ్ళకు చదువులబ్బలేదు. ఒకతను చెప్పకుండా పారిపోయాడు. ఒకతను ఏదో కంపెనీలో ప్యూన్‌గా చేరాడు. అది కొంత నయమే. ఇంకొ అతను ఇంటర్ గట్టెక్కించలేకపోయాడు. ఊరికే తిని తిరగటం తప్ప వేరే పని జోలికి పోడు. ఇంట్లో అతని వలన వీసమెత్తు సహాయం లేదు. పైగా ఆత్మాభిమానం జాస్తి అతనికి. అందువలన ఇంట్లో రోజూ గొడవలే.

ఆడపిల్లల సంసారాలకు మధు సహాయం తప్పని సరి. పుట్టింటికి వస్తే రోజుల తరబడి ఉండిపోయేవాళ్ళు వాళ్ళు.

శారదకు తన పిల్లల మీద ‘ ఆ వాతావరణ ప్రభావం ఎక్కడ పడుతుందో’ అనే భయం అధికమైంది. ఫలితంగా పిల్లల మీద అజమాయిషీ ఎక్కువగా ఉండేది. వాళ్ళు తన అదుపు తప్పి తిరుగుతారేమోననే భయం ఆమెది.

ఆడుకోవాలన్నా వాళ్లకి అమె పర్మిషన్ కావాలి. ఎంత టైమ్‌లో తిరిగి ఇంటికి చేరాలో చెప్తుంది. ఆ టైము లోపల ఇంట్లో అడుగు పెట్టకపోతే వాళ్లకు ఆపూట తిండి ఉండదు. సెలవు రోజు వస్తే వాళ్ళు ఆమెకు చాలా భయపడేవాళ్ళు. పొద్దున్నే వాళ్లకు తాను వాళ్లకోసం తయారుచేసిన పరీక్ష పేపర్లు ఇచ్చేది.అవి పూర్తి చేస్తేనే ఆరోజు వాళ్లకు భోజనం! ఒక్క క్షణం ఊరికే కూర్చున్నా, లేక ఒకళ్ళతో

ఒకళ్లు మాట్లాడినా దెబ్బలు! తను చదివి అప్పగించమన్న పాఠం అప్పగిస్తేనే టిఫిన్! ఇదీ పరిస్థితి!

ఆమె దృష్టితో చూస్తే శారద భయం సబబైనదేనేమో అనిపించినా, కొంచెం నిలకడగా ఆలోచిస్తే ఆమె భయానికి అర్థం లేదనిపించేది నాకు. శారదతో ఆమాటే అన్నాను.

"నీకు తెలీదే... అది వాళ్ళ రక్తంలోనే వుంది. ఈయన వాళ్లకోసం ఎంత కష్టపడ్డారు. అయినా వాళ్ళల్లో ఏ ఒక్కరికైనా ఆ విశ్వాసముందా? ఇప్పటిక్కూడా వేలకు వేలు పంపమని రాస్తారు. ఈయన పంపకుండా ఊరుకోలేరు. ఇంట్లో ఎంత ఇబ్బంది పడ్తున్నామో మాకే తెలుసు. వీళ్ళకేమో ఆటలూ, సరదాలూ. ఆ రంధే తప్ప చదువుదాము, పైకి వద్దాము - ఈయన కష్టం తగ్గిద్దామనే ధ్యాసే లేదు. అయినా, నా బాధే కానీ మంచి పోలికలు రావే. చెడే తొందరగా వస్తుంది. వీళ్ళేమైపోతారో ఏమో" కళ్ళనీళ్లు పెట్టుకునేది.

ఒకవేళ ఎవరైనా ఏమన్నా చెప్పబోతే, తన ధోరణి తనదేకానీ ఎదుటివారు చెప్పేది వినిపించుకునేది కాదు.

ఆడపిల్లల్ని కూడా ప్రతిక్షణం, 'ఆడపిల్లవి అట్లా ఎగురుతావేం?, ఇల్లు చిమ్మకుండా అట్లా కూర్చుంటావేం?, 'మగ పిల్లల్లాగా ఆడివస్తే ఎవరు చేస్తారు మీకు?' అంటూ నసుగుతూనే వుండేది. 'చిన్నపిల్లలు, వాళ్లకేం తెలుస్తుంది పాపం'-అనిపించేది నాకు.

పిల్లలు సవ్యంగా పెరగడానికి మార్గం 'కట్టడి' కాదనేది నా ఉద్దేశ్యం. అందుకని ఆటలకూ, చదువుక్కూడా తగినంత స్వేచ్ఛ ఇచ్చేదాన్ని నేను. అది చూసి నాకు పిల్లల్ని సరీగా పెంచడం చేతకాదనే విషయాన్ని తనమాటల్లోనూ, చేతల్లోనూ బయల్పరచేది శారద.

శారద పిల్లలు మా ఇంటికి వస్తే ఎంతో సరదాగా వుండేవాళ్ళు. తిరిగి

ఇంటికి వెళ్ళాలి అంటే బిక్కమొహాలు వేసేవాళ్ళు. వాళ్ళని అలాంటి పరిస్థితులలో చూస్తే నాకు జాలి వేసేది.

కానీ, ఏం చెప్పి చూసినా శారద తత్వంలో మార్పు రాలేదు.

ఇంతలోనే మా వారికి మధురకి ట్రాన్స్‌ఫరైంది.

– ఆ తర్వాత శారదని చూడటం ఇప్పుడు. మా రమ పెళ్ళికి రాలేదు శారద.

– వసంత పుస్తకాలు సర్ది, లైటు తీసింది. నేను ప్రస్తుతంలోకి వచ్చాను. పక్కకి తిరిగేను.

"నీ నిద్ర చెడగొట్టినట్లున్నాను" మంచంమీద కూర్చుంటూ అంది వసంత.

"లేదమ్మా... నేనింకా నిద్రపోలేదులే" అంటూ లేచి కూర్చున్నాను. తన చదువు విషయాలు మాట్లాడుతోంది వసంత.

"ఉషను కూడా పెద్దయ్యాక చూడలేదు" యధాలాపంగా అన్నాను – వసంత వైపు చూస్తూ...

వసంత ఉలిక్కిపడింది. కళ్ళనిండా నీళ్ళు నిండుకున్నై. చటుక్కున తలను ఒళ్ళో పెట్టుకుంది. నాచేతిని ఊరడింపుగా వసంత తలమీద వేశాను. "ఊరుకో... పిచ్చిపిల్ల...." అంటూ భుజం తట్టాను.

చాలా సేపటికి ఉద్విగ్నత నుంచీ తేరుకుంది వసంత. చెంగుతో కళ్ళు తుడుచుకుంటూ అంది, "ఇలాంటి అనునయాన్నీ, ఆప్యాయతనీ అనుభవించి ఎన్నాళ్ళయిందో అత్తా, మేము ఈ మాత్రమైనా ఉన్నామంటే నాన్న వల్లనే". వసంత మాటలకు తల్లడిల్లాన్నేను.

జరిగిన సంభవాలన్నీ చెప్పుకు రాసాగింది...వసంత.

"ఆ రోజు నుంచీ నామీద అమ్మ కట్టడి మరీ ఎక్కువైపోయింది. రోజూ

'నీకీ జన్మలో పెళ్లిగీత లేదని' ఏదో ఒకటి అంటూనే వుంటుంది. ఇంట్లో వుండాలంటే నరకంగా వుంది. కృష్ణకూడా చదువు మీద శ్రద్ధ తగ్గించాడు. ఫ్రెండ్సుతో తిరగడం ఎక్కువైంది. వాడసలు అమ్మ అరుపుల్ని లక్ష్యపెట్టడు".

నా మనస్సులో ఎన్నో ఆలోచనలు. అసలు లోపమంతా ఎక్కడుంది? శారద ఇంటి పరిస్థితులలోనా? ఆ పరిస్థితులను బట్టి చేసిన ఆమె ఆలోచనలలోనా లేక ఆ ఆలోచనల ప్రభావంతో చేసిన కట్టడిలోనా?

క్షణాల తర్వాత అన్నది వసంత "ఇంట్లోకన్నా బయటే బాగుంటుందని వాడు అలా తిరిగి బతకగలుకుతున్నాడు. నేనే మధ్యన నలిగిపోతున్నాను. ఇంటికి రావడం ఒక్కక్షణం ఆలస్యం అవకూడదు. ఎవ్వరితోనూ... ఆఖరికి ఆడపిల్లతోకూడా మాట్లాడకూడదు. నేను కొద్దిగానైనా మాట్లాడేది నాన్నతోనూ, చిన్నాన్నతోనే! వసంత స్వరం దుఃఖంతో పూడుకుపోయింది.

వసంత మామూలు స్థితికి రావడానికి చాలా సేపు పట్టింది. అప్పటికి నాలో సుళ్ళు తిరుగుతున్న ఆలోచనలకు కూడా ఒక రూపం వచ్చింది.

– తెల్లవారింది. కాఫీలైనై.

బయల్దేరుతుండగా శారద పసుపు కుంకుమలతోపాటు చీర, రవికెలగుడ్డ చేతికిచ్చింది. కృష్ణ ఆటో తెచ్చాడు.

" నీ పెళ్లి ప్రధానం రోజు పట్టుచీర పెడ్తాలే కోడలా" అంటూ నేను వసంత చేతిలో పందనోటు ఉంచాను. " ఆ తర్వాత ఎలాగైనా మా యింటి పెత్తనం నీకేగా" మనస్ఫూర్తిగా నవ్వుతూ అన్నాను.

వసంతతో పాటు మధూ, శారద, కృష్ణలు కూడా ఉలిక్కిపడి నావైపు చూశారు.

ఒక్క ఉదుటున దగ్గరగా వచ్చి, నాచేతిని తన చేతుల్లోకి తీసుకొని గట్టిగా నొక్కింది శారద. ఆమె కళ్లల్లో – ఎన్నెన్నో అవ్యక్త భావాలు, ఆమె స్పర్శలో

అనిర్వచనీయమైన కృతజ్ఞతా!

నేను ఆమె భుజం తట్టి, నిమ్మళంగా కదిలేను.

ఆటో ఎక్కి కూర్చున్నాను. పక్కగా నిలబడి తనలో తను అనుకుంటున్నట్టుగా పైకే అంటోంది శారద, "చిన్నప్పట్నుంచీ చూస్తున్నాను. నీ వ్యక్తిత్వం గొప్పది సుమా. ఎక్కడో ఒకరిద్దరిలో ఒకరు లాంటి దానివి నువ్వు".

ఆటో కదిలింది.

ఉష మతాంతర వివాహంతో, దినకర్ కులాంతర వివాహంతో చిన్నతనాన్నీ, బాధనీ అనుభవిస్తున్న శారద దగ్గర ఆ ప్రస్తావన తీసుకురాకపోవడమా; లేక వసంతను నా కోడలిగా చేసుకుంటాననడమా? ఏది నా వ్యక్తిత్వపు గొప్పదనం? ఏమో మరి... శారదకే తెలియాలి!

మా వారూ, మా రఘూ నా నిర్ణయాన్ని హర్షిస్తారనే నమ్మకం నన్నలా మట్లాడనిచ్చింది. వాళ్లు నా నమ్మకాన్ని మరింత పెంచారు ఆ తర్వాత.

అందుకనే, నా మనసిప్పుడు పూవుకంటే తేలిగ్గా వుంది!

(ఆకాశవాణి సౌజన్యంతో)



# రేపటి నిజం

అచ్చు పోసుకుంటున్న దినపత్రికలా వుంది... బుర్ర.

రాత్రంతా నిద్రలేదు.  ఉసిళ్ళ తెరలా ఒకటే ఆలోచనలు!

***

తాంబూలాలిచ్చేశాం, తన్నుకుచావండి, అన్న తీరుగావుంది యాజమాన్యం ధోరణి!

ఇద్దరు కలిస్తే అదే విషయం! ముగ్గురు మాట్లాడుకుంటే అదే సంగతి! నలుగురు కూడితే అదే చర్చ!

అప్పుడెప్పుడో...వచ్చేసిందన్న... అష్ట గ్రహ కూటమికి ముందు రోజు వాతావరణం! ఆఫీసులు జరుగుతున్నాయే కానీ; పెళ్ళివారు ఖాళీ చేసి పోయిన కళ్యాణ మంటపం వాలకంగా వున్నై.! ప్రతీరోజూ అదే తీరు!

వాలంటెరీ రిటైర్‌మెంట్ పథకం గురించి వ్యాఖ్యలూ, వ్యాఖ్యానాలూ, చర్చలూ, విశ్లేషణలూ జోరుగా సాగిపోతున్నై. ఎవరికి వారు వెళ్ళిపోతే ఎంత లాభం, ఎంత నష్టం అని, లెక్కలూ, బేరీజులూ వేసుకుంటున్నారు. కంపెనీ వాతావరణమంతా... మామిడిపళ్ళ గోడౌన్‌లా తయారయింది. అంతా మాగిన వాసన కొట్టోంది!

నిజానికి ఈ కథకి సూత్రధారి రామదాసు. అతను సూదిలాంటివాడు. మేమంతా పూసలం. కాదంటే నేను దారాన్నవుతానేమో! అసలు జరిగింది చెప్తాను.

అంతకంటే ముందు ప్రసాద్ కేసి చూద్దాం.

ప్రసాద్‌ని దసరా బుల్లోడు అంటూ వుంటారు మా మిత్రులు చాలా మంది. మనిషి ఇస్త్రీ మడతలా వుంటాడు. మెళ్ళో గోల్డ్‌ఛెయిన్, రెండు చేతులకీ కలిపి మూడు రింగ్స్; ఎడమ ముంజేతికి గోల్డ్ వాచ్, కళ్ళకి బంగారు ఫ్రేమ్ జోడు. నడకలో, మాటలో స్పీడు. పదిహేనేళ్ల క్రితం ప్రతి జీతం రోజునా ఆఫీస్ ఎగ్గొట్టేవాడు. అప్పట్లో అప్పుల బాధ అలాంటిదీ. ఆ తర్వాత దశ తిరిగింది.

నిదానంగా దగ్గరగా వచ్చాడు రామ్మూర్తి.

"నిజంగా జరుగుతుందంటావా?" అడిగేడు. ఎల్.ఎ.సి. దగ్గర నిలబడ్డ సైనికుడిలా ఉన్నాడు. నేను సూటిగా కళ్ళల్లోకి చూసే సరికీ చూపులు మరల్చుకున్నాడు.

"అనే అంటున్నారు కదా!" నేను యధాలాపంగా అన్నాను.

"అమలు చేస్తారంటావా?" నేను ముభావంగా వూరుకున్నాను. రామ్మూర్తి ప్రశ్నను చంద్రయ్య విన్నాడు, "కూడికలూ, తీసివేతలూ, హెచ్చవేతలూ, భాగహారాలూ వడివడిగా జరిగిపోతున్నై. మరో పక్కన... బయటకు పోతే ఎందుకు పనికొస్తామా అంటూ తమతమ బలాబలాల లిష్టులూ తయారౌతున్నై."

మేం మాట్లాడకుంటున్నాం. అదుగో అపుడు వచ్చాడు.... రామదాసు. మేమంతా మొహమొహాలు చూసుకున్నాం.

కుర్చీలో కూర్చున్నాడు. మనిషి బాగా నీరసంగా కనిపిస్తున్నాడు. చాలా దూరం నుంచీ, నడిచి వచ్చినట్లున్నాడు. మొహాన్న చెమట పట్టివుంది. కండువాతో మొహం తుడుచుకున్నాడు.

"అందరికీ నమస్కారం" అన్నాడు.

మా పెదవులు కదల్లేదు గానీ, తలలు ఊగినై. మరో క్షణం తర్వాత,

రామ్మూర్తి అన్నాడు.

"మన లాంటి వాళ్ళ కోసం.... ప్రసాద్ ఒక కన్సల్టెన్సీని ప్రారంభిస్తాడుట". చంద్రయ్యకి ముందున్న కుర్చీలోకి చేరేడు రామ్మూర్తి.

సంభాషణలోని ఉత్సుకత ప్రసాద్‌ని దగ్గరకి నడిపింది. అతనూ వచ్చాడు. స్టూలుని నా ముందుకు లాక్కుని మొదలెట్టాడు, ప్రసాద్.

"ఒక సంస్థని ప్రారంభిస్తాను నేను' ఎగ్జిట్ పాలసీ ఎఫెక్టెడ్ ఎంప్లాయీస్ ఎసోసియేషన్. అడ్మిషన్ ఫీజు కేవలం వంద రూపాయలు"

"అంటే నీ ఉద్యోగం సిద్ధం చేసుకున్నావన్నమాట" చంద్రయ్య నవ్వాడు.

"ఆ.. ఏం ఉద్యోగంలే... ఏదో కొంత మూలధనం వస్తుంది. దాంతో అడ్జెస్ట్ అయిపోతాను. రోజు వారీ సొదరు... ఎటూ పార్టీల ద్వారా జరిగిపోతూ వుంటుంది".

"కొంచెం మంచి నీళ్ళు కావాలి" రామదాసు అడిగేడు.

నేను అటూ ఇటూ చూశాను ప్యూన్‌కోసం. అతను కనిపించలేదు.

ప్రసాద్ అన్నాడు. "మీకు తెలుసుగా, ఆ వెనుక వసారాలో కూలర్ వుంది. వెళ్ళి తాగి రావాల్సిందే".

రామదాసు నెమ్మదిగా కదిలాడు. ప్రసాద్ కొంచెం విసుగ్గా, చిరాగ్గా అన్నాడు, "ఈయనకి వేరే పని లేదు.రోజూ తయారు. వద్దన్నా వినడు"

ప్రసాద్ మాటల్ని తుంచేస్తూ అందుకున్నాడు చంద్రయ్య.

"బయటికి నడవమంటే... సరాసరి రైలు పట్టాలా, హుస్సేన్‌సాగరా అని ఆలోచించాలి... నాలాంటివాళ్ళం. అంతే".

"మాస్టారూ అంతగా బెంబేలు పడకండి సార్. నేనున్నాను గదా. నో ప్రాబ్లమ్. చెప్తాను. ఉదాహరణకు... మీరు నాలుగు గైడ్స్ రాయండి. నేను

అచ్చేయించుకుని అమ్ముకుంటాను".

"ఆ.. మన గైడ్స్ కొనే వాళ్ళెవరండీ"

"ఓ.కె/ వద్దు... మీ ఇంటి ముందు 'ఇచ్చట జ్యోతిష్యం చెప్పబడును' అని బోర్డు కట్టండి. ఒక ఏడాది కాగానే ... నాతో మాట్లాడటానికి డైరీ చూసి చెప్తానంటారు"

అందరమూ నవ్వుకున్నాం.

"ఇవన్నీ జోక్స్‌కి తప్ప కూటికి గుడ్డకీ పనికి రావులే ప్రసాద్"

"ఆగండి. అక్కడే ఆగండి" చేతులు తిప్పుతూ చెప్పసాగేడు ప్రసాద్. "అలాగైతే... ఇది చూడండి. నేను మందుల షాపుకి లైసెన్స్ తెస్తాను. పెట్టుబడి పెడతాను. షాపు ప్రారంభిస్తాను. షాపులో ఒక పక్కగా... బుక్స్ లెండింగ్ సెక్షన్ వుంటుంది. ఈ రెంటికీ 'బాయిస్' వుంటారు. మీరు వాళ్లని చూసుకుంటూ వుండండి. మీ నెట్ శాలరీ నేనిస్తాను. సరేనా"

"ఇదేదో బాగున్నట్టే వుంది" చంద్రయ్య.

"కానీ జాబ్ సెక్యూరిటీ?"

"ఇప్పుడు కూడా అది లేకనే కదండీ... ఈ ఆలోచనలన్నీ"

"వెల్‌సెడ్". మళ్లీ సన్నగా నవ్వులు.

రామదాసు తిరిగి వచ్చాడు. కూర్చున్నాడు. ప్రసాద్ కేసి బెరుకు బెరుగ్గా చూశాడు. నాలికతో పెదవుల్ని తడిచేసుకున్నాడు. "నా సంగతి కాస్త ఇవ్వాళన్నా చూసి పెట్టు ప్రసాద్. అందుకే వచ్చాను".

ప్రసాద్ ఆయనవైపు ఆదోలా చూశాడు. "సార్. మీరు రిటైరయి నిండా నెల కాలేదు. రోజూ తిరుగుతున్నారు. మీ ముందు కేసులు చాలా వున్నై మా దగ్గర. ఒక వరసలో వస్తాం గదా. ముందుగా మీ బెనిఫిట్స్ సెటల్ చేసేస్తే, ఆ

ముందు వాళ్ళంతా ఏమై పోవాలి?"

రామదాసు నీరసపడ్డాడు. మొహం ముడుచుకున్నాడు. చాలా కోపం వచ్చింది. పళ్ళు బిగబట్టాడు... 'ఛీ' అనుకున్నాడు, సన్నగా. మరేమీ మాట్లాడకుండా నిగ్రహించుకున్నాడు.

నారాయణ కూడా నలుగురితో కలవదానికి నా పక్కకి చేరేడు. టేబుల్ మీదనే బైరాయించాడు.

"ప్రసాద్ ఇంకేదైనా మంచి సలహా ఇవ్వవయ్యా" చంద్రయ్య.

"నో ప్రాబ్లమ్ ఎటాల్ సర్. ఇది చూడండి... ఎలా వుంటుందో. మీ కాంపౌండ్ వాల్‌ని పగల గొట్టించి చిన్న షెడ్ వేయండి.... వొక షెట్టర్‌తో. ఉదయాన్నే మిల్క్ సప్లై జరుగుతుంది. సాయంత్రం ఐదునుంచీ రాత్రి ఎనిమిది వరకూ ఇంచక్కా సొమాసాలు, బిస్కట్లూ, కేక్‌లు, చెకోడీలూ, టీ లభిస్తాయ్"

"అయ్య బాబోయ్. అంత డైవర్సిఫికేషన్ నావల్లకాదు".

"మీ వల్ల కానఖ్ఖర్లేదు మహాశయా. ఇవన్నీ... ఘనతవహించిన చంద్రయ్యగారి గదిలో ... విడివిడిగా ఎవరికి వారు నిర్వహించుకుంటారు. చంద్రయ్యగారికి రోజుకు కేవలం ఓ వంద అద్దెరూపేణా లభిస్తుంది. దట్సాల్. మీరు ఊ అనండి. సాయంత్రం మేస్త్రీకి కబురు చేస్తాను. మునిసిపాలిటీ గొడవంటారా...అదంతా నాకు వదిలేయండి. ఖర్చులు ఆ తర్వాత చెప్తాను. నగదుగా ఇవ్వండి. అంతే".

"బాగుంది... నీ బుర్ర నిజంగా సూరే కారమేనోయ్".

"ఇలాంటివి... కోటి విద్యల లిస్టు వుంది. కాకుంటే ఒక అడుగు ముందుకు వేసే దమ్ము కావాలి అంతే."

ఇప్పుడు నారాయణ అస్థిమితంగా కదిలాడు. అతని మొహం చెక్కుతీసిన

కందగడ్డలా అయింది. మనస్సులో చాలా ఆందోళన పడుతున్నట్టు తెలుస్తోంది. అడిగాడు, " ప్రసాద్. కాస్త నన్నూ వో కంట కనిపెట్టవయ్యా బాబూ"

ప్రసాద్ ముందుగా చుట్టూ చూశాడు. అందరూ ఉత్సుకతతో వింటున్నారు. అప్పుడు నారాయణవైపు చూశారు. అతను వరం కోరి రెస్పాన్సు కోసం చూస్తున్న భక్తుని ఫోజులో నిలబడి వున్నాడు. ప్రసాద్ చెప్పడం మొదలెట్టాడు.

" మీ కాలనీలో డిఐజి గ్రూపు అదే డబుల్ ఇన్‌కం గ్రూపు అదే ఉద్యోగం చేసే భార్యా భర్తలు.. వాళ్ళ జనాభా ఎక్కువే... అందుకని మీ ఇంట్లో ఉదయం 8 గంటలకు, రాత్రి 8 గంటలకు రెండు స్టీలు డ్రమ్ముల నిండా సాంబారు, రసం చేయించి పెట్టు. నాలుగు రోజుల తర్వాత.. నారాయణ ఇంటి ముందు... టైమైపోతోంది, నాకంటే నాకని తొక్కిసలాట మొదలౌతుంది. అపుడు క్యూని సరిచేసే సహాయం నే చేసి పెడ్తాను."

"రామ్మూర్తిగారూ. రాత్రి మీకు చెప్పాను కదా నా పరిస్థితి. చాలా అవసరంలో వున్నాను. కొంచెం హెల్ప్ చేయాలి" రామదాసు వేడికోలుగా అన్నాడు.

"వింటున్నాడు గదా మన ప్రసాద్ - మీ పనిని అతను చేయాల్సిందే మరి" ఇదీ రామ్మూర్తి. రామదాసు అందరికేసీ 'నా సంగతేమిటి?' అన్నట్టు చూశాడు కానీ, ఎవ్వరూ అతన్ని పట్టించుకోలేదు.

"నిర్మలగారు ఏమీ మాట్లాడటం లేదు" ఉన్నట్టుండి రామ్మూర్తే అన్నాడు.

నా సీటుకి ఎడమ వైపు సీటు నిర్మలది. ఎవ్వరికేసీ చూడలేదు. సన్నగా నవ్వి తన పనిలో తాను నిమగ్నమైపోయింది నిర్మల.

ప్రసాద్ అన్నాడు. "నిర్మలగారికి ఈ అవసరమేం లేదు. ఆమె ఈ ఆఫీసు తలవాకిలి దాటాలే గానీ, కిందమెట్ల దగ్గరే ఎవరో వొకరు ఎగరేసుకుపోతారు".

అందరూ ఉలిక్కిపడ్డారు. నేనూ తిన్నగా ప్రసాద్ మొహం కేసి చూశాను. అతనేమీ కళవళ పడలేదు. చేతులూ, కళ్ళూ తిప్పుతూ, ఒక వింత విన్యాసంతో

వివరణ ఇచ్చాడు.

"అదే నా ఉద్దేశ్యం. ఆమె అర్హతలూ, అనుభవం, అన్నిటికీ మించి ఆమె ఎఫిషెన్సీ. శతకోటి ఉద్యోగాలు ఆమె ముందు చేతులు కట్టుకుని బారులు తీరతాయ్. ఆమె ప్రాబ్లమ్ అల్లా ఏ కంపెనీని ఎన్నుకోవాలా అనే. అవునా మేడమ్. యామ్ ఐ రైట్!"

ఆమె మళ్లీ అదే నవ్వు నవ్వింది. పాలు వంపితే పాత్ర అంచున మీగడ తరక జారినట్లు!

క్షణాల తర్వాత ప్రసాద్ వాచీ చూసుకున్నాడు. అప్పటికి నాలుగు దాటింది. "ఓకే బాస్. మైగోస్. నాకు వేరే పనులున్నై!" అంటూ తన సీటు దగ్గరికి నడిచాడు. మరో ఐదు నిముషాలకి చక చకా ఆఫీసు బయటికి వెళ్ళిపోయాడు.

ఆ వేళకి ఆఫీస్ పని అనే పదార్థం ఆ విధంగా ఉడికించబడింది!

వారం వెళ్లి వారం వచ్చింది.

సోమవారం ఉదయం. ఆ రోజు జీతం రోజు. జీతం రోజున ప్రసాద్ చాలా బిజీగా వుంటాడు. అతని 'అప్పుల కలెక్షన్స్' అతనికి పెద్ద పని. పన్నెండవుతుండగా రామదాసు ప్రసాద్ ముందు ప్రత్యక్షమయ్యాడు. మామూలు పరామర్శల తర్వాత... ప్రసాద్ ఎటో వెళ్లిపోయాడు. నిముషాలు గంటలుగా మారాయి. రామదాసుకి చాలా విసుగ్గా, చిరాగ్గా వుంది. చదివిన దినపత్రికనీ, చదవని వారపత్రికనీ చాలా సార్లు తిరగేశాడు. అప్పటికి రెండు మూడు సార్లు అటూ ఇటూ వెళ్ళి వచ్చాడు. లంచ్ అవర్ అయిపోయింది. రెండున్నరయింది. నాముందుకు వచ్చి కూచున్నాడు. "ఇదేమైనా బాగుందా శంకరంగారూ" అన్నాడు సన్నగా.

తలెత్తి ఆయనకేసి చూశాను. "నేను రాయిలా ఉదయం నుంచి ఇక్కడే కూర్చున్నాను. తానేమో నన్ను గమనించకుండా తిరుగుతూనే వున్నాడు. రెండోనెల జరుగుతోంది. పిల్ల పెళ్ళికి ముహూర్తాలు పెట్టుకోవాలి. పెళ్ళి వారిని నేనిచ్చే కట్నానికి చాలా కష్టపడి వొప్పించుకున్నాను. కొంత అడ్వాన్స్ తీసుకురమ్మంటున్నారు. ఇక్కడేమో ఇదీ తంతు"

నేను వింటున్నాను. "ఇంటా బయటా నా అసమర్థతని కథలు కథలుగా చెప్పుకుంటున్నారు. మా పిల్లలకి కూడా నేను పెద్ద లాఫింగ్ స్టాక్‌గా మారాను"

"చెప్పాను కదా! చూస్తాడు లేండి".

"ఇవ్వాళ మా పెద్దవాడు మీకసలు నోట్లో నాలికే లేదు. మీరా ఆఫీస్ చుట్టూ ప్రదక్షిణాలు మానేయండి. నన్ను పోయి రానీయండి. ఏం జరుగుతుందో చూస్తాను... అంటున్నాడు".

రామదాసు మాటల్ని నేనూ, రామ్మూర్తి, చంద్రయ్యా, నారాయణా అందరమూ విన్నా, నిర్మల మాత్రం అదోలా రామదాసు వైపు చూసి "ఇట్టా రండి సారూ" అని పిల్చింది. వెళ్ళి ఆమె ముందు కూర్చున్నాడు రామదాసు. క్షణాల తర్వాత కాఫీలు వచ్చినై. ఇద్దరూ తాగేరు. మాటలు కలుపుకున్నారు. తర్వాత కొంత సేపటికి రామదాసు వెళ్ళిపోయాడు. వెళ్తూ వెళ్తూ "కాస్త మీరూ ఆ ప్రసాద్‌కి చెప్పండి శంకరంగారూ" అంటూ నన్ను మరోసారి అర్థించి వెళ్ళాడు.

రామదాసు వెళ్ళిన తర్వాత,

కొద్దిసేపటికి...

నిర్మల నా దగ్గరసా వచ్చింది. రామదాసు పని గురించి, ఆ వేళ జరిగిన చర్చల గురించీ చాలా మాట్లాడుకున్నాం మేము. నిర్మల మాట్లాడే తీరుకు ఆశ్చర్యం వేసింది నాకు. తన అభిప్రాయాల మీద నా సలహా అడిగింది. చెప్పాను.

మర్నాడు, రామదాసు మళ్లీ వచ్చాడు. సరాసరి వెళ్ళి నిర్మల ముందు కూర్చున్నాడు. వాళ్ళిద్దరూ ఒక అర్థగంట సేపు ఏదో చర్చించుకున్నారు. ఆ తర్వాత 'అలాగే...అలాగే' అంటూ వెళ్లిపోయాడు రామదాసు.

ఆ వేళ పదకొండు గంటలైంది. మా ఆఫీసు ముందు సుమారు యాభై అరవైమంది యువకులు గుమిగూడారు. వాళ్ళ చేతుల్లో ప్లేకార్డ్స్ వున్నై; ప్రజా సంక్షేమ సంఘం అనే బేనర్లూ వున్నై.

"ఆఫీసుల్లో అసమర్థత నశించాలి" "నో వర్క్... నో పే" "ఈ దోపిడీ ఇంకానా... ఇక పైసాగదు" "ఆర్గనైజ్‌డ్ లేబర్ పొగరణచక తప్పదు". "పని చేయని ఉద్యోగులు దేశద్రోహులు" .. ఇవీ నినాదాలు!

గేటు ముందు బైఠాయించారు. ఉద్యోగుల్లో చలనం. కొందరు పళ్ళు కొరుక్కున్నారు. కొందరు కోపంతో ఊగిపోయారు. కొందరు యూనియన్ లీడర్లు సర్ది చెప్పబోయారు. వాళ్ళు వినలేదు. కొందరు పోలీసుల్ని పిలవమన్నారు. మా యం.డీ. వొప్పుకోలేదు. మా అధికార్లంతా బయటికి వచ్చారు. అసలు సమస్య ఏమిటో చెప్పమన్నారు. ఆ గుంపులో కొందరు నాయకుల్ని సంప్రదింపులకి లోపలికి రమ్మన్నారు. వాళ్ళల్లో వో ఐదారుగురూ, యూనియన్ లీడర్లూ, కొందరు అధికార్లూ, మా యం.డీ. రూమ్‌లోకి వెళ్ళారు. లోపల చాలాచాలా చర్చ జరిగింది. పార్టీల సొమ్ముని సత్వరం చెల్లించాలనీ, ఉద్యోగుల అలసత్వం పోవాలనీ డిమాండ్. ఉద్యోగుల్లో ప్రసాద్ లాంటి వాళ్ల పేర్లు బయటికి వచ్చినై.

ఆఫీసు సమయంలో వాళ్ళంతా పని చేయాలి. పెండింగ్‌లో వున్న పనంతా వారంలోగా పూర్తి కావాలి.... ఇదీ హెచ్చరిక!

నిర్మల ఒకరోజు సాయంత్రం నాతో అన్న మాటలు చప్పున గుర్తుకొచ్చినై నాకు, "రేపెప్పుడో బయటికి పోతే ఏమైపోతామో అని ఏడుస్తున్నాం గానీ, బయటికి పోయి ఏడుస్తున్నవాణ్ణి పట్టించుకోం మనం. అందుకే మనకు ఉంగరాల చేత్తో మొట్టే మొగుడు కావాలి". ఆ వేళ నిర్మల ఆమాటల్ని చాలా కటువుగానే అన్నది!

ఆందోళన చేస్తున్న యువకులకూ, మా ఉద్యోగులకీ మధ్య - చాలా రకాల వాద ప్రతివాదనల తర్వాత, ఒక అంగీకారం కుదిరింది. వారం తర్వాత పరిస్థితిని గమనిస్తామని హెచ్చరించి నెమ్మదిగా వెళ్ళిపోయారు.

ఆ వారంలో మా ఆఫీసులో పెద్ద మార్పే వచ్చింది. పాత ఫైళ్ళు కదలసాగినై.

రామదాసు వచ్చి తన చెక్కు తీసుకువెళ్ళాడు. ఆయన వచ్చినప్పుడు ప్రసాద్ మొహం తప్పించాడు. ఆ పనిని రామ్మూర్తి చూశాడు. రామదాసు వెళ్ళిపోయిన తర్వాత, రామ్మూర్తి యదాలాపంగా నన్ను అడిగాడు, "అవును శంకరం, ఆ సంఘం నాయకుదు, విశ్వం- మన రామదాసుగారి రెండో కొడుకుట గదా?" అని.

"అలాగా" అన్నాను, పొడి పొడిగా. పక్కకి చూస్తే... నిర్మల! తనలో తను నవ్వుకుంటున్నది!

నాలుగు రోజుల సెలవు తీసుకుంది, నిర్మల.

రామదాసు కూతురి పెళ్లికి వెళ్లాను. ఆ పెళ్లిలో చాలా ఉత్సాహంగా పాల్గొన్నది నిర్మల.

పది రోజుల తర్వాత, తన పెళ్లి శుభలేఖని మా అందరికీ అందించింది నిర్మల. వరుడెవరో కాదు... రామదాసు రెండో కొడుకు విశ్వం!

నేనేమీ నిర్ఘాంతపోలేదు!!

నా ముఖ కవళికల్ని గమనిస్తూ అన్నాడు, ప్రాసాద్, "ఈ నిర్మలతో జాగ్రత్తగా

ఉండటం మంచిది. ఐరితెగించిన ఆడది"

నాకనిపించింది "నిర్మల.. ఐరిగోల దాల్చిన ఆడది"!!!

కొన్ని సమస్యలకి పరిష్కారాలు నిర్మలలే చూపగలరేమో!!

అన్నట్టు, ఇప్పటికీ మా కంపెనీలో ఏ వాలెంటరీ రిటైర్‌మెంట్ పథకమూ ప్రవేశించలేదు!!!

***

(రచన సచిత్ర మాస పత్రిక  ఆగష్టు 1994)



# గొడుగులాంటి మనిషి

ఇదిగో... ఇది మా ఊరు, ఇది గాంధీగారి పేరు పెట్టి ఖాళీగా వదిలేసిన స్థలం. గాంధీపార్కు! వెలుతుర్లో పిల్లలకీ, చీకట్లో పెద్దలకీ ప్రకృతి ధర్మాలు నెరవేర్చుకునేందుకు ఉపయోగపడుతోంది. పార్కెప్పుడూ శవంలేచిన యిల్లులా బావురుమంటూ వుంటుంది.

పదడుగులు వేశారుగదా, ఇది జమ్మిచెట్టు, ఇదే బోస్‌చౌక్, బోసు బొమ్మేదని అడక్కండి. ఒకప్పుడు ఉండేదే. తరాలు మారుతున్నాయి కనుక మరొకరికి చోటు చేయాలని బోస్‌గారు ఎలిమెంటరీ స్కూలు పాత సామాన్ల గదికి వెళ్ళిపోయారు.

ఇట్టా నడిస్తే ఇది పడమర వీధి, వీధి చివర చెఱువు. చెఱువు ఒడ్డున పెద్ద మర్రి. దాన్ని ఆనుకుని శివాలయం. శివాలయానికి తొంభై డిగ్రీల్లో రామాలయం. ఆ రెండినీ కలిపే గట్టు మీది రోడ్డున ఆచార్లయిళ్ళు. ఈ గట్టుకి ఊరి వాళ్ళ దాహం బాగా తెలుసు. రామాలయం గోపురంనుంచి పరచుకుని వుంది తూర్పువీధి.

తూర్పు వీధిలో రామాలయం నుంచి నడుస్తుంటే... కుడివైపు రెండోయిల్లు చెన్నయ్యది. ఒంటినిట్టాడి తాటిపాక.

నాకు ఊహ తెలిసినప్పట్నుంచీ చెన్నయ్య మకాం ఇక్కడే.

చెన్నయ్యకి ప్రత్యేకమైన వృత్తేమీ లేదు. జనపనార పేనుతాడు. నులక తయారు చేస్తాడు. మంచాలు అల్లుతాడు, ఉలీ, బాడిశా పట్టి నాగళ్ళూ, బండి చక్రాలూ తయారు చేస్తాడు. మంత్రాలు వేస్తాడు. గచ్చాకు పుచ్చాకు వైద్యం చేస్తాడు. పిల్లలకి శతకాల పద్యాలు చెప్తాడు. పెద్దబాల శిక్ష వల్లెవేయిస్తాడు. వేమన్నలూ, పోతన్నలూ... చెన్నయ్య గొంతులో వొద్దికగా వొదిగిపోతారు.

చెన్నయ్య వయస్సు డెబ్బై పైమాటే. కాయకష్టం చేసి రాటుదేలిన దేహం.

దుబ్బుజుట్టు, దట్టంగా మీసాలు. గోసిపోసి కట్టిన అరపంచె. కంటెమెడ చొక్కా, దాని చేతులు మోచేతి కిందికీ ముంజేతి పైకీ వుంటాయి.

కూర్చుండే వాళ్ళుంటే చాలు. చెన్నయ్య కబుర్లు కబుర్లు కావు. ఇంగ్లీషుదొరల గుర్రపు స్వారీ దగ్గర్నుంచీ అల్లూరి జీవితందాకా ఎన్నెన్నో కథలూ, గాథలూ చెప్తాడు. గళం విప్పితే ఖంగుమంటుంది. కపిలవాయి రామనాథశాస్త్రి పాటల్నుంచీ సియ్యస్సార్ కీర్తనల మీదుగా, ఘంటసాల, భానుమతి వరకూ... అందరి స్వరాలూ పలుకుతాడు.

చెన్నయ్య ఎక్కణ్ణుంచి వచ్చాడో, ఏవూరో ఎవరికీ తెలీదు. ఎవరేం అడిగినా నవ్వి వూరుకుంటాడు.

సాయంత్రం సూర్యుడు నారింజ పండులా చెరువులోకి దిగిపోతున్నాడు. చెన్నయ్య కబురుచేస్తే వెళ్ళాను.

"ఇతను మా ఊరినుంచి వచ్చాడు" అని వో పాతికేళ్ళ యువకుణ్ని చూపించాడు. "నేను ఇక్కడున్నట్టు తెలుసుకుని వచ్చాట్ట". నేను ఆశ్చర్యంగా చూశాను.

"అవును. చనిపోయిన కరణం గారికి తప్ప మనవూర్లో ఇంకెవరికీ తెలీదు, నా గురించి. ముప్ఫైఏళ్ల క్రితం జరిగిన ఘటనలు. ఇన్నాళ్ళకిన్నాళ్ళకి మళ్లీ ఇవాళ...." ఆగాడు. చిత్రంగా తల విదిలించాడు.

"మధుట పేరు. మా తమ్ముడి కొడుకుల్లో చివరివాడుట. వీడిపైన ఒక పిల్ల, ఆ పిల్లకి ముందు రవి. వాళ్ళు నాకు తెలుసు"

...ఆ రాత్రి, మధువచ్చిన పని గురించి చెప్పాడు చెన్నయ్య. తాను అసలు మా ఊరెలా వచ్చాడో కూడా చెప్పాడు. చెన్నయ్యకు ఒక్కడే తమ్ముడు. అప్పచెల్లెళ్లు లేరు. అంతా ఒకే గూటిలో కాపరం. ఒకరోజు ఏదో మాటల మధ్యలో మరదలు అన్నది, "మీ అయ్య నీకు పెద్ద చదువునిచ్చాడు. మీ తమ్ముడికి చేతిలో నాగలి పెట్టాడు. మీరెట్టాగైనా బతకగలరు. ఉన్న పొలం తమ్ముణ్ని చేసుకోనిస్తే... మీకు పోయేదేం లేదు" అంతే, చెన్నయ్య ఆ ఇంటినుంచి, వూరు నుంచి బయటికి

వచ్చేశాడు. నాకు ఆశ్చర్యం, ఉద్వేగం కలిగాయి. చెన్నయ్యపట్ల ఆరాధనా భావం గుండె అంతా నిండింది.

"మధు పనిని గురించి ఏమంటావ్?" అడిగాను.

ఇవ్వాళ... తమ్ముడి కొడుకు దస్తావేజుల మీద సంతకాలకోసం వచ్చినా, పల్లెపట్నంగా మారి పొలాలూ, తోటలూ బంగారాన్నిస్తున్నాయన్నా.. ఆ సంపదకోసం మళ్లీ చలిస్తాడా?! మరదలి మాటకి... అరవై ఎకరాల పొలాన్నీ, పదెకరాల తోటనీ తృణప్రాయంగా వదిలేసి రాత్రికి రాత్రి తన ఊరికి వీడ్కోలు చెప్పిన చెన్నయ్య.

క్షణాల తర్వాత అన్నాడు, చెన్నయ్య. "నాభాగానికొచ్చేది యిప్పుడు నా వాళ్లకి అక్కర్లేదు. అనుభవించాల్సిన సమయంలో నా అయివేజు వాళ్లని ఆదుకుంది. ఇప్పుడు నాకొచ్చే భాగం మన స్కూలుకిద్దామనుకున్నా".

జీవితం కొందర్ని మారుస్తుందిట. కానీ, కొందరు జీవితాన్నే మారుస్తారని తెలుస్తోంది.

ఇది కలా అంటే కలకాదు. ఎదురుగా... మహా పర్వతం! దాని క్రిందుగా నేను చిన్న గులకరాయిని! అవును. నేను ఆ స్కూల్లో టీచర్ని!!!

(పల్లకి వినూత్న వారపత్రిక 3 మార్చి 1993.)



# శత్రువు

శంకరం అవాక్కయిపోయాడు.

మొహం మీద గంటుపెట్టుకుని, వీధికుక్క మొరుగుతున్నట్టు అరుస్తున్నాడు..యం.డీ. "చేయించడం చేతకాని ప్రతీ వాడు ఆఫీసరే. నిచ్చెనెక్కేస్తూ పైకి పైకి వచ్చేయ్యడానికి మాత్రం ఎక్కడ లేని ఆబా, ఆరాటం"

శంకరం యం.డీ మొహంకేసి దొంగ చూపులు చూశాడు. ముక్కు పక్కనించీ బయల్దేరి, కంటి కొస దాకా సాగిన మడతలో రక్తం ఉబుకుతోంది..

దమదమాల బండి సాగిపోతోంది.

"ఇంకోడి చేత చేయించలేకపోతే, చెయ్యడం నేర్చుకోవాలి గాడిదల్లా"

"ఓరీ ముండాకొడకా.... ఎంతమాటన్నావురా...?" శంకరం మనస్సుకు ముల్లు గుచ్చుకుంది, 'అబ్బ' అని మూలిగింది.

యం.డీ. ఊరంత గొంతూ ఇప్పుడు స్టేటంత గొంతయింది. "వేలకి వేల జీతాలిచ్చి ఎందుకు మనల్ని పోషిస్తున్నది?"

"ఇట్టా శివాలు, చిందులు వేయడానికిట్రా వెధవ?"... శంకరం స్వగతం కసి తీర్చుకుంటోంది.

'మీ పద్ధతి నచ్చలేదు నాకు' ముక్తాయింపు దెబ్బకొట్టి, మూతి బిగించుకుని, చేతిలోని గ్లాస్ పేపర్ వెయిట్‌ని తిప్పుకుంటూ కూర్చున్నాడు, యం.డీ.

శంకరం నసగాలనుకున్నాడు, "నే చెప్పేదీ..." అని.

యం.డీ. గారి అసహనం గ్రాఫ్ ఇప్పుడు తారాస్థాయికి పోయింది. అది అతన్నో కోతిని చేసి పారేసింది. లేచి నుంచున్నాడు. "మీరేం చెప్పినా నేను విననుగాక విననుగాక విననుగాక, విననుగాక వినను వినను. అసలు మీరేమీ చెప్పక్కర్లేదు. చెప్పాల్సిందంతా ఆ యూనియన్ లీడరే చెప్పాడు... పొద్దున్న... " ఆగాడు, "యూకెన్ గో..." వత్తి వత్తి పలికాడు.

శంకరం ఛాంబర్ బయటపడ్డాడు, తన్నేసిన ఫుట్‌బాల్‌లా. అందునా, ముళ్ళకంపలో పడినట్లయింది మనస్సు.

వచ్చి తన సీట్లో కూర్చున్నాడు. అకారణంగా ఎంతమాటన్నాడు... డర్టీఫెలో. ఎగోటిక్. అతి పెద్ద సమస్యని అవలీలగా పరిష్కరించి లోపలికి పోతే, అసంబద్ధంగా, అఖర్లేని విషయం లాగీ, పీకీ, పేట్రేగిపోయాడు. బూట్‌కింద చిటికెనవేలుని తొక్కిపట్టినట్లుంది. గుటక దిగలేదు. కళ్ళల్లో నీళ్ళు పేర్కొన్నై. కసీ, కోపం, రోషం ఉక్రోషం... ఆవకాయ దినుసుల్లా కలిసిపోయి మంట పుడుతున్నై.

జుట్టులోకి వేళ్లని జొనిపి పిచ్చివాడిలా తల విదిలించుకున్నాడు. అంతలోనే రెండు చేతుల్తో తల పట్టుక్కూర్చున్నాడు. పిడికిలి బిగించాడు. పెదవి కొరుక్కున్నాడు. క్రోధం కళ్లల్లోకి ఎగదన్నుకొచ్చింది.

పిచ్చెయ్యకి ఆ రోజు చాలా దుర్దినం.

బాస్ అనబడే శంకరం, సూపర్‌వైజర్ పిచ్చెయ్యని కేబిన్‌లోకి పిల్చాడు. రెండు కాళ్ళూ సర్దుకుని సరిగా నిలబడేలోగానే... ధూమ్ ధామ్‌లు మొదలయినై.

"ఈ ఎరియర్స్‌కేమీ అద్దూ ఆపూలేకుండా ఇట్లా ఇన్‌క్రీజ్ అయిపోతూవుంటే, ఏం చేస్తున్నారండీ మీరంతా. మందలు మందలుగా క్యాంటీన్‌లో కబుర్లూ, టేబుల్స్ దగ్గర మీటింగులూ...."

విశాఖపట్నం మీద బాంబులు వెదజల్లుతున్న జపాన్ వాడిలా అనిపించాడు శంకరం. పిచ్చెయ్య మరి హిస్టరీ పి.జి! తలెత్తి శంకరంని చూశాడు. దట్టంగా, పొడుగ్గా, నల్లగా వున్న కనుబొమ్మలు, కుమ్మరి పురుగుల్లా కదులుతున్నై. మొహం మిట్టమధ్యాహ్నపుటెండలా మిటమిటడలాడిపోతోంది.

"నిజానికి.... మొత్తంమీద... ఎరియర్స్... ఈ వారం తగ్గాయం...! పిచ్చెయ్య "డీ"ని ఢీకొంటూ శంకరం చేతిలోని ఎర్ర మార్కర్ అతనిముందు పాడ్‌లో వున్న స్టేట్‌మెంట్‌లో ఓ అంకెకి గుండుసున్నా చుట్టింది. "నా చెవిలో పూలూ, వనాలూ

పెట్టండి. ఇదిగో... ఈ ఐటమ్. దీని సంగతేమిటి?"

పిచ్చెయ్యకి తాటి ప్రమాణంగా లేచింది, కోపం. (పైకేమీ అనకుండా) తమాయించుకున్నాడు.

'ఓరి సన్నాసీ.... గాడిదకొడకా. ఏం హిపోక్రసీరా నీది. అది యూనియన్ లీడర్ సీటురా వెధవా. నీకు తెలిసిన సంగతే కదరా... చచ్చుపీనుగా. నీకు వాణ్ణడిగే దమ్మేదిరా...' ఇలా, ఇలా సీరియల్‌గా తిట్టుకోసాగింది... పిచ్చెయ్య మనస్సు.

"ఆ... ఊ..." అంటూ సగం తెరిచిఉన్న కిటికీలోంచి బయటకు చూసి "ఛీ...ఛీ... హారిబుల్" అని పిచ్చెయ్యకేసి చూశాడు, శంకరం. చూపులు కలుసుకున్నై.

"అదేమంత హారిబుల్ కాదండీ... ఇవన్నీ మామూలుగా ఉండే ఎరియర్సేనండీ" అంటూ నసిగాడు, పిచ్చెయ్య.

ఇంట్లో కూర్చుని వీధిలోకి రాళ్ళు రువ్వుతున్నట్టు అనిపించింది శంకరంకి. పిచ్చెయ్యకి చిరాకు హెచ్చింది. " మీ సమర్థింపు కాదు నాక్కావలిసింది. పని. అవును. వర్క్... వర్క్... అంతే. ఈ నెలాఖరుకు ఎరియర్స్ తగ్గకపోతే యాక్షన్ తీసుకోవల్సి ఉంటుంది. వెళ్లండి".

'తిక్కముండాకొడకా.... కొంపలు మునిగే వ్యవహారాల్లోనే నీరో తత్వం కదరా నీది. ఏం వొచ్చిందివ్వాళ. కాకిలా కావ్ కావ్ మంటున్నావ్....' అనుకుంటూ వచ్చాడు పిచ్చెయ్య. వచ్చి సీట్లో కూర్చున్నాడు.

' చెవులో పూలూ వనాలూ. పెట్టకండి'....

'యాక్షన్ తీసుకోవాల్సి ఉంటుంది'.....

తలపుకు తలపుకొస్తోంది... శంకరం మాట!

దారిన పోతూంటే దాడి చేసి అదాటున గొడ్డుకారం మొహానికి మెత్తినట్లనిపిస్తోంది పిచ్చెయ్యకి. హాల్లో గుమాస్తాలంతా తనకేసి చూసి సన్న సన్నగా నవ్వుకుంటున్నారనిపించింది. అందులో ఆ కొత్త టైపిస్ట్ హసీనా, మరీ కంతిరిగా నవ్వుతోంది. తెలివిగా నవ్వుతోంది., 'ఓరి వెర్రి వెధవాయ్ బాస్ దగ్గర బాంగింగ్

చేయించుకొచ్చి పెద్ద ఫోజు కొడతావేంటిరా ...' అన్నట్టు వికృతంగా నవ్వుతోంది. సున్నారాసి సగం చెరిపేసినట్టు పెదవుల్ని మార్చి, మార్చి నవ్వుతోంది.

పిచ్చెయ్యకి గుండె మండిపోయింది. వంటసోడామీద నిమ్మకాయ పిండినట్లు - పిచ్చెయ్య కోపంమీద అవమానం బుసబుస పొంగింది. మెదడంతా మందు దట్టించిన క్వారీలా అయిపోయింది.

ఠక్కున లేచాడు.

పిచ్చెయ్య రావడమే తుఫాన్‌లా వచ్చాడు. చెప్పులు రెండూ హాల్లో రెండు మూలలకీ పరిగెత్తి దాక్కున్నై. చేతిలో బ్యాగ్‌ని టేబుల్ మీదకి గిరాటేసి కుర్చీలో కూలబడ్డాడు. మంచినీళ్ల గ్లాస్ అందించి భర్తకేసి చూసింది తులశమ్మ.

తులశమ్మకి ముప్పై ఏళ్ల పరిచయం- ఆ మొహమూ, ఆ మనిషీ! ఆ మొహం నవరసాలు పండించిన సందర్భాలు చాలా చూసింది. కానీ, ఇవ్వాళ - 'అరుణ గభస్తిమండలం' లా వుంది అది! (అవును. తులశమ్మ ఆకాలంలో సీనియర్ తెలుగు పండిట్‌గారి నాలుగో పుత్రికారత్నం లెండి!!!)

పిచ్చెయ్య కాఫీ తాగలేదు. ఆ గ్లాస్‌ని టేబుల్‌మీద ఉంచి, పెద్ద గొంతుతో అరిచాడు, "ఇది ఇల్లా, కల్లుపాకా. ఇరవైనాలుగ్గంటలూ ఆ టీవీని అట్టా చావగొట్టకపోతే తోచదా. కొంపెగిరిపోయేట్టు ఎందుకంత సౌండు. ఛీ...ఛీ... వెధవ కొంప, వెధవ మనుషులూ..."

భర్త చిరాకుకీ, విసుగుకీ తులశమ్మ విస్తుపోయింది.

ఈలోగా పిచ్చెయ్య చెల్లెలు టీవీ వాల్యూమ్‌ని తగ్గించింది. మాట్లాడకుండా లోపలికి నడిచింది తులశమ్మ.

కాఫీ ముగించి గదిలోకొచ్చాడు పిచ్చెయ్య. ఆయన నాలుగో పుత్రరత్నం-రాజు-వెంటనే మళ్లీ టీవీ. వాల్యూమ్‌ని పెంచాడు. ఆ పదేళ్ల విద్యార్థికీ- జీ టీవీ, స్టార్లూ- ఏదీ మిస్‌కాకూడదు.

పిచ్చెయ్యకి తిక్కతిక్కగా వుంది. పిచ్చిపిచ్చిగా వుంది. మనసంతా అలుగ్గుడ్డలా మసిమసిగా వుంది. "నా లుంగీ, టవల్ ఎక్కడ చచ్చినయ్" పొలికేక వేశాడు. వంటింట్లోనుంచీ పరిగెత్తుకొచ్చింది తులశమ్మ. "ఎందుకండీ అంత చిరాకూ, కోపం. ఏం జరిగిందనీ. అవిగో. రోజూ ఉండే చోటే వున్నై. చూసుకోకుండా అరుస్తారేం?"

"అవునే. నేనే అరుస్తున్నాను. నాకే చిరాకూ కోపం. ఏ విసుగూ, చిరాకూ, కోపం లేకుండా ఎప్పుడూ... ముద్దుముద్దుగా..చూసుకోవాలి నిన్నూ, ఈ ఇంట్లో అందర్నీను. అంతేగా నువ్వనేది?"

"ఇది మరీ బాగుంది. మేమేం చేశామనిరా నీ ధూము ధాములు" పిచ్చెయ్య తల్లి మాట కలిపింది.

"తల్లీ...నీకో నమస్కారం. మీ తల్లీకూతురూ గోదాలోకి దిగకండి. నే ఛావలేను"

"నేనేమన్నాననీ..ఇప్పుడు. ఏదో ఆ పిల్లకీ నాకూ కాలక్షేపమని టీవీ పెడతాం అంతేగా... ముట్టుకోవద్దంటే చెప్పండి. అదీ మానేస్తాం." తల్లి సన్నాయి నొక్కులు.

"అవును, అదీ చెప్పండి. టేప్ రికార్డర్ ముట్టుకోకూడదు, రేడియో ముట్టుకోకూడదు. వంటింట్లో మిక్సీ ముట్టుకోకూడదు. హాల్లో ఫ్రిజ్ ముట్టుకోకూడదు." చెల్లెలు సాగదీస్తోంది.

"ఎందుకమ్మా సరోజా అక్కర్లేని విషయాలు అవన్నీ ముట్టుకోవద్దని ఎవరన్నారు?"

"ఎవరనాలమ్మా... మీరే... నువ్వూ, నీ కొడుకూ, కూతురూ.... అంతా మీ పెత్తనమేగా" తల్లి.

"ఆ అంతా మా పెత్తనం కనకే ఇంత గొప్పగా సుఖపడిపోతున్నాం" తులశమ్మ సమాధానమూ విసురుగానే వచ్చింది.

"చూశావా... చూశావా"అంటూ రాద్ధాంతంలోకి దిగింది తల్లి.

పిచ్చెయ్యకి సహనం నశించింది. 'మీరిట్టాగే కొట్టుకు ఛస్తూవుండండి.

నేనెప్పుడో ఈ బీ.పీ.తో హరీమంటాను. ఆ తర్వాత అంతా కలిసి హాయిగా వుండండి".

"అనండి అనండీ. చివరికి ఉరుము వురిమి నా నెత్తినేగా పడేది" తులశమ్మ.

"చాల్లే నోరు మూసుకో. నీకేమైందిప్పుడు. అదిగో చూడు. ఆ ముండాకొడుక్కేమైనా బుద్ధివుందా? ఆ టీవీతో ఛస్తానంటూ మళ్లీ అదరగొట్టేస్తున్నాడు."

తులశమ్మ కళ్లల్లో నీళ్లు తిరిగినై. అసహనంతో అసహాయతతో కూడిన రోషం పెల్లుబికింది. విసుగు పుట్టింది. ఒక్క ఉదటున హాల్లోకి వెళ్లి రాజు వీపుమీద చరిచింది. "ఎన్నిసార్లు చెప్పాలి సిగ్గులేని వెధవా. ఇరవై నాలుగ్గంటలూ అక్కడే పడి ఏడవకపోతే పోయి చదువుకు ఛావరాదూ? " అంటూ ఎడాపెడా చేతుల్తో వాయించింది. "ఛీ...ఛీ... ఎంతచెప్పినా బుద్ధిలేదు. పో... అవతలికి" అంటూ వాణ్ణి మెడబెట్టి గెంటింది. దూరంగా తోసేసింది. రాజు కిందపడ్డాడు. లేచాడు.

రాజు గింజుకున్నాడు. ఏడుపులో కసినీ, కసిలో ఏడుపునీ రంగరించుకుని కన్నీళ్లు పెట్టుకున్నాడు. నిండు కుండలు కారిపోసాగినై. పళ్లు పరపరలాడించాడు. పిడికిళ్లని గాలిలోకి లేపి హస్త విన్యాసంచేశాడు. ఒకేసారి వేయి శాపాలు పెడుతున్నట్టు తల్లినీ తండ్రినీ మిర్రి మిర్రిగా చూశాడు. వెర్రి వెర్రిగా చూశాడు. శబ్దం చేస్తూ కాళ్లు తాటించాడు. విసురుగా అక్కణ్ణించీ కదలి పోయాడు.

–అప్పుడు ఇంట్లో అందరూ ఏమేమో మాట్లాడుతూనే వున్నారు. ఒకరు మాట్లాడేది ఒకరు వినరు. విన్నా తమధోరణిని తాము ఆపరు!

రాత్రి తొమ్మిది దాటింది. అప్పటికి అంతా నాలుగు ముద్దలు గతికారు. ఇల్లు సద్దుమణిగింది.

పుస్తకాలు ముందు పెట్టుకొని హాల్లో కూర్చున్నాడు రాజు.

వాడికి బుర్రంతా ఇటుక ఆవంగా వుంది. మెదడు కాలిపోతోంది. కడుపు రగిలిపోతోంది. తల్లి కొట్టిన దెబ్బలకంటే తండ్రి మాట పీకుతోంది. ఎందుకు తిట్టాలి తనని? టీవీ చూడటం తప్పా!? వీళ్లందర్నీ కట్టకట్టి ఉతికెయ్యాలి! అమ్మకి అమ్మ మాత్రం... మంచీ మర్యాదా లేకుండా తనను కొడుతుందా? తను ఒక్క గుద్దు గుద్దితే.... చచ్చూరుకుంటుంది.....

"ఛీ...ఛీ..." అనుకుంటూ లేచాడు రాజు. మహాపర్వతాల్ని జయించే శూరుడిలా లేచాడు. పందెపుటెద్దుని ఎదుర్కొనే గుండెబలం గల వీరుడిలా లేచాడు.

నాలుగింటికే మెళకువ వచ్చింది తులశమ్మకి. పక్కన పిచ్చెయ్య గుర్రు పెడుతున్నాడు. విసుగునీ, చిరాకునీ, కసినీ, క్రోధాన్నీ, అరుపుల్నీ, పొలికేకల్నీ; ఆవేదనల్నీ; అణుచుకున్న, అణుచుకోలేకపోయిన...అన్ని సొదలనీ, రొదలనీ... మూడో పురుషార్థంలో లయంచుకొని, ఊరటపొంది, తన సానుభూతి కలిగించిన స్పర్శలో, దగ్గరితనంలో కరిగిపోయి, కలిసిపోయి, అలసిపోయి.....

తనని కౌగలించుకొని పడుకుని వున్నాడు!

తులశమ్మ సన్నగా నవ్వుకుంది! నెమ్మదిగా కదిలి, పక్కకి జరిగి, మంచం దిగింది.

గదిదాటి హాల్లోకి వచ్చింది. రాజు లేడు. ఆమె గుండెలు వేగంగా కొట్టుకోసాగినై. పక్కగది చూసింది. అత్తా, ఆడపడచూ ఉన్నారు. బయటి తలుపు చూసింది. గడియవేసిలేదు. ఆమెకు దడ మొదలైంది. తలుపు దగ్గరకి వేసి తెల్లవార్లూ అందరూ మొద్దునిద్రపోయారనే వాస్తవం... కాళ్ళూ చేతులూ ఆడనీయలేదు. మరోపక్క రాజు ఏమయ్యాడనే ఆతృత. ఇల్లంతా కలియ చూసింది. బాత్‌రూమ్ చూసింది. రాజు లేడు. బయటికి వచ్చి నలుదిక్కులా ఆవరణ అంతా చూసింది. చీకటి మసక మసకగా వుంది. బెరుకు బెరుగ్గావుంది. రాజు కనపళ్లేదు. ఊపిరి బిగపట్టుకొని ఆవరణంతా తిరిగింది. కంపెనీ క్వార్టర్స్ వెలుగు నీడలు చెట్లతో, చెట్ల నీడలతో ఆడుకుంటున్నై. గేటు దగ్గర ఘూర్కా పలకరించాడు. ఏవిటంటే ఏడుపొచ్చింది. పగిలిన కంఠంతో అడిగింది. రాత్రి పదింటికి సైకిలూ. పుస్తకాల సంచీ తీసుకొని ఎటోవెళ్ళాడు కదా అన్నాడు. కాళ్ళు నిల్వలేదు. ఠక్కున వెనక్కొచ్చింది. గదిలోకి వెళ్ళి పిచ్చెయ్యని లేపింది.... క్షణాల్లోనే ఇల్లంతా భయం పరచుకుంది.

ఆకాశం అంచున సూర్యుడు లేస్తున్నాడు. కాలనీ నిద్రలేచింది. ఊరు మేలుకొంది.

మనస్సును ఉగ్గబట్టుకొని , కాళ్ళు సాగుతున్నై. రాజుని వెతుకుతూ నలుగురూ నాలుగు దిక్కులకు పోతున్నారు. వస్తున్నారు. రాజు జాడ లేదు.

పిచ్చెయ్య పెళ్లాన్నీ తల్లినీ, చెల్లెళ్ళీ విడివిడిగానూ... కలిపి ఏకమొత్తంగానూ... తిడుతున్నాడు. పళ్లు కొరుకుతున్నాడు. అందరి మొహాల్లో దిగులూ, కళ్లల్లో భీతీ.

పిచ్చెయ్య తల్లి... కోడల్నీ, కొడుకునీ సాధిస్తోంది. మధ్య మధ్యలో కళ్లొత్తుకుంటోంది. తులశమ్మ చిన్నపిల్లలా ఏడుస్తోంది. పెద్దకూతురుకీ కొడుక్కీ తెలపాలనుకుంటోంది ఆ మాట అనటానికి మొగుడిముందు మళ్లీ ధైర్యం చాలడంలేదు. క్వార్టర్స్‌లో కుర్రాళ్లంతా వూళ్లోకి పోయారు. మగవాళ్లలో సగం మంది ఆవరణలో పెద్ద వేపచెట్టుకింద చేరారు. పోలీసులకి చెప్పమన్నారు ఎన్నెన్నో సలహాలూ, సూచనలూ వస్తున్నై.

బారెడు పొద్దెక్కింది. ఎవరో కుర్రాడు ఉరుకులు పరుగులమీద వచ్చాడు.

రాజు కనిపించాడు! వాళ్ల స్కూల్ కాంపౌండ్‌లో సైకిల్ తొక్కుతున్నాడు.

అంతా స్కూల్ కాంపౌండ్‌లో చేరారు. జనం మూగారు. పిచ్చెయ్య కేకలేస్తూ గదమాయిస్తూ కొడుకుని ఇంటికి పదమన్నాడు రాజు ఉలకలేదు. పలకలేదు. సైకిల్ మీద రాజు... సైకిల్ తిరిగిపోతోంది. తులశమ్మ ఏడుపు. పిల్లవాణ్ణి పట్టుకున్నది. వాడు ఆగలేదు. విసురుగా బలమంతా కూడదీసుకొని తొక్కుతున్నాడు. ఉన్నట్లుండి పెద్దగా అరిచాడు. "ఎవరూ దగ్గరికి రాకండి" మాట పూర్తి కాకుండా ఏడుపు పొంగుకొచ్చింది. ఏడ్చేశాడు. బేలెన్స్ తప్పింది. క్రింద పడిపోయాడు. తల్లి ఏడుస్తూనే పక్కకి చేరింది. వాడి ప్రాణాలు కళ్లల్లో ఉన్నై. కాళ్ళ పాదాలు ఉబ్బిపోయినై. రెప్పలు తాటిస్తున్నాడు. అరమోడ్పుగా ఉన్నై కళ్లు.

రాత్రంతా సైకిల్ తొక్కుతూనే ఉన్నట్టు తేలింది. పిచ్చెయ్య గుండె ద్రవించింది. కళ్లనీళ్లతోనే చెల్లాచెదురుగా పడి ఉన్న పుస్తకాల్ని ఏరుకొచ్చాడు.

అతి కష్టంమీద ఆటోలో ఇంటికి తీసుకొచ్చారు.

అసంకల్పంగా పుస్తకాలు తిరగేస్తే... ఒకనోట్‌బుక్ అంతా... పూర్తిగా తమ కథే! అమ్మా నాన్నా అన్యాయంగా, అనవసరంగా తననే తిడతారనీ, కొడతారనీ.... తనకు వాళ్లమీద చంపేసేటంత కోపమనీ... ఏమోమో రాసి వుంది. నోట్‌బుక్ చివర్లో వాక్యాలు ఇవీ: అమ్మా నాన్నకి కోపం వస్తే నన్ను కొట్టారు. నాకు కోపం వస్తే... ఏంచేయాలి?...

పిచ్చెయ్య తల తిరిగిపోయింది.

తులశమ్మ తల దిమ్మెక్కింది.

పరామర్శలకి వచ్చిన జనంలో ఎవరో అంటున్నారు. పొద్దున్న రాజు గురించి చెప్పడానికి ఎం.డీ. గారింటికి పోతే... ఎం.డీ.గారి సతీమణి మొగుణ్ణి ఎడాపెడా తిట్టేస్తున్నదని!!

పక్కనున్న పెద్దాయన ఎవర్తోనో చెప్తున్నాడు. "అయితే ఆఫీసులో ఇవ్వాళ ఎవరికో మూడిందన్న మాటే!!"

అంతేనా!!!...

పిచ్చెయ్య తులశమ్మ కేసి చూశాడు. ఆమె తల వంచుకుంది. మరుక్షణం తులశమ్మ తల ఎత్తి భర్త కళ్లల్లోకి చూసింది. అప్పుడు పిచ్చెయ్య చూపు మరల్చి తల దించుకున్నాడు.

అవును... చూపు-లో చూపు- కావాలి!!

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 3-9 ఆగష్టు, 1994. )

# రేపటి వెలుగు

గణపతి బాత్‌రూమ్‌లో హమ్మింంగ్ చేస్తున్నాడు.

" మన్ తడప్ తడప్ హరి దర్శన్ కో ఆజ్ " అని రాగం తీసి అదే పాదాన్ని మళ్లీ మళ్లీ పాడుకుంటూ... మధ్య మధ్యలో " మన్ తడప్ తుమ్ దర్శన్‌కో ఆజ్" అని మార్చి మార్చి ఆనందిస్తున్నాడు. అతనికి తెలుసు... తాను పాడే పాటలో అపశబ్దాలు ఎక్కువే అని.

అపశబ్దాలు కలిపి పాడితేనే అసలైన ఆనందం మరి!

స్నానం అయింది. డ్రస్ చేసుకుని హాల్లోకొచ్చి కూర్చున్నాడు గణపతి.

గేటు చప్పుడైంది. అటుకేసి చూశాడు.

క్షణాల్లో ఆవ్యక్తి ఇంట్లోకి వచ్చేశాడు.

"రామ్మూర్తి!"... ఆశ్చర్యపోయాడు గణపతి. పైకే అనేశాడు.

రామ్మూర్తి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. హాలంతా కలయచూశాడు. సరాసరి తాను చెప్పదల్చుకున్న విషయంలోకి దూకేశాడు. గణపతిని వుద్దేశించి చెప్పడం మొదలెట్టాడు.

"ఆ మనిషి చాలా రణపెంకె సార్. ఏదో చిన్నతనం లెమ్మని అన్ని విషయాల్లోనూ నేనే సరి పెట్టుకుపోయేవాణ్ణి. ఆఫీసునుంచీ వోగంట లేటుగా వచ్చిన పాపానికి పెద్ద యుద్ధం చేసేది. నిజం చెప్తున్నాను సార్. ఒకరోజు వండే వండే అన్నాన్ని కుంపట్లో పోసేసింది. చిన్న విషయానికి కూడా ఆమె సతాయింపు ఆ స్థాయిలో ఉండేది. నేను వాటన్నిటికీ కూడా బాధపడలేదు... మాస్టారూ. ఆమె పొగరుబోతుతనం ఎంతదూరం వెళ్ళిందంటే చీటికీ మాటికీ నాతో దెబ్బలాడి పుట్టింటికి పోయేది. నేనెళ్లి మొత్తుకొవడం. అతి కష్టంమీద తిరిగి వచ్చేది. కానీ ఏం ప్రయోజనం? మానసికంగా, శారీరకంగా ఎందుకూ నాకు ఉపయోగపడేది కాదు."

అతను తలవంచుకొని ఒక్కక్షణం ఆగేడు. రామ్మూర్తి మాటలకి గణపతి ఏమీ విస్తుపోలేదు. అతన్ని తేరిపార జూసేడు. అడ్డదిడ్డంగా పెరిగిన గెడ్డం, నిర్లక్ష్యంగా ఫాన్ గాలికి లేస్తున్న తైల సంస్కారం లేని జుట్టు, మాసి ముడుతలు పడ్డ బట్టలు, మనిషిలోని కరుడు గట్టిన దౌష్ట్యం- కళ్లజీరల్లో కనిపిస్తోంది. అతని రూపాన్ని చూస్తుంటే ఉమ్మెత్తకాయ స్ఫురించేది – గణపతికి.

రామ్మూర్తి మళ్లీ మొదలెట్టాడు, "నాకు ఆమెని చూస్తుంటే రాక్షసిని చూస్తున్నట్టే వుండేది. రాత్రంతా ఓ మూల కూలబడి ఉండేవాణ్ణి. గుండె మండుతూ ఉండేది. కళ్లు వాచిపోయేవి. ఏం చేయాలో అర్థం అయ్యేది కాదు.

అతను ఓ దీర్ఘమైన నిట్టూర్పు విడిచి కుర్చీలోకి రెండు కాళ్ళని చేర్చి ముడుచుక్కూర్చున్నాడు.

గణపతి కళ్ళు రామ్మూర్తి పాదాల్ని చూసినై. నెర్రెలు విచ్చిన నల్లరేగడి గడ్డలు తలపుకొచ్చినై – గణపతికి.

"ఛీ... ఛీ.... నిజంగా ఆడది కాదది – రాక్షసి!!

తులసి కాఫీ కప్పులతో వంట ఇంట్లోనుంచి హాల్లోకి వచ్చింది

రామ్మూర్తి షాక్ తిన్నాడు. మందు దట్టించిన ఫిరంగి తనవైపు గురిపెట్టబడినట్లు అనిపించింది అతనికి.

"నీ గురించే చెప్తున్నాడు తులసీ ఈయన" తులసిని ఉద్దేశించి అన్నాడు, గణపతి.

నడుస్తున్న జాజి తీగెలా పక్కకి నడిచి – గణపతికి కాఫీ కప్పునందించింది తులసి. రెండో కప్పుని తన చేతిలో పట్టుకొని కుర్చీలో కూర్చుంది. కాఫీ సిప్ చేస్తూ... "తీసుకోండి" అన్నట్టు గణపతికేసి చూసింది.

అతనూ కాఫీ తాగడం మొదలెట్టాడు.

రామ్మూర్తి బిక్క చచ్చిపోయాడు. అతను ఊహించని మలుపు ఇది. తులసీ గణపతీ గురించి ఎవరో చెప్పగా విన్నాడేకానీ, తులసి గణపతి ఇంట్లోనే ఉంటుందన్న వాస్తవం అతనికీ తెలియదు. అసహనంగా కుర్చీలో మసిలేడు. రెండు కాళ్ళు కిందకి పెట్టేడు. అతని పెదవులు అదరసాగినై. కోపం ముంచుకొచ్చింది. లేచాడు. అటూ ఇటూ తిరుగుతూ మధ్య మధ్య తులసివైపు మిర్రి మిర్రి చూపులు చూడసాగేడు. గోడవారగా నడిచి కాళ్లతో నేలను తన్నేడు. గోడమీద చూపుడు వేలుతో ఏవో పిచ్చి అక్షరాల్ని రాసి వెనక్కి తిరిగేడు.

గణపతీ తులసీ కాఫీ ముగించారు.

గణపతి కుర్చీలోంచి లేచి బయటకు వెళ్ళటానికి ఉద్యుక్తుడయ్యాడు. పోతూ పోతూ వెనక్కి తిరిగి, తులసి నుద్దేశించి ... "తులసీ, ఈయన పేరు రామ్మూర్తి. వర్మా అండ్ కంపెనీలో డిస్మిస్డ్ ఎంప్లాయీ. నీతో మాట్లాడాలనే వచ్చారనుకుంటా" అని చకచకా కదిలి పోయాడు.

రామ్మూర్తి అహం దెబ్బతింది. గుండెలో మెత్తని కత్తి దించినట్లయింది.

ఇప్పటికే తులసి ప్రవర్తనకి అతని కడుపు రగిలి పోతోంది.

గణపతి వెళ్లగానే కుర్చీలోంచి లేచి లోపలికి వెళ్లిపోయింది తులసి.

ఆమె వెనగ్గా తానూ లోపలికి వెళ్లబోయాడు రామ్మూర్తి. కానీ ఇంతలో వసారా గదిలోంచి సన్నని దగ్గు వినిపించింది. ఆగిపోయి వెనక్కి చూశాడు రామ్మూర్తి.

హాల్లో పచార్లు చేస్తూ ఇందాకటి గోడవారగా వచ్చేడు. గోడమీద మళ్లీ ఏవేవో గీతలు గీశాడు. పళ్ళు కొరుక్కున్నాడు.

"నాకు ఇంకేం అఖ్ఖర్లేదమ్మా. నువ్వు వెళ్లి నీ పని చూసుకో" అని గదిలోనుంచి మాటలు వినిపించినై. ఆ వెనగ్గా తులసి హాల్లోకి వచ్చింది.

కాఫీ కప్పులు తీసుకొని వెళ్లబోతుంటే గొంతు పెకల్చుకొని మాట్లాడేడు రామ్మూర్తి. " కాస్త ఆగు తులసీ. నా మాట విను...."

తులసి అతని వైపు నిరాసక్తతతో చూసింది. అసహనంగా నిలబడింది.

"నాకు తెలుసు. నేనిప్పుడేం చెప్పినా నువ్వు నమ్మవు. నిజం చెప్పాలంటే నువ్ వచ్చేసినప్పటినుంచీ - నడుస్తున్న శవంలా తిరుగుతున్నాను నేను. నన్ను నరకంలో పారేసి వచ్చేశావు నువ్వు." అని ఓ క్షణం ఆగి " నాకు ఉద్యోగం కూడా పోయింది...." అంటూ తల వంచుకున్నాడు.

"మన ఒక్కరాష్ట్రంలోనే కొన్ని లక్షల మంది నిరుద్యోగులున్నార్ట..."

"అంటే నేనూ వాళ్లల్లో ఒక్కణ్ణంటావ్. హూ" అని ఓ క్షణం ఆగి అన్నాడు. "నన్ను క్షమించు తులసీ. జరిగిందంతా మరచిపో"

పేలవంగా నవ్వింది తులసి. చేతిలోని కప్పును టీ పాయ్ మీద పెడ్తూ అడిగింది, "మరిచిపోయి ఏంచేయాలి?"

"నాతో వచ్చేయ్, మన ఇంటికి పోదాం..."

"మన ఇల్లు.... హు...!"

" అవును - నువ్వు వచ్చి నన్నీ పరిస్థితుల్నుంచీ రక్షించకపోతే నాకు ఆత్మహత్యే శరణ్యం."

"అదీ అంత తేలిక కాదు. మీరు నాకలాంటి స్థితి కల్పించినా చూశారా... ఆత్మహత్య చేసుకోవడం నావల్ల కాలేదు."

"చచ్చిన పాముని ఇంకా చంపబోకు తులసీ... నన్ను క్షమించు..." ఒక్కడుగు ముందుకువేసి ఆమె చేతులు పట్టుకున్నాడు రామ్మూర్తి.

అతని చేతుల్ని విదిలించేసింది తులసి. ఆమె కళ్లు అసహ్యంతో నిండి పోయాయి.

అవేమీ గమనించనట్లు, " ఈ కష్టకాలంలో నాకు నువ్ తప్ప మరెవరున్నారు తులసీ..."

రామ్మూర్తి ఏడ్చేశాడు.

తులసి చిరాకు పడింది. " అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు", కప్పులు చేతుల్లోకి తీసుకొని ఓ అడుగు పక్కకు వేసి కదిలింది.

"కాదు తులసీ. ఈ ఒక్కసారికీ నామాట నమ్ము. నన్ను నువ్వే ఆదుకోవాలి."

"అదే అంటున్నాను నేనుకూడా. మిమ్మల్ని ఆదుకోవడానికి మాత్రమే నేను మీకు కావాలి అంతేగా? " కరకుగా అడిగింది. 'ఆదుకోవడానికి' అనే మాటని వత్తి పలికింది.

"అంటే?" అని అర్థం కానట్లు ఆమె వైపు చూసేడు రామ్మూర్తి.

"మీకు అంత తేలిగ్గా అర్థం కాదులెండి. అయినా- అనవసరపు మాటలెందుకు? మీరు వెళ్ళొచ్చు".

"ఇదే నీ నిర్ణయమా?"

"అవును. అయినా మీకు తెలునుగా ... నేను రణపెంకిననీ, పొగరుబోతుననీ, ఇందాక కూడా గణపతికి చెప్పావు. అందుకు నేను అనుభవించిన క్షోభనంతా మీరు అనుభవించినట్లు ఇతరులకి చెప్తున్నా వింటూ ఊరుకున్నాను".

ఒక్కక్షణం ఆగి ఉద్వేగంతో చెప్పుకుపోసాగింది. "అంతేకాదు, నేను నిజంగా ఆడదాన్ని కాదు. మీరు నా దేహంమీద చేసిన చిత్రహింసలన్నీ సహించి మిమ్మల్ని పతిదేవుడిగా భావించాను."

"ఒక్క మాట నేను రాక్షసిని కూడా, అవును నేను రాక్షసినే... నేనున్న గదిలోకి మరో మొగాణ్ణి పంపి తలుపు గొళ్ళెం పెట్టిన నిన్ను... ప్రాణాల్తో వదిలిపెట్టి వచ్చేశాను. అవును నేను రాక్షసినే. రాక్షసినే." అరిచేసింది, తులసి.

సాచి చెంపపెట్టు పెట్టినట్లయింది రామ్మూర్తికి. స్థాణువులా నిలబడిపోయాడు.

ఠక్కున రామ్మూర్తిని గుమ్మంనుంచీ బయటకు నెట్టి, విసురుగా తలుపు వేసి, లోపలికి పోయింది తులసి.

రామ్మూర్తి మెదడులో సినిమా రీళ్లు తిరుగుతున్నై.

రోడ్డు వారగా బంకు దగ్గర నిలబడిన గణపతి... సన్నగా ఈల వేసుకొని, కూనిరాగాన్ని హమ్మింగ్ చేస్తూ కదిలిపోతున్నాడు! అతని చూపు ... న్యాయం, చట్టం చూపుతున్న రేపటి వెలుగు వైపు!!!

***

(ఆదివారం ఉదయం)



# అనివార్యం?

ఎడంచేతి చూపుడు వేలికి కట్టుకున్న గుడ్డపీలికని సరి చేసుకున్నాడు రాజు. కత్తెర గాయం సన్నగా సలుపుతోంది.

టైమ్ చూశాడు. తొమ్మిదిన్నరయింది.

షాపులో అందరూ బట్టల తానుల్ని సర్దుతున్నారు.

షాపు మూసే టైమయింది. సేట్ నోట్లకట్టల్ని లెక్కపెట్టుకుంటున్నాడు. ఒకరిద్దరు కష్టమర్లు బేరం పూర్తిచేసుకున్నారు. సేల్స్‌మెన్ ఒక్కొక్కరే కదిలి పై అంతస్తుకి వెళ్తున్నారు.

ఇవ్వాళ జీతాల బట్వాడా. మొదటి అంతస్థులో సేట్ బావమరిది ఇస్తాడు.

రాజు–బాగ్‌లో బట్టల్ని వుంచి తన ముందున్న దంపతులకి ఇచ్చాడు. 'కొంచెం ఆలశ్యమైనా చివరికి మంచి చీర దొరికిందండీ' అంటూ మురిసిపోతోంది భార్య. 'ధర కూడా మంచిగానే వుందిలే పద' అంటూ బయటికి దారితీశాడు భర్త.

కౌంటర్‌లో చీరలూ, ఇతర తానులూ షోకేస్‌లో సర్ది, తానూ కదిలాడు రాజు.

మొదటి అంతస్థు రద్దీగావుంది. జీతం తీసుకుని కిందికొస్తున్నారు ఒక్కొక్కరే. మెట్లమీద ఎదురైంది మాధవి. హేండ్‌బాగ్‌ని భుజానికి వేసుకుంటూ రాజుని ఉద్దేశించి 'గుడ్‌లక్' అంది. ఆగకుండా సాగిపోయింది. సన్నగా నవ్వుతోంది. అవును. ఆ పిల్ల విష్‌లోనూ, నవ్వులోనూ వ్యంగ్యంవుంది. అది రాజు కొక్కడికే తెలుసు. మాధవి తన పక్కకౌంటర్లో మ్యాచింగ్ బ్లౌజ్‌పీస్‌లు చూస్తుంటుంది మరి. తమకష్టసుఖాల్ని– అడపాదడపా... ఖాళీగా వున్నప్పుడు కలబోసుకుంటూ వుంటారు.

పైకివెళ్లి సేట్ బావమరిదికి కనబడేటట్లు ముందుకు వెళ్లాడు. 'నువ్వుందు' అన్నాడాయన. దబ్బపండు ఛాయలో, రిమ్‌లెస్ జోడుతో, తెల్లటిబట్టల్లో అందంగా, ఆరోగ్యంగా, ఆనందంగా వుంటాడు ఆయన.

తాగుతున్న యాపిల్ జ్యూస్‌ల మహత్యం అనిపించింది రాజుకు. అతనికి మనసులో అప్పటికేమో పొడిపొడిగా ఉన్న అనుమానం ముద్దముద్దగా మారుతోంది. మనస్సుకు బెజ్జం పడినట్లు-కోపం తొంగిచూస్తోంది. కారణం అతనికి తెలుసు. ఈ నెలలో మూడురోజులు షాపుకు లేటుగా వచ్చాడు. మూడు రోజులు లేటైతే ఒక రోజు జీతం తగ్గిస్తాడు సేట్. ఇది రూలు. ఈ రూలుని అమలు చేసేటప్పుడు విడిగా చిన్న ఉపన్యాసం ఇస్తాడు సేట్ బావమరిది. అందుకే అతనిప్పుడు రాజుని 'నువ్వుందు' అని ఆపింది.

స్టూలు మీద కూర్చున్నాడు రాజు. అతని మనసు పరిపరి విధాల పోతోంది.

మొదటిసారి లేటైన రోజున తను పడిన అవస్థంతా గుర్తుకొచ్చింది. ఆవేళ పధ్నాలుగో తారీకు. బస్ పాస్ కొనుక్కొని షాపుకు రావాలని బయలుదేరితే కోటీ చేరే దారిలోనే బస్ చెడిపోయింది. అక్కణ్ణుంచి బస్‌లు మారుతూ గమ్యం చేరుకొనేసరికి పుణ్యకాలం కాస్తా మించిపోయింది.

రెండోసారి...

ఆరోజు ఉదయం నుంచే జోరున వర్షం ప్రారంభమైంది. హడావిడిగా బయలుదేరి గుమ్మం దాటబోతుంటే... ఎదురుగా నీళ్ళబిందెతో లోపలికొస్తున్న కమలని ఢీకొన్నాడు. బిందెతో సహా కుప్పగా కూలిపోయింది కమల. బిందె సొట్టపడింది. కమలకి గట్టి దెబ్బే తగిలింది. కొద్దిసేపు ఈ సంభవంతో ఆలస్యమైంది.

మూడోసారి... చాదర్‌ఘాట్ అవతల ఏదో పార్టీ కార్యకర్తలు 'రాస్తారోకో' నిర్వహిస్తుంటే లేటైంది బస్‌కి.

అయినా ...కారణాలు గట్రా సేట్‌కి అక్కర్లేదు. 'లేటుగా వచ్చావా లేదా'

బస్. అంతే. లేటుగా వచ్చావు. కనుక ఫలితం అనుభవించు!

రాజుకి నవ్వొచ్చింది. తన బాల్యం గుర్తుకొచ్చింది.

ఐదో తరగతిలో తమకు మాధవపెద్ది వెంకటేశ్వర్లు గారు టీచరు. ఆయన - క్లాసులో పిల్లల్ని అందర్నీ ఇంటిపేర్లతో పిలవడం అలవాటు. నెలలో మూడు సార్లు స్కూలుకు లేటుగా వస్తే ఆ విద్యార్థి గ్రౌండ్‌లో ఉన్న తాటి చెట్టు క్రింద ఒంటికాలిమీద గంటసేపు నిలబడాలి. ఇదీ ఆయన నియమం. ఒకసారి చిమటావారబ్బాయి మాధవ మూడోసారి లేటుగా వచ్చాడు. ఆయన బెత్తం పుచ్చుకొని రూమ్‌లో పచార్లు చేస్తూ, "ఏరా చిమటా. తాటిచెట్టు తెలుసా?' అని ప్రశ్న వేశాడు. మాధవ అసలే కంగారులో వున్నాడు. పైగా భయం. వణికిపోతూ గుమ్మంలోవాడు గుమ్మంలోనే ఒకటి చేసేశాడు. మాస్టారుతోపాటు అందరమూ నవ్వేశాం. కానీ, ఆ తర్వాత జాలేసింది. క్రమ శిక్షణకు మారుపేరయినా మా వెంకటేశ్వర్లు మాస్టారిది వెన్న వంటి మనస్సు. "పోరా - వెధవా. ఇంటికిపో... కొట్టనులే. పోయి నెక్స్ట్ పిరియడ్‌కి రా..." అని పంపించేశారు.

సేట్‌కి అట్టాంటి దయాదాక్షిణ్యాలేమీ లేవు. ఓ నెల్లో మాధవికి కోత, మరోనెల్లో రామానుజంకి కోత.

రామానుజమంటే... సేట్ షాపు ప్రారంభించినప్పుడు చేరి ఇరవైమూడేళ్లుగా వుంటున్న సీనియర్‌మోస్ట్ సేల్స్‌మాన్. అప్పుడు ఒక రూమ్‌లో ప్రారంభించిన బట్టల కొట్టు అది. ఇవ్వాళ ఇది... నూట అరవై మంది సేల్స్‌మెన్ పని చేస్తున్న వస్త్ర ప్రపంచం!

"రాజూ..." పిల్చేడు, సేట్ బావమరిది. అయనపేరు కమలేష్.

ఉలిక్కిపడి ప్రస్తుతంలోకి వచ్చాడు, రాజు. జీతం అందుకున్నాడు. పక్కకి వచ్చి లెక్క పెట్టుకున్నాడు. ఎనిమిది వందలా డెబ్బయి రూపాయలు. ఒకరోజు వేతనం కట్!

కమలేష్ అన్నాడు, "రాజూ... ప్రతినెలా నీ హాజరు పట్టీలో ఒకటి రెండు లేట్ మార్కులుంటున్నై. నేను మంచివాణ్ణి కనుక ఓపిగ్గా చూస్తున్నాను. నువ్ చాలా మారాలి. ఓ.కె. నువ్వెళ్లు"

ముల్లుగుచ్చుకుంది రాజుకు. నెమ్మదిగా బయటికి వచ్చాడు. ఈ ఆలోచనతోనే బస్‌స్టాప్ దాకా నడిచాడు. నిలబడ్డాడు షాప్‌లన్నీ సీరియల్ లైట్లతో దేదీప్యమానంగా వెలుగుతున్నై. గుమాస్తా గాళ్లంతా బయట పడుతున్నారు. తను ఇక్కణ్ణుంచీ బస్ పట్టుకొని కోఠీ చేరాలి. అక్కణ్ణుంచీ వేరే బస్‌లో టెలిఫోన్ కాలనీ చేరుకోవాలి. పది కావస్తోంది. కమల తన కోసం చూస్తూ వుంటుంది. రోజూ ఇంతే. గూటికి చేరే సరికీ పదకొండు. ఉదయం ఎనిమిదిన్నరకి షాపు గుమ్మంముందు వుండాలి. రాత్రి తొమ్మిదిన్నరదాకా డ్యూటీ, మధ్యాహ్నం అర్థగంట... లంచ్ అవర్!

నవ్వుకున్నాడు రాజు. అవర్ అని పిలుస్తూ... అర్థగంట విరామమేమిటో! ఆ అర్థగంటలోనూ తను బాక్స్‌లో తెచ్చుకున్న మజ్జిగన్నం తినేది... పదినిమిషాలే. మరో పదినిమిషాల్లోనే తను మళ్లీ కౌంటర్లోకొచ్చేస్తాడు. కానీ, లేట్‌మార్కు వేసేటప్పుడు ఈ సమయాలకేమీ ముదరా దొరకదు. అయినా, తను అందరిలా ఖారాఖండీగా అర్థగంట విరామాన్ని వాడుకోడు. ఇతరులతో చెప్పుకోవలసిన విషయాలుగానీ, ఇతరునుంచీ వినాల్సిన విషయాలుగానీ ఏవీ కనపడవు తనకు... ఆ అర్థగంట విరామంలో.

బస్ వచ్చింది. ఎక్కి కూర్చున్నాడు.

– రాజు ఇంటికి చేరే సరికీ, మిషన్‌మీద ఏదో కుట్టబోతోంది.. కమల. అతన్ని చూసి ఆ ప్రయత్నం ఆపేసింది. అంతలోనే అతనన్నాడు "రాత్రుళ్లు మిషన్ పట్టుకోవద్దన్నానుగా" అని. అతని స్వరంలో మార్దవమే ఎక్కువగా ధ్వనించింది. "లేదులెండి" అని, చిరునవ్వుతో "మీరు స్నానం చెయ్యండి" అని కిరోసిన్ స్టౌమీద కాగివున్న అల్యూమినియం గిన్నెని పాతగుడ్డతో పట్టుకుని దొడ్లోకి నడిచింది కమల.

రాజు ఆమె వెంటే నడిచాడు.

రాజు స్నానం అయింది. ఈలోగా భోజనం ఏర్పాట్లు చేసింది కమల. ఇద్దరూ కూర్చున్నారు. అన్నంతింటుండగా చెప్పింది, కమల. "అత్తయ్య ఉత్తరం రాసింది. వారం నుంచీ జెరంట. దగ్గు తగ్గడంలేదుట. లతకి నాలుగోనెలట. సుధాకర్ సంగతేమీ తెలీలేదుట. చిన్నా, కళ్యాణీ బాగానే వున్నార్ట".

మధ్యమధ్యలో ఊ కొట్టూ విన్నాడు రాజు. మొన్ననే అతికష్టంమీద మూడు వందలు పంపింది, కమల. దగ్గు, జెరం తగ్గటంలేదంటే... రాజుకి భయమేసింది. టీబీ.తో పోయిన తండ్రి గుర్తుకొచ్చాడు. 'అమ్మక్కూడా అలాంటిదేమైనా...?' ఆలోచించలేక పోయాడు. లతకి నాలుగో నెల అంటే... ఆ తర్వాత చాలా ఖర్చులు వస్తాయి. సుధాకర్ సంగతిఏమీ తెలీదు... ఎక్కడికి వెళ్లాడో? ఏం చేస్తున్నాడో?

రాజుకి తమ్ముడు గుర్తుకొచ్చాడు. కాలేజీలో చేర్పించలేనన్నదని అమ్మమీద అలిగి ఇంట్లోనుంచీ వెళ్లిపోయాడు. ఇప్పటికప్పుడే మూణ్ణెల్లు దాటింది.

ఎంతగా వాళ్ల బాధ్యతని తాను తీసుకోవాలనుకున్నా, తమ పరిస్థితి అంతమాత్రంగానే వుంది. తనకు వచ్చేది తొమ్మిదివందల జీతం. దాన్లో ముందు నూటయాభై బస్ పాస్‌కి పెట్టాలి. ఇంటి అద్దె మూడు వందలు. అదీ ఈ పేటలో, ఈ ఇంట్లో కనుక. రెండు గదులు. పైన పెంకులు సూర్యచంద్రులకి జల్లెడలా నిలుస్తున్నై. అంతే. పెరట్లో చుట్టు తిరిగి ఇంటి వాళ్ల దొడ్లోనుంచీ తెచ్చుకోవాలి... నీళ్ళు.

నిజానికి తమ ఇద్దరి పొట్టలూ గడవడానికి... ఆ జీతం రాళ్లు ఏపాటివి? నగర జీవనంలోని ఏ ఆ కర్షణకీ లోనుకాకపోయినా, చేతికీ నోటికీ చాలవు. అందుకనే వేణ్ణీళ్లకి తోడు చన్నీళ్లలా... కమల కుట్టుమిషన్ పెట్టుకుంది. అబ్బనాకారి ఆరోగ్యం ఆమెది. అయినా, తనను ఒప్పించి పాతమిషన్‌తీసుకుంది. అదీ వాయిదాల్లో డబ్బు ఇచ్చేటట్లు. ఆ అప్పు తీర్చిన తర్వాత గడించిన నాలుగురాళ్లే... మొన్న అమ్మకి

పంపిన మూడు వందలు.

ఆలోచనతోనే అన్నం అయిందనిపించాడు, రాజు.

కాంపౌండ్‌లోకి నడిచాడు. దూరంగా రోడ్డుమీద లారీలు పోతున్న శబ్దం వినిపించింది.

ఇంటిముందు వైరు మంచం వాల్చుకొని పడుకున్నాడు రాజు. కమల ఇల్లు సర్దుకుంటోంది. రాజు మనస్సును ఆలోచనలు వెంటాడుతూనే వున్నై. పల్లెలో.. చిన్నా వ్యవసాయానికి తీసుకున్న కౌలు మీద రాబడి వాళ్లకే అంతంతగా సరిపోతుంది. ఇక్కడి తన పరిస్థితి... గొట్టెతోక చందంగా వుంది.

తన తలపుల్లో తానే మెదిలాడు. పదేళ్ల క్రితం నగరానికి వచ్చాడు తను. పదో తరగతి అయిన వాడికి ఉద్యోగాలేం ఉరుక్కుంటూ వస్తాయి? పేపర్ బాయ్‌గా చేశాడు. రెండు పూటలా కడుపు నిండలేదు. కొరియర్స్‌లో డెలివరీ బాయ్‌గా చేరాడు. బస్‌పాస్ ఇచ్చారు వాళ్ళు. కానీ, ఆ తిరుగుడూ, ఉత్తరభారతం వాడి హిందీ తిట్లూ... తనకు పడలేదు. సాయంత్రం పూట తన చేతికి ఇచ్చిన ఉత్తరాన్నో, పార్సెల్‌నో ఆ ఉదయమే ఎందుకు డెలివరీ చేయలేదని అడ్డ గోలుగా అడిగేవాడు, ఆ యజమాని. ఆ తర్వాత ఏదో కంపెనీలో సెక్యూరిటీగార్డ్‌గా చేరాడు. అక్కడ రాత్రిడ్యూటీలు. పెళ్లయిన వాడికి పగలూ, తనకు రాత్రి కేటాయించారు. రెండో నెలలోనే తనకు ఆరోగ్యం చెడింది. కారణం తను ఎంతగా ప్రయత్నించినా పగలు తగినంత నిద్రపోలేకపోవడమే. అది మానేసిన తర్వాతే, ఈ వస్త్రప్రపంచంలో చేరింది.

పల్లెలో వుండగా... నగరజీవనాన్ని గురించి తనుకన్న కలలేవీ ధాన్యపు పురులో, బంగారు మొహరీల సంచులో.. కాలేదు. అయితే, తన వారికి తనను గురించి మాత్రం దొడ్డ ఆశలే వుండేవి.

సీతాకోక చిలుక వెంట పరిగెత్తే పిల్లలా, అమ్మ తన పెళ్లి ప్రసక్తి వెనుక పరిగెత్తసాగింది. డబ్బు లేక ఎండిపోతున్న తన ఊహల్ని- మామయ్య ముందు

కూడా వాస్తవాల ఏకుల బుట్టలా పరచాడు. అయినా, ఆయనా, అమ్మా తనని ఊపిరి సలుపనీయలేదు. వీళ్లకి తోడు కమల కూడా, మేనమామ కూతురుగా... తనమీద ఆమెకున్న అధికారాన్ని చెప్పీ చెప్పకుండా చెప్పింది. పెళ్లి జరిగింది!

పల్లెలో బక్కరైతు కూతురు... నగరంలో బట్టలకొట్టు గుమాస్తా భార్య అయింది. కమలతో కాపురం పెట్టాడు తను. జంట బతుకు సమస్య కొద్దికొద్దిగా అర్థమౌతూ వచ్చింది, ఇద్దరికీ. కొత్త అవసరాలూ తెలిసివచ్చినై.

తమ ఆర్థిక పురోగమానికి... ఏ చక్రాన్ని ఆధారం చేసుకున్నా.. ఊసుల్లో, ఊహల్లో ఎంతెంత దూరం పరిగెత్తగలిగినా.... వాస్తవపు గొంగళి అంగుళం కూడా కదలదనేది... సత్యవాక్కులా చల్లగా తగిలేది. అంకెల్ని ఎటువేసి, ఏ వైపు కూడినా, దేన్నుంచీ దేన్ని తీసివేసినా... చివరికి, 'ఋణ' ధృవం బరువు అధికమనే తెలిసివచ్చింది.

కమలకూ తనకూ మధ్య... చిరు కోపాలు, చిన్న చిన్న వాగ్వాదాలూ చాలా సార్లు వస్తూ వుండేవి.

ఎన్ని ఆదివారాలు... పగటివేళలు గడపదాటలేక ఆలోచనల చిరు తిండి తింటూ గడిపినా.. తన జీతం.. కనీసావసరాల ఖర్చుల్ని సమానం చేయలేదని తేలిపోయింది.

అలాగని, తాము పెద్దగా ఆశాభంగం పొందిందీ లేదు. తమ వ్యాకులత అంతా... పల్లెలో వున్న తమవారిగురించే. ఈ కోరికనుంచి జనించిన ఆలోచనే కుట్టమిషన్. కమల ధైర్యంగా ఆచరణలో పెట్టింది. 'ఆరోగ్యం జాగ్రత్త' అనే ఒక్క సూచనా మాత్రం ఆమెకు తాను పాటికి పదిసార్లు చేస్తూవున్నాడు.

కమల వచ్చి మంచంమీద కూర్చుంది. "ఏవిటి బావా, ఆలోచిస్తున్నావ్?" అడిగింది. ఆమె రాజుని ఇప్పుడూ బావా అనే సంబోధిస్తూంది.

రాజు ఆమెకేసి చూశాడు. విరిసిన సంపెంగలావుంది. పచ్చని మొహం

మధ్య స్వచ్ఛమైన మనోజ్ఞమైన నేత్రాలు... చుక్కపూలలా మెరుస్తున్నై.

'ఊఁ' అన్నది మళ్లీ , సర్దుకొని కూర్చుంది, వెనక్కి

ఊపిరి తెచ్చుకుని అన్నాడు రాజు, "జీతంలో ముప్పై రూపాయలు తగ్గినై.. ఈ నెల. అమ్మావాళ్ల సంగతీ ఆలోచించాలి"

"ఫర్వాలేదు. కానియ్. చూద్దాం" అని "చలిగాలిగా వుంది. లోపలికి పోదాం" అంటూలేచింది. రాజూ లేచాడు.

... తెల్లవారింది. ఆ వేళ ఆదివారం. రాజుకు సెలవు రోజు.

పది దాటింది. స్నానాలయినై. రాజుకు దగ్గరగా కూర్చుని కూర తరుగుతోంది కమల. అదిగో అప్పుడు వచ్చాడు సుధాకర్.

పరామర్శలు అయినై. తమ్ముడిమీద కోపగించుకున్నాడు రాజు. మధ్య మధ్య కమలే కల్పించుకుని, వాతావరణాన్ని కాపాడుతూ వచ్చింది. సుధాకర్ చాలా కటువుగా తెగేసి చెప్పేశాడు, "నేనా ఊళ్లో ఉండి ప్రయోజనం లేదు. వాళ్ళూ వీళ్లూ కష్టపడుతున్నారని ఏ బాధ్యతనీ నెత్తినేసుకోలేను. నా దారి నేను చూసుకోవాలనే వచ్చేశాను. ఈ మూణ్ణెల్లలోను... ఇదుగో, ఈ ఉద్యోగంలో కుదురుకున్నాను. జమాను ఉద్యోగమని నాకేమీ నామోషి లేదు. వచ్చే ఆరొందల్లో నాపొట్ట నేను పోషించుకోగలను."

తమ్ముడి అనుభవ రాహిత్యానికి నవ్వొచ్చింది రాజుకు. తానూ మొదట్లో ఇట్లాగే అనుకున్నాడు. వచ్చే ఆరువందల్లో అద్దె భరించాలి. బస్ ఛార్జీలు. ప్లేట్ మీల్స్‌తో గడిపినా... కొన్ని రాత్రులు నీళ్ళుతాగి కడుపులో కాళ్లెట్టుకోవాల్సిందే! టీ నీళ్లకు కూడా వెనకా ముందు చూసుకోవాలి.

– ముగ్గురూ భోంచేశారు.

అప్పుడన్నాడు సుధాకర్, "మీకు ఇబ్బంది కాదనుకుంటే ఇక్కడుంటాను. లేకపోతే కూకట్‌పల్లిలో ఒక ఫ్రెండ్ గది ఉంది అక్కడే చేరతాను." ఈ మాటలకు

రాజు, కమలా ఇద్దరూ నొచ్చుకున్నారు. సుధాకర్‌కేసి చూశాడు రాజు. "ఏంటిరా సుధా నువ్వనేది.?" అన్నాడు. కమల అందుకుంది. "మనవాళ్ళు మనకే ఇబ్బంది కావడమేంటి సుధా" అంటూ, "మాతోపాటు ఉండు, కానీ, ఇంతదూరం నుంచి మీ ఆఫీస్‌కి వెళ్లటం కష్టమౌతుందేమో.. ఆ సంగతి ఆలోచించుకో" అంది.

ఆ ప్రసక్తి అంతటితో ఆగింది.

సాయంత్రం వెళ్ళిపోయాడు సుధాకర్.

మర్నాడు రాత్రి సూట్‌కేస్‌తో దిగాడు.

రోజులు గడుస్తున్నై.

తల్లి ఆరోగ్యం గురించి రాజు సందేహించినంతా జరిగింది. ఆమె రోగానికి మందులు తిండి, ఖర్చు గడవడమే కష్టమైపోయింది

పులిమీద పుట్రలా... ఆఏడు ఉప్పెనతో పంటలు పోయినై. రాజూ కమలా పల్లెకి పోయి తమ కష్టాల్ని గురించి మాట్లాడారు. చివరకు కమల తండ్రి సలహామేరకు తల్లి, తమ్ముడు, చెల్లెలు కూడా పట్నం చేరారు. ఇల్లు మారడం తప్పనిసరి అయింది. ఇంకో వంద ఎక్కువిచ్చి మూడు గదుల ఇల్లు తీసుకున్నారు. చిన్నా... తనంతతాను కూరల బండి మొదలెట్టాడు. తల్లి కళ్లనీళ్లు పెట్టుకుంది. గతంలో పల్లెజీవితం, భర్త ఉన్నప్పుడు తమ సంసారం బతికినతీరు, గుర్తుచేసుకొని బాధపడింది.

రాజుకు ధైర్యం కమల. కమలకు స్థైర్యాన్నిస్తున్న బలం రాజు. ఇద్దరి ముగ్గురి సంపాదన బొటనవేలు నోటకరచుకొని పెరుగుతున్న శిశువులా నిస్తేజంగా, నిస్సారంగా ఉంటుంది.

ఒకరోజు....,

రా|

ఒకరిమాటల్లోని వెచ్చదనాన్ని ఒకరు అనుభవిస్తూ.. ఒకరి మమతను

ఒకరు పంచుకుంటున్న తరుణంలో ఉన్నట్టుంది ఒళ్లు ఝల్లుమంది రాజుకూ, కమలకూ.

ఈనాటి యదార్థం, రేపటి వాస్తవం.... ఒకేసారి చీకటి దుప్పటిలా మీద వాలాయి. ఉద్వేగం కాలి కాలి చల్లారిపోయింది.

ఒకరి భయాన్నీ, బెరుకునీ భరించటానికి మరొకరు తోడున్నారని ఒకరికొకరు చెప్పుకున్నారు. తమ బతుకుని తాము అర్థంచేసుకున్నరీతిలో... వివేకాన్నీ, విచక్షణనీ రంగరించుకొని విశ్లేషించుకున్నారు.

కలుగబోయే పరిణామాలూ, పర్యావసానాలూ కూడా చర్చించుకున్నారు.

ఇద్దరూ... విడివిడిగా, జంటగా... ఒకే నిర్ణయానికి వచ్చారు.

నారు పోసిన వాడు నీరుపోస్తాడని, ఏదో జరిగిపోతూ ఉంటుందిలెమ్మని ఒక మార్గంలో పోవడంకన్నా, ఉన్న పునాది మీద నిర్మాణంగురించి ఆలోచించడమే జీవన లిపి అనేదే, రాజూ కమలా చేసుకున్న నిశ్చయం.

ఆ మర్నాడు ఉదయాన్నే తమ నిర్ణయాన్ని అమలు చేశాడు రాజు.

తన కర్తవ్యాన్ని తాను నిర్వర్తిస్తున్న డాక్టర్ మాత్రం... మనస్సులో బాధపడుతూనే ఉన్నాడు. "తెలిసి తెలిసి నేరంచేస్తున్నారేమో" అని అన్నాడు– రాజునీ, కమలనీ ఉద్దేశించి.

రాజు సన్నగా నవ్వుకున్నాడు. ఎప్పుడో చదువుకున్నవాక్యాలు గుర్తుకొచ్చినై. "దండింపవలసిన నేరమే లేదు లోకాన. చికిత్స చేయవలసిన రోగమే కాని!"

ఇద్దరికీ చివరికి మిగిలింది.... ఆత్మగీత!

***

(కొత్త కథ – సంకలనం – వేదగిరి రాంబాబు)

# సాగుతున్న యాత్ర

కనిచీకటి వేళ...

ఏడ్చి ఏడ్చి అలసిన ఆడపిల్ల మొహంలా వుంది ఆకాశం.

మబ్బు బొమ్మల్ని పరికిస్తోంది... రామసీత. చల్లగా గాలి వీస్తోంది. నిన్ననే కార్తీకం వచ్చింది. టెర్రెస్‌మీద పిట్టగోడ వారగా పూలకుండ్లు. లిల్లీ చెట్టు అలవోకగా కదులుతోంది. రమణ ఉత్తరం వుంది, చేతిలో. రామసీత అలోచనలు గతాన్ని వెతుక్కున్నాయి.

అంతకుముందు రెండు వారాల క్రితం తను బెరుకు బెరుగ్గా చెప్తే... 'పండగ వెళ్లనీ, చూద్దాం' అన్నాడు ఆనందం. పండగ వచ్చి వెళ్ళింది. పిల్లలు... రమణ, రాణి... వచ్చివెళ్ళారు. ఈ సారి దీపావళికి వాళ్లకి సెలవేలేదు. శనివారం ఆదివారం వుండి, సోమవారం ఉదయాన్నే ప్రయాణం కట్టారు. అమ్మకూడా.... 'వాళ్ల చదువులు పోతాయ్. మమ్మల్ని వెళ్లనీ' అంది.

తన పిల్లల పోషణతో తల్లి పడుతున్న అవస్థల్ని తలచుకుంటే... రామ సీతకు బాధ, తల్లి పట్ల జాలీ కలుగుతై. కానీ, తనకు వేరే దారిలేదు. వాళ్ల బాధ్యతని తల్లి నెత్తిన పెట్టక తప్పలేదు.

పెళ్లికి ముందు నుంచీ చాలా చాలా ఆలోచనలున్నై తనకు. కానీ, అవేవీ సాగలేదు. చేస్తున్న ఉద్యోగం మానటానికి వీల్లేదన్నాడు ఆనందం. రమణ పుట్టంగానే వాడిని సాకటంగురించి జరిగిన చర్చలూ, వాదాలూ.... తలచుకుంటే రామసీతకి వొళ్లు జలదరిస్తుంది.

వాడి బారసాల రోజు రాత్రి ...

ఇటువైపు తన అత్తగారు, ఆడపడచు, ఆనందం. అటువైపు తన తల్లి,తండ్రీ, తమ్ముడూ....

నాందీ, ప్రస్తావనలు దాటి, సంభాషణ సాగి, చర్చల్లోకిదిగి, వాదాల్లో మునిగి, గొంతులు చించుకుని, ముఖాలు మాడ్చుకొని, చివరకి వొప్పందాలు కుదుర్చుకున్నారు. రమణని తన అమ్మే తీసుకెళ్లేటట్లు. మూడో నెల రాగానే తను వచ్చేసింది, రమణని అమ్మకు వొప్పచెప్పి.

కొత్తల్లో తనకూ ఆనందంకీ కూడా చాలా బెంగగా వుండేది. పిల్లవాడు తమ దగ్గర లేకపోవడం ఎంతో లోటుగా తోచేది.

రోజులు గడుస్తున్న కొద్దీ... తమ ఉద్యోగాల హడావిడిలో, ఉరుకులు పరుగుల యాంత్రిక జీవనంలో.... ఆ బెంగ, ఆ లోటు... స్థాయి తగ్గి, అలవాటుగా మళ్లీ తామిద్దరే పెళ్లయిన కొత్తల్లోలా వుండసాగారు. వారం వారం కొడుకు కోసం హైదరాబాద్ నుంచీ వరంగల్ ప్రయాణం. సోమవారం తిరిగిరావడం. క్రమం సాగిపోతుంది.

ప్రకృతి చాపకిందినీరులా.... ద్రవీభవించి కాలాన్ని కరిగించింది. కళ్ళు విప్పి చూసుకునేసరికీ సమయం మించి పోయింది. కూతురు దగ్గర మకాంలో ఉన్న అత్తమ్మ నచ్చి చాలా చాలా సుద్దులు చెప్పింది. కళ్ళనీళ్ళు పెట్టుకుంది; కన్నెర్రచేసింది. అత్తగారి అథారిటీ చూపింది., కొడుకుని ఒప్పించకలిగింది. తను అమ్మదగ్గరికి పరిగెత్తింది. చాలా కాంద జరిగాక, "ఆడపిల్ల నట్టింట్లో తిరుగుతుంటే అదో అందం, ఆనందం, ఇంటికి శోభ" అని మురిపెంగా తన కళ్లల్లోకి చూసింది. ముసిముసిగా గర్వంగా నవ్వుకుంది. అవును మరి.... ఆమెకి మేము అయిదుగురు ఆడపిల్లలం!

రాణి పుట్టింది.

తన మెటర్నిటీ లీవ్ కాగానే తానే వెళ్లి వరంగల్‌లో అమ్మకి రాణిని అప్పచెప్పి

వచ్చేసింది.

ఈ సారి ఏ చర్చలూ, వాదాలూ లేవు. అంతా ముభావంగా, ముసురుముసురుగా జరిగిపోయింది.

తనూ, ఆనందం.... మళ్లీ మామూలు యాంత్రిక జీవనం. అడపా దడపా అత్తమ్మ రాకపోకలూ, అడపదచూ పిల్లలూ నగరసందర్శనం....

రోజులు, నెలలుగా, నెలలు సంవత్సరాలుగా మారి రెండేళ్ళు గడిచినై.

దసరా పండగ వెళ్లిపోయింది. విజయదశమి మర్నాడు తనూ ఆనందం వరంగల్ నుంచీ తిరిగి వచ్చారు.

ఆ రాత్రి....

ఇంగ్లీష్ వార్తలు అయిన తర్వాత, టీవీని ఆఫ్ చేసి హాల్లో కూర్చున్నాడు ఆనందం. ఏదో పత్రిక తిరగేస్తున్నాడు.

అప్పుడు చెప్పింది రామసీత.

ఆమెకేసి అదోలా చూశాడు ఆనందం. ఆ చూపులో ఏ భావమూ తోచలేదు రామసీతకి.

క్షణాల నిశ్శబ్దం తర్వాత, తనే అన్నది సన్నగా, "ఏంవీ మాట్లాడరేం?" అని.

ఈ సారి తల పైకెత్తలేదు. "చెప్పావుగా. దీపావళి వెళ్లనీ చూద్దాం"

ఇప్పుడు....

అదిగో... ఆమాటే గుర్తుకొస్తోంది రామసీతకి. గుండెలో ఏదో గుబులు. అయోమయంగా భయం భయంగా ఉంది. అత్తగారు కళ్లల్లో కనిపిస్తుంది.

ఒకరోజు, తనూ, ఆనందం... పిల్లలూ, పోషణా... ఉద్యోగాలు చేసే దంపతులూ వాళ్ళ ఇబ్బందులూ మాట్లాడుకుంటుంటే ఆమె విన్నది. 'ఎంత ముసలి

దాన్నయినా ఈ మాత్రం అర్థంకాకపోదు. ఇబ్బందులు సొబ్బందులు అంటూ పిచ్చి చేష్టలు చేస్తేమాత్రం ఊరుకోను జాగ్రత్త' అంటూ భగ్గుమంది. ఆనందం అమ్మకూచి... సరేసరి!!

ఆ తరువాత కొన్నాళ్లకి ఆదపదచు వచ్చింది. తల్లి వెళ్లి తన సందేహాన్ని కూతురికి చెబితే ఆదరాబాదరాగా దిగింది కూతురు. "చూదు సీతా. నువ్వు అంతగా ఇదైపోకు. మీ అమ్మకు ఎటూ తప్పదు. కాసిన చెట్టుకే రాళ్ల దెబ్బలు అన్నట్లు ఆమె ఐదుగురి ఆడపిల్లల్ని, ఒక మొగ నలుసుని సాకిన మనిషే. నీ పిల్లలేం బరువు కారు ఆమెకి. అయినా, ఐదారేళ్ళు వస్తే తెచ్చి ఇక్కడే బళ్లో వేసుకోవచ్చు." అని నచ్చచెప్తున్నట్లు తనకు నచ్చినవి చెప్పిపోయింది. పోతూ పోతూ, "జాగ్రత్త సీతమ్మ తల్లీ, తొందరపడి ఏమన్న చేశారంటే మా అమ్మ గుండె పగిలి హరీ మంటుంది". అని ఓ హెచ్చరికని చేసి పోయింది.

ఆనందం అసలే మితభాషి. ఈ ప్రసక్తి తెస్తే అసలు మాట్లాడదనుకొని "కానీ చూద్దాం" తోనే మళ్లీ ప్రసవం అయిపోయింది!

అదీ... రజని జనన వృత్తాంతం! ఆమెనీ తల్లిదగ్గర చేర్చక తప్పలేదు.

ఇవన్నీ...

పాతికేళ్లకిందటి సంఘటనలూ, సంభవాలూ!

చల్లటి గాలితెమ్మెర రామసీతని ప్రస్తుతంలోకి తీసుకొచ్చింది. చుట్టూ చూసింది.

చీకటి జారుతోంది. అప్పటికప్పుడే గేటు తీసుకొని లోపలికి వస్తున్న ఆనందం కనిపించాడు.

ఆలోచనల్ని పక్కకు పెట్టి లోపలికి నడిచింది రామసీత. ఆనందంకు

కాఫీ ఇచ్చి ఎదురు సోఫాలో కూర్చుంది. కాఫీతో పాటు రమణ ఉత్తరాన్ని ఇచ్చింది. ఆ ఉత్తరమే రామసీత మనస్సుని ఒక కుదుపు కుదిపి, ఆలోచనల్ని గతంలోకి పరుగెత్తించి, గుండెల్లో రాయిని పడవేసింది!

ఉత్తరాన్ని చదివి అదోలా భార్యవైపు చూశాడు ఆనందం. యధాలాపంగా అన్నట్టు అన్నది రామసీత, "ఈ విషయాన్ని మనం కాస్త సీరియస్‌గా ఆలోచించాలి. నాకేమీ పాలు పోవడంలేదు. ఉత్తరం చూసినప్పట్నుంచీ ఏదో ఆందోళనా, ఆరాటం, భయం".

ఆనందం లేచి రామసీత పక్కకి వచ్చి కూర్చున్నాడు. రక్కున అతని అరచేతిని తన చేతుల్లోకి తీసుకొంటూ భర్త కళ్లల్లోకి చూసింది రామసీత.

ఆనందం మొహం కొద్దిగా రంగు మారింది. అతనూ ఆలోచనలో పడ్డాడు. కాఫీ కప్పుని టీపాయ్ మీద పెడుతూ అన్నాడు. నీ భయమూ, ఆందోళనా అర్థమైనై సీతా. కానీ చూద్దాం"

క్షణాల తరువాత.....

ఆనందం బయటికి వెళ్లిపోయాడు. రమణ ఉత్తరం రామసీత చేతిలోకొచ్చింది మళ్లీ.

మళ్లీ తన ఆలోచనలూ, తనలోకం- తనకు మిగిలినై... రామసీతకు.

మనస్సంతా తడిచీరలా అయిపోయింది.

మళ్లీ ఓసారి రమణ ఉత్తరాన్ని చదువుకుంది. ఎన్నిసార్లు చదువుకున్నా సారాంశం అదే! "పెళ్ళి విషయంలో నేనొక నిర్ణయానికి వచ్చాను. నా కొలీగ్ అరుణని చేసుకుందామనుకుంటున్నాను. ఆమెకు తల్లిదండ్రులు లేరు. అన్నయ్యా వదినా బొంబాయిలో ఉద్యోగాలు చేస్తున్నారు. మిగిలిన విషయాలు, వివరాలు ముఖాముఖి."

ఇదీ ఇవాళ రమణ తనకి పంపిన పేపర్ బాంబు!

మిగిలిన విషయాలు, వివరాలూ.... తన ఆందోళనా, భయం, ఆరాటం...!

పొడిగా నవ్వుకుంది రామసీత.

రాత్రి...

నిద్రకు ముందు,

"మీ నిర్ణయం చెప్పండి" అని దృఢంగా భర్తని అడిగింది రామసీత. అతను నవ్వేశాడు. 'పిచ్చి సీతా... నిర్ణయం వాడిది. వాడా నిర్ణయం చెప్పేశాడు. ఎందుకంత అప్‌సెట్ అయిపోతావ్. టేకిట్ ఈజీ" అని పుస్తకంలో తల దూర్చేశాడు ఆనందం.

రామ సీత కళ్లముందు ఆమె తల్లి రూపం నిలబడింది. గుండెల్లో గాలం పడినట్లయింది. మేధస్సంతా తేనెతుట్టలా అయిపోయింది. దేహాన్ని నిస్సత్తువ ఆవహించింది.

ఆ రాత్రి రమణ ఆలోచనలతోనే రామసీత - నిద్ర- పోయింది.

***

రమణ వచ్చి వెళ్ళాడు.

వెళ్తూ వెళ్తూ... చెప్పాడు, "రాణి చెప్పినా, వాళ్లాయన చెప్పినా, రజని చెప్పినా నా నిర్ణయం మారదు. వాళ్లకి ఉద్యోగం చెయ్యాల్సిన అవరం లేదు. నాకు ఎంప్లాయిడ్ గర్ల్‌ను పెళ్లి చేసుకోవడం ... మస్ట్. రెండు జీతాలు లేనిది నేను బతకలేను అంతే..." కరాఖండిగా చెప్పేశాడు.

రామసీత భయం నీడలు.. వాస్తవ రూపాలుగా ఎదుట నిలబడినై.

రామసీత తలపులూ, తలపోతలూ, పరిపరి విధాలుగా సాగి పోతుండగానే... రమణ పెళ్లి అయిపోయింది! అరుణ ఆ యింటి కోడలుగా, అత్తమామలకు దూరంగా, బెంగుళూరులో కాపురం పెట్టింది. ఆఫీసుకు పదిరోజులు సెలవు పెట్టి బెంగుళూరు వెళ్లి కొత్తదంపతులకి కూడా.. కుందా-కుదురు ఏర్పాటు

చేసి తిరిగి హైదరాబాదు వచ్చేసింది రామసీత.

జీవితంలో అనుభవాలే... కొందరి విషయంలో... అనుభవాల్లో జీవితం అవుతాయి. ఉదాహరణ రామసీత.!

రమణా, అరుణా- వారి కోరికల సాఫల్యాన్నీ, యవ్వన ఫలాన్నీ అందుకొనే శుభసమయం ఆసన్నమైంది.

తల్లిగా, అత్తగా... రామసీతకి ఆ కమ్మని వార్త మధురంగానూ, మనోజ్ఞంగానూ ఉంది. కానీ, కానీ,

బాధ్యత సంగతి? ప్రశ్నార్థకం!

ఈ సంతోషంలో, సందేహంలో ఆనందం కళ్లల్లోకి కోటి భాషలతో చూసింది, రామసీత. అదోలా అలవోకగా భార్య భుజంమీద తట్టి నెమ్మదిగా బయటికి వెళ్లిపోయాడు ఆనందం. నేలను తాకిన నావలా అయింది- రామసీత.!

నెలలు గిర్రున తిరుగుతున్నై. "ముందు నువ్ లాంగ్‌లీవ్ పెట్టు. ఆ తరువాత చూద్దాం. అవసరమైతే రిజయిన్ చెయ్యొచ్చు" ... ఇదీ తండ్రీ కొడుకుల సలహా.

రామసీత మనస్సు అనేకానేక వలయాల్లో చిక్కుకుంది. పరిధిమీద ఎక్కడ ఆగినా అదే సమస్య. ఎంతదూరం పరుగెత్తినా ఆ వలయం అంచునే పరిభ్రమణం, అదే సమస్యని మళ్లీ మళ్లీ స్పృశిస్తూ, చుంబిస్తూ...... తట్టుకుంటూ, కొట్టుకుంటూ........

ఇంతకీ, సమస్య.... రెండు జీతాల్లేకపోతే వాళ్లు బతకలేకపోవడమా?...

ఉన్న ఉద్యోగానికి తాను రాజీనామా చేయడమా?... అరుణా- రమణలకు పుట్టబోయే బిడ్డ సంరక్షణా భారం?...

ఏమో మరి?... పరిధి చాలా విస్తృతంగా ఉంది.!!

(సాహిత్య నేత్రం)



# గోడలు

"కథ చెప్తాను... కూచో"

నారాయణ నా కళ్లల్లోకి సూటిగా చూశాడు. చేతి వేళ్లతో జుట్టు దువ్వుకుని అయిష్టంగా అన్నాడు, "నువ్ కథ చెప్తానంటే భయమేస్తుంది. ఇజాలూ, దోపిడీ గట్రా అంటూ హింసిస్తావ్"

నేను నవ్వాను. "అవేమీ రానీను, కూచో"

కూచున్నాడు. నేను గదిలో వొక మూలగా ఉన్న కూజా దాక నడిచాను. గ్లాసులో నీళ్లపోసుకొని తాగి వెనక్కి తిరిగి నారాయణని అడిగేను, "నీళ్లుతాగుతావా?" అని "వద్దు" అన్నాడు.

వచ్చి నారాయణ ఎదురుగా కూచున్నాను.

నాటకం ఆరంభానికి తెర తీయబోతున్నట్టు వుంది వాతావరణం. మా ఇద్దరి మధ్యా గాలి బొంగురుపోతోంది. గదిలో అర్థంకాని వేడిమి పరచుకుంటోంది. బయటకిటికీలోంచి సూర్యుడు కొలిమిలోనుంచి తీసిన అయఃపిండంలా వెలుగుతున్నాడు. వేపచెట్టు ఆకులు సూర్యుడితో ఆడుకుంటూ, గాలిని వెక్కిరిస్తున్నాయి. నేను చెప్పటం మొదలెట్టాను.

ఇలాంటి సంధ్యా సమయమే. అయితే చలికాలం. దక్షణపుగాలి తేమగా వీస్తోంది. నింగీనేలా చల్లబడ్డాయి.

మేము బిర్లాటెంపుల్ మెట్లమీద ఉన్నాము.

నేనూ....శ్రీదేవీ!

మాకు కాస్తంత దూరంలో మనుషులు. ఎటుచూసినా మనుషులు... మనుషులు...! పల్చగా... అక్కడక్కడా మాలాగేనే పక్కపక్కగా జంటలు. కొన్ని జంటలు చలికి వెచ్చగా వొదిగి వొదిగి...ఒకరికొకరు సర్వమూ సమస్తమూ అయినట్టు... ఈ గాలీనేలా, మెట్లూ, చల్లదనమూ తమకోసమేనన్నట్టు... తమకోసమే

తమకు, మాత్రమే శాశ్వతమన్నంత వెచ్చగా దగ్గర దగ్గరవుతూ... తమకుతాము, తమలోతాము, తాము మాత్రమే శాశ్వతమన్నంత నమ్మకంగా....

చుట్టూ చూసి, ఆలోచనల రథ్యలో సాగుతున్నాను నేను.

ఆపింది శ్రీదేవి. " ఒక విషయం చెప్పటానికి నిన్ను రమ్మన్నాను"

ఉలిక్కిపడి ఆమెకేసి చూశాను.

నా కుడిచేతిని తనచేతిలోకి తీసుకుంది.అరచేతిలో పిచ్చిగీతలు గీస్తూ అన్నది, "అమ్మా నాన్నా నాగురించి, చాలా ఆలోచిస్తున్నారు...."

ఆగింది. వంగి నా కళ్లల్లోకి చూసింది. చెవి జూకా నా చెంపకు తగిలింది. భావశూన్యంగా ఆమెకేసి చూశాను.

" శ్రీముఖం వారి సంబంధం ఏదో రాశాట్ట మా బాబాయి." మాటలు తుంపులు తుంపులుగా వచ్చినై. నాందీ, ప్రస్తావనా అయిపోయాయి.

"ఊఁ" అన్నాను. నా స్వరం అతిదీర్ఘంగా వుందో, ఆ "ఊ"కి ముందరి ఉచ్ఛ్వాసమూ, వెనుక నిశ్వాసమూ అతి ఊష్ణం వున్నాయో...

చప్పున నా చేతిని వదిలేసింది శ్రీదేవి. పమిట సరిచేసుకొని బుజం మీంచీ తిప్పి, నిండుగా కప్పుకుంది. దిక్కులు చూస్తూ మౌనంగా ఉండిపోయింది.

నేను ఆలోచిస్తున్నాను. నేను చేయాల్సిందేమిటో ఆలోచిస్తున్నాను. లేక నేను ఏంచేయాలని శ్రీదేవి ఆ విషయం నాకు చెప్పిందా?అని అలోచిస్తున్నాను. ఆమాటలు చెప్పటానికి ముందు ఆడపిల్ల చేతుల్లోని వేడిని రుచిచూసిన నా అరచేతికి క్షణంలో, మరుక్షణంలో కలిగిన స్థాన భ్రంశాన్ని గురించి ఆలోచిస్తున్నాను. ప్రవహిస్తున్న కాల ధారలో... కలిసి పోయి కలగాపులగమై పోయి, రూప రాహిత్యం చెందుతున్న భావధార... గురించి ఆలోచిస్తున్నాను.

నా అంతరంగ ఘోష... నాకుమాత్రమే వినపడుతోంది. అయినా శ్రీదేవి అడిగింది, "ఏఁవిటి ఆలోచిస్తున్నావ్"

నవ్వు వచ్చింది. సమాధానం రాలేదు.

స్పష్టాస్పష్టంగా నిట్టూర్చింది, శ్రీదేవి. అవును ఆమె నాకు కొంత అర్థమై

చాలా ఎక్కువగా అర్థంకాని, ఆడపిల్లగా అనిపించింది.

నిముషాలు బరువుగా జరుగుతున్నై.

లైట్లువెలిగినై. నగరం వెలుగుచీకట్ల నర్తనశాలగా మారింది.

"అతను అమెరికాలో వుంటున్నాట్ట. జనవరి చివరికి వస్తాట్ట. వాళ్ల అమ్మా నాన్నా ఇక్కడే వుండేది. ఎప్పుడో వచ్చి చూస్తార్ట." గాలికి చెప్తున్న ఊసులా వుంది, శ్రీదేవి మాట.

మళ్లీ మౌనం.

ఒకరికొకరు సుముఖంలో, సమక్షంలో ఎవరెవరోలాగా, ఎవరికి ఎవరోలాగా ఉండిపోయాము.

శ్రీదేవి లేచింది. ముంగురుల్ని చేత్తో సరిచేసుకుంది. పక్కన పెట్టిన స్లిప్పర్స్ వేసుకుంది.

"వెళ్దాం పద" అంటూ అడుగులు వేసింది.

నేను తేరుకొని, చెప్పులు తొడుక్కొని నడక సాగించే సరికీ... ఆమె చాలా ముందుకు... నా కన్నా ముందుకు... ముందుకు వెళ్లిపోతోంది!

ఆ రాత్రి నా మనసంతా గచ్చుపొదలా అయిపోయింది.

శ్రీదేవి నా ఆలోచనలల్లో వివిధ రూపాల్నీ స్వభావాల్నీ సంతరించుకుంది. ఏవేవో పాత సంఘటనలూ, దృశ్యాలూ, నాకళ్ల ముందు నిలిచాయి.

శ్రీదేవి మా మామయ్య కూతురు.

చిన్నప్పటినుంచి మంచి చనువే వుంది మా ఇద్దరిమధ్య. బి.ఏ.దాకా ఒకే కాలేజీలో చదివాము. ఎం.ఏ.చేయటానికి మద్రాసు వెళ్లింది. సైకాలజీలో 'టాపర్'గా మాకందరికీ గర్వకారణం ఆమె. ఆ తరువాత పిహెచ్.డీ. కూడా అక్కడే చేసింది. నేను తెలుగు ఎం.ఏ. చేసి జూనియర్ కాలేజీలో లెక్చరర్‌గా కుదురుకున్నాను. శ్రీదేవికి ఒకటి రెండు ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్స్ నుంచీ ఉద్యోగాలు వచ్చినై. ఇంకా నిర్ణయించుకోలేదు. కానీ, నేననుకోవడం ఆమె ఉద్యోగాల్లో చేరదు. ఇంకా ఉన్నతమైన ఆలోచనలు ఆమెవి.

చిన్నప్పుడు...

మున్సిపల్ హాస్పిటల్ ఆవరణలో ఆడుకుంటూ ఉండేవాళ్లం. మా జట్టు పిల్లలు చాలా మంది వచ్చేవాళ్లు.

ఒకరోజు... సరదాకి... నేను ఒక వేపచెట్టు ఎక్కి కొమ్మ వేరైన చోట కూచోని చెరకు ముక్క నములుతున్నాను. శ్రీదేవి వచ్చింది. చెట్టెక్కుతానంది. నువ్ ఎక్కలేవు వద్దంటే వినలేదు. తనంతతానుగా నేను కూర్చున్న చోటుకు వచ్చింది. నా జేబులోనుంచి తొంగిచూస్తున్న చెరకు ముక్కను తీసుకుంది. దాన్ని తింటూ 'జండాపై కపిరాజు' పద్యం పాడింది. మధ్య మధ్య పైకొమ్మని పట్టుకొని నిలబడి ఊగింది. కింద మాస్నేహితులంతా చప్పట్లు, గోల. వింత ఉత్సాహం. శ్రీదేవి నవ్వు . ఉన్నట్టుండి అడిగింది శ్రీదేవి. చక్రాల్లాంటి కళ్లను తిప్పుతూ "ఓ పాట పాడు"

నాకు గుటక పడలేదు. భయం వేసింది. చేతిలోని చెరుకు ముక్కను తినడం ఆపి ఠక్కున దూరంగా గిరవాటేశాను. ఆమె వైపు బెరుకు బెరుగ్గా చూస్తూ, "నాకురాదు" అన్నాను.

చప్పట్లు చరుస్తూ... "మా బావకు పాటలు రావు" అంటూ గేలి చేసింది. కిందనున్న పిల్లలు ఆమె కేరింతలకి శ్రుతి కలిపారు. నేను మొహం చిన్నబుచ్చుకున్నాను. చెట్టు దిగి వెళ్లిపోబోతుంటే చేయి పుచ్చుకొని ఆపింది. "కోపం వచ్చిందా" గడ్డం ఎత్తి నాకళ్లల్లోకి చూస్తూ... 'అమ్మ'లా అడిగింది. "ఊఁహూ" అని చూపులు పక్కకు తిప్పుకున్నాను. సిగ్గుపడటం అంటే అదేకాబోలు.

"నే పాడతా విను" అంటూ 'కోతీబావకు పెళ్లంట' పాడింది. అందర్నీ మంత్రముగ్ధుల్ని చేసింది. ఆమెది కిన్నెర స్వరం. మరి కొంత సేపు మా ఆటలు సాగినై.

కొమ్మమీద నిలబడి "నేను" చిటారు కొమ్మదాక పోయొస్తాను వస్తావా బావా?" అంది.

నేను రానన్నాను. కొమ్మలు లేతగా వున్నై. విరుగుతాయి వద్దన్నాను.

విన్లేదు. ఏ కొమ్మని పట్టుకోవచ్చో, ఏ కొమ్మమీద కాలుని నడవొచ్చో చూసుకుంటూ పోవచ్చని నమ్మకంగా చెప్పింది.

అయినా నేను భయపడ్డాను. నాకున్న లక్ష సందేహాల్ని ఆమెతో వాదనకు ఉపయోగించుకున్నాను.

శ్రీదేవి అనుకున్నదంటే ఆగుతుందా?!

పిల్లలందరికీ తన నిర్ణయాన్ని ప్రకటించింది. అరుపులు, కోలాహలం. వద్దనేవాళ్లు, ఉత్సాహపరచేవాళ్ళు. శ్రీదేవి లేచింది. తన గమనం సాగించింది.

సాహసి...శ్రీదేవి! అనుకున్నది సాధించింది చివరికి. అందరిచేత చప్పట్లు కొట్టించుకుంది. దిగివచ్చిన తరువాత అందరి అభినందనల్ని అందుకుంది.

మర్నాడు...

గోపాల స్వామి గుళ్లో కోనేరు మెట్లమీద కూర్చున్నప్పుడు అన్నది. "ప్రతిదానికీ భయమూ పిరికితనం ఎందుకు బావా? ప్రయత్నం చేయకపోతే సక్సెస్ ఎట్టా వస్తుంది?" అని

నేనేమీ మాట్లాడలేదు.

నా ఎం.ఏ.అయిపోగానే చదువు ఆపేస్తానని చెప్పినప్పుడు కూడా శ్రీదేవి అట్టాగే అన్నది. "కుటుంబ బాధ్యత అంతా నీ భుజస్కంధాలమీద ఉందనుకోవడంలో తప్పులేదుకాని, నీ భవిష్యత్తుని ఆలోచించుకోవాలి గదా. నువ్వు నీ చదువుని కొనసాగిస్తేనే బాగుంటుంది".

అప్పుడూ నేనేమీ మాట్లాడలేదు. చదువులు లేకుండా పెళ్లికి ఎదిగి కూర్చున్న ఇద్దరు చెల్లెళ్లూ, ఉన్న నాలుగెకరాల పల్లం పొలంతో చేతికి అంది నోటికి అందని ఫలసాయంతో– పల్లెలో అమ్మ పడుతున్న అగచాట్లు– నాకళ్లముందు నిలిచినై.

బిర్లా మందిర్‌లో మేమిద్దరమూ కలుసుకున్న వారం పదిరోజులకి ఒకరోజు– శ్రీదేవి టెలిఫోన్ కాలనీలో మా ఇంటికి వచ్చింది. చాలాసేపు కూర్చుంది. అమ్మ ఏవేవో పాత ముచ్చట్లు– ఏడాది క్రితం జరిగిపోయిన పెద్ద చెల్లెలు పెళ్లి విషయాలు ప్రస్తావించింది. నా చెల్లెలు రెండోది కరుణ కూడా శ్రీదేవితో కబుర్లు చెప్పింది.

మధ్యలో ఓసారి ఇంట్లో పచార్లు చేస్తున్నట్లు నడుస్తూ, నా గదిలోకి వచ్చింది శ్రీదేవి. బయటికి తయారౌతూ షర్టు బటన్‌లు పెట్టుకుంటున్నాను.

"నిన్న సాయంత్రం వాళ్ళు వచ్చి వెళ్ళారు." అన్నది, తనలో తను అనుకుంటున్నట్లు.

"ఎవరూ?" అన్నాను అసంకల్పంగా.

"అదే ఆ శ్రీముఖం వారు"

నేను పక్క చూపులు చూశాను. శ్రీదేవి మాత్రం నాకేసి చాలా సూటిగానే చూస్తున్నట్లు గమనించాను. ఆతరువాత మేమేమీ మాట్లాడుకోలేదు. మా ఇంట్లోవాళ్లకి ఈ విషయాలేవీ తెలియవు. మరో అరగంట తరువాత ఇద్దరమూ కలిసి బయల్దేరాము. బస్‌లో పోదామంటే వద్దు ఆటోలో వెళ్దామని తానే ఆటోని కేకేసింది. నేను కోఠీలో దిగితే, తాను చిక్కడ్‌పల్లి వెళ్లిపోయింది.

ఆటోలో నా మొహంకేసి చూస్తూ అన్నది. "నువ్వేమీ మాట్లాడటంలేదు బావా? నాకేమిటోగా వుంది." అని. దిల్‌షుక్ నగర్ బస్టాండ్‌ను చూస్తున్న నేను ఉలిక్కి పడి శ్రీదేవి వైపు చూశాను. "ఏం ఉన్నాయి మాట్లాడేందుకు?" అని ఒక పొడి నవ్వు నవ్వాను. మొహం అదోలా పెట్టి సర్దుకు కూర్చుంది శ్రీదేవి.

ఆ రాత్రంతా ఆలోచించాను. ఏదో దాగుడు మూతలాటగా అనిపిస్తోంది- శ్రీదేవికీ నాకు మధ్య సాగుతున్న సంభాషణ. జరుగుతున్న సంభవాలు ప్రమిదలో వెలుగుతున్న వత్తిని కిందికీ మీదికి కదిలిస్తున్నట్టు అనిపిస్తోంది.

ఆ మర్నాడు, అమ్మ ఏదో మాట్లాడుతూ మా పెళ్లి ప్రసక్తి తెచ్చింది. నేను భయపడ్డాను. ఆ సంభాషణ ఎటుసాగుతుందో, నేను ఏం మాట్లాడవలసి వస్తుందో అని. ఆమె మాటల గొలుసుకట్టు కరుణ పెళ్లి మీదికి మళ్లినప్పుడు ఊపిరి పీల్చుకున్నాను. కాని, కరుణ గడుసుగా అంది, "ముందు వదిన్ని మనింటికి రానీ" అని. మళ్లీ ఉలిక్కిపడ్డాను. అమ్మ వేరే పనిలో పడటంతో ఆ ప్రస్తావన అంతటితో ఆగింది.

ఆ సాయంత్రం మామయ్యా, అత్తయ్యా వచ్చారు. శ్రీముఖం వారి సంబంధం

గురించి అమ్మకు చెప్పారు. పిల్లవాడి తల్లిదండ్రులకు పిల్ల నచ్చినట్లు తెలిసిందని చెప్పారు.

అమ్మ తన అన్నా వదినలతో నిష్టూరమాడింది, శ్రీదేవికి పరాయి సంబంధం చూస్తున్నందుకు. అత్తయ్య అన్న మాటలు నాకు గొంతు దిగలేదు. ఆమె స్ఫుటంగానే అంది, "ఎటూ తేల్చకుండా ఎన్నాళ్లుంటాం. వచ్చేవయస్సుగదా ఆడపిల్లకి. ఒక్కగానొక్క పిల్ల దాని భవిష్యత్తేగదా మాకైనా. అందుకే ఈ సంబంధానికి మొగ్గు చూపాం!!

ఫిబ్రవరిలో శ్రీదేవి పెళ్లి జరిగిపోయింది. వరుడు శ్రీముఖం శ్రీనివాసరావు. పెళ్లికి అందరం కలుసుకున్నాము. నిజానికి పెళ్లిలో చాలా పనుల్లో నేను మామయ్యకు సహాయం చేశాను. శ్రీదేవి కూడా నాపట్ల ప్రత్యేక శ్రద్ధతో ప్రవర్తించింది. తన అత్త వారివైపు అందరికీ పరిచయం చేసింది. భర్త దగ్గర కూర్చొని, నలుగురితోనూ కబుర్లాడుతున్నప్పుడు నన్నూ పిలిచీ మాట కలిపింది. శ్రీనివాసరావు కూడా చాలా కలుపుగోలు మనిషి. అతనిది మంచి రూపం. మనిషి చక్కటి పసిమి. మాట తీరు కూడా సదభిప్రాయం కలుగజేసింది.

నిజానికి వాళ్లందరిమధ్యా నాకే మాటలు సరిగా రాలేదు. పరాయితనం ఫీలయ్యాను.

ఆవేళ ఆదివారం. అప్పుడే తెల్లారింది. ఎండచార కిటికీలోంచి నే పడుకున్న మంచంమీద పడి నా కాళ్లను తాకుతోంది. బయట పక్షి మందార చెట్టుమీద ఆడుకుంటోంది. నేను బద్ధకంగా లేచీ లేవని స్థితిలో ఉన్నాను.

కరుణ వచ్చి ఫోన్ వచ్చిందని కేకేసింది. ఆఫోన్ మా పక్కింటి వాళ్లది. లేచి గబగబా వెళ్లాను. శ్రీదేవి ఫోన్ అది. ఆవేళ రాత్రికి శ్యాంబాగ్ హోటల్లో డిన్నర్ట. "నువ్ ఎనిమిది గంటలకి హోటల్ గుమ్మందగ్గర ఉంటావు. నేనూ, శ్రీను అప్పటికే అక్కడ నిలబడి ఉంటాము. నువ్వు వస్తున్నావు" అని ఫోన్ పెట్టేసింది. ఇంటివాళ్లకు థాంక్స్ చెప్పి, నెమ్మదిగా కదిలేను.

ఎందుకో ఉత్సాహంగా లేదు. అయితే పదిరోజుల్లోనే భర్తను ముద్దుగా శీను అంటున్న శ్రీదేవి పలుకుబడి ఏదో ఉత్సాహాన్నిచ్చింది. నాలోనేను నవ్వుకుంటూ ఇంట్లోకొచ్చాను.

అమ్మ అడిగింది. "ఎవరూ" అని. చెప్పాను.

ఆ రాత్రి ఎనిమిదింటికి హోటల్‌కు వెళ్ళాను.

నేనూ, శ్రీదేవి, శ్రీనివాసరావు అంతే. మేం ముగ్గురమే. వేరే ఎవరూ లేరు. ఆ డిన్నర్ మాకు మాత్రమే ఏర్పాటు చేసినట్లు నా సందేహం నివృత్తి చేసింది శ్రీదేవి. టేబుల్ దగ్గర కూర్చున్నాము.

ముందుగా అసందర్భమైన పరామర్శలతోనూ, అప్రస్తుతమైన రాజకీయాలతోనూ కొంత సమయం గడిపాము. శ్రీనివాసరావు ఆతరువాత స్టేట్స్‌లో తన ఉనికి గురించి, ఉద్యోగం గురించి చెప్పాడు. భోజనానికి ఆర్డరిచ్చింది శ్రీదేవి. ముందుగా సూప్ చెప్పింది, " యువిల్ బి ఇన్ సూప్ ఫస్ట్" అని నాకేసి చూస్తూ జోక్ చేసింది. సన్నగా నవ్వుతూ...

"వుయ్ ఆల్ విల్ బీ" అన్నాడు శ్రీనివాసరావు.

ముగ్గురమూ నవ్వుకున్నాం.

సూప్ వచ్చింది. సిప్ చేస్తున్నాం.

అదిగో, అప్పుడు మొదలెట్టింది శ్రీదేవి.

"నిజానికి నేను మా బావ మనిషిననీ, అతను నావాడనీ చిన్నప్పట్నుంచీ మా వాళ్లందరు చేసిన నిర్ణయమే. మేమూ అలాగే భావిస్తూ వచ్చామనేది కూడా యదార్ధం".

నేను గతుక్కుమన్నాను. శ్రీనివాసరావు శ్రీదేవిని వింటూ కూర్చున్నాడు... టీచర్ చెప్తున్న పాఠం వింటున్న విద్యార్థిలా. శ్రీదేవి భర్తను ఉద్దేశించి కొనసాగించింది.

ఆమె సంభాషణ సారాంశం ఇలా వుంది.

"అయితే,

మా బావ స్లో మనిషి. అన్ని వ్యవహారాలన్నీ, 'పార్కలాం' పద్దతిలో చూస్తాడు. చివరికి మీ సంబంధం గురించి మా బాబాయ్ చెప్పినప్పుడు; మా వాళ్లు ముందుకు నడుస్తున్నప్పుడు కూడా మా బావతో ఈ విషయం ప్రస్తావించాను.

విని ఊరుకున్నాడు. అందుకే నా నిర్ణయం నేను తీసుకున్నాను. ఈ బ్యాక్‌గ్రౌండ్ చెప్పాలనే ఇక్కడ కలుసుకున్నది. భయమూ పిరికితనమూ నాకు నచ్చవు. అవి బావదగ్గర అణువణువునా ఉన్నాయి."

శ్రీనివాసరావు మా ఇద్దరినీ చూస్తూ " బాగుంది, థింక్స్ ఆర్ క్లియర్," అని తన ప్రోగ్రాం గురించి చెప్పాడు. నెలాఖరుకు తిరిగి అమెరికా వెళ్లనున్నట్లు,ఈలోగా శ్రీదేవికికూడా వీసా వస్తే ఆమెను తీసుకువెళ్తాడట. లేకుంటే ఆమె ఆతరువాత విడిగా వెళ్తుందిట.

మా చిన్ననాటి ముచ్చట్లు చెప్తూ భోజనం ముగించింది శ్రీదేవి. మధ్యలో ఒక మాట అన్నది "పొసగదనుకున్న పొత్తుకంటే, స్నేహితులుగా ఉండిపోవడమే మేలు" అని. ఆతరువాత నేను నా ఇంటికి వచ్చేశాను.

అంతే... ఆ రాత్రి కలవడమే శ్రీదేవిని. ఈ ఆరేళ్లలోనూ మళ్లీ కలువలేదు.

చెప్పటం ఆపి, నారాయణను అడిగాను, "ఇదీ కథ. ఇప్పుడు చెప్పు. నేను శ్రీదేవిని చేసుకోలేకపోవటానికి ఏమిటి కారణం?"

దీర్ఘంగా నిట్టూర్చాడు నారాయణ. లేచి కూజాలోని మంచినీళ్లు గ్లాసులో ఒంపుకొని గటగటా తాగేడు. "మొదట్లో వద్దన్నాను నీళ్లు, ఇప్పుడు కావలసి వచ్చినై." అంటూ, "సాదా సీదా ప్రేమ కథ చెప్పావు. అయినా మంచినీళ్ళు తాగించావు" అన్నాడు.

"నయమయ్యే రోగం కాదు కానీ, మంచి కేసు దొరికింది" అన్నాడట నీలాంటి డాక్టర్ ఎవరో" అని నవ్వాను.

నారాయణ సన్నగా నవ్వుతూ అన్నాడు, " అవును. నీ కథలో ఏదో గ్యాప్ ఉంది; ఏదో మిస్సింగ్ లింక్ ఉంది. అదేమిటో ఇదమిద్ధంగా తెలియటంలేదు. నువ్వే చెప్పు"

నేను కొద్దిగా చలించాను. కొద్దిసేపు మౌనంగా ఉండిపోయాను. ఆలోచించి ఆలోచించి చివరికిలా తేల్చుకున్నాను. "నేను మితి మనిషిని. ఇలా

కుండబద్దలు కొట్టినట్టు శ్రీదేవే చెప్పింది, వాళ్లాయన ముందు. కానీ శ్రీదేవినే వద్దనుకునేటంతటి మొద్దు స్వరూపాన్నా నేను?" ఈ మాటలు పైకే అన్నాను.

నారాయణ విన్నాడు. "మరి?" అన్నాడు మంద్రంగా.

"నేను తను చేరుకోవాలనుకున్న చిటారుకొమ్మలకి తనతోపాటు కలిసి ఎక్కలేనని బాగానే అర్థం చేసుకుంది శ్రీదేవి. తనకు నేను అక్కర్లేదు అని చాలా కాలం క్రితమే నిశ్చితంగా నిర్ణయించుకోగలిగింది శ్రీదేవి. ఆమెకు కావలసిందల్లా నేనూ అలాంటి నిర్ణయమే తీసుకున్నాననే మాట మాత్రమే. ఆ మాట నానోట వస్తే సంతృప్తి పడేది. సంతోషపడేది. మా బావ నన్ను చేసుకోనన్నాడు కనుక నేను మరొకర్ని చూసుకుంటున్నానని చెప్పుకోగలిగేది. ఆ సంతృప్తినీ, సంతోషాన్నీ, అవకాశాన్నీ నేను ఇవ్వనని అర్థంకాగానే తానే చొరవ తీసుకుంటున్నట్లు, ఆ చొరవకి నా స్లోనెస్, నా భయం, నా పిరికితనం కారణమైనట్లు చెప్పి తనను తాను పైమెట్టులో నిలుపుకుంది. ఎంతైనా సైకాలజీ డాక్టర్ కదా!"

నారాయణ స్థబ్దంగా కూచునే వున్నాడు.

మా ఇద్దరిమధ్య గాలి బొంగురు పోతోంది!

ఈ కథలోనూ ఇజాలూ, దోపిడీ గట్రా కనిపిస్తున్నాయి కాబోలు, కిటికీ లోంచి బయటికి చూపులు సారించి ప్రకృతిని పరీక్షిస్తున్నాడు.

నాకు చంద్రుడు కనిపిస్తున్నాడు. వేపచెట్టు ఆకులు శకలాలు శకలాలుగా కత్తిరించి వేస్తున్నై... చంద్రుణ్ణీ, అతని చల్లదనాన్నీ!

శరీరంలో అర్థంకాని వేడిమి ప్రవహిస్తోంది.!

(విశాలాంధ్ర 12-3-1995)



# గతి తప్పిన కరుణ

శేషగిరి గురించి మీకు చెప్పాలని చాలాకాలంగా అనుకుంటున్నాను. ఐతే, బుచ్చిబాబు అన్నట్టు కొన్ని కథలకి తల కనిపిస్తూవుంటుందికానీ, తోక అంత తొందరగా దొరకదు.

శేషగిరీ అలాగే తప్పించుకుంటూపోయాడు, ఇన్నేళ్లూ.

ఇప్పుడు అతనితోకని నేనే కాకుండా చాలామంది దొరకపుచ్చుకున్నారు. అసలు శేషగిరిని నాకుపరిచయం చేసింది సూరి.

మణీహోటల్లో కాఫీతాగి బయటికొచ్చి సెంటర్‌లో నిలబడ్డాం-నేనూ, సూరీ అక్కడికి సాయంత్రాల్లో - శాస్త్రి, జానకిరామ్, ఆదిశేషయ్య, సుబ్బారెడ్డీ - మా మిత్రబృందమంతా చేరతారు.

గతంలో ఈ సెంటరెలా వుండేదో వివరిస్తున్నాడు సూరి. గాంధీగారి విగ్రహంవున్నచోట ఏడు వీధి కుళాయిలు ఉండేవట. ఆ పక్కగా పాడుబడిన బురుజు, వో వైపు వన్‌టౌన్ పోలీస్‌స్టేషన్, దానివెనగ్గా నవాబుకోట - ఏవో వివరాలు చెప్తున్నాడు సూరి.

సరిగ్గా ఆ సమయంలో మా పక్కగావచ్చి నిలబడ్డాడు...శేషగిరి. సూరి పరిచయం చేశాడు.

ఐదడుగులలోపు ఎత్తు, దానికి తగ్గ వొడ్డు, ఒకకాలు కొంచెంపొడుగేమో అనిపించేటట్లు నిలబడేతీరు, జిడ్డుకారుతున్న మొహం, ఏటి ఒడ్డున రెల్లులా బట్టతలకి అటూఇటూ నాలుగు వెంట్రుకపోచలు, చేతిలో వో నాలుగేళ్ల నాటిదనిపించే పాతబడినడైరీ, దానిలో నుంచీ వెళ్లుకొస్తున్న రకరకాల కాగితాలు, దుమ్ముకొట్టుకుపోయిన ఖద్దరు చొక్కా, దానిక్రిందుగా సాగిన ముడతలు పడినపాంటు- స్థూలంగా ఇదీ శేషగిరి!

పరిచయం అయిన మరుక్షణం - అతను నా గురించి తనకు సర్వమూ తెలుసునన్న రీతిలో - నా పూర్వగాథ చెప్పసాగేడు. నేను నవ్వి వూరుకున్నాను.

"సాహిత్య సాంస్కృతిక వ్యవహారాల్లో మంచి అనుభవంవుంది శేషగిరికి" అన్నాడు సూరి.

ఆ అనుభవంతాలూకు ముఖ్యపదార్థాల్ని అప్పటికప్పుడు రుచిచూపేడు శేషగిరి.

మద్రాస్‌లో అతను హిందీపండిట్‌గా చేశాడట. జరుక్ శాస్త్రి నావాడు అన్నాడు. మల్లాదివారు నాకు కాఫీ ఇప్పించేవారు అన్నాడు. పింగళీ...శ్రీశ్రీ... పానగల్ పార్క్‌లో నాతోకలిసి సిగరెట్టు పంచుకునేవారు అన్నాడు. శ్రీశ్రీ మొదటిఇల్లు గృహప్రవేశానికి కార్లో పిలిపించారన్నాడు. గోఖలే దగ్గర చిత్రాలు వేశానన్నాడు. గాంధీగారి ప్రసంగాన్ని తర్జుమా చేశానన్నాడు. ఉద్యోగవిజయాలు కంట్రాక్ట్ చేసి, పులిపాటి, మాధవపెద్ది వంటి దిగ్గంతుల్ని రప్పించానన్నాడు, టీవీరాజు గారికి హార్మోనియం వాయించానన్నాడు.

నిజం చెప్పొద్దూ - నేను కొంచెం కంగారు పడ్డాను. వాళ్లందరూ అంటే నాకు గౌరవం, భక్తి. అభిమానిగా, ఆరాధకుడిగా వాళ్లందర్నీ చూసి, మాట్లాడి - వారి వ్యక్తిత్వాలకీ, ప్రతిభావ్యుత్పత్తులకీ మనస్సులోనే నమస్కరించుకునేవాణ్ణి. అలాంటినాకు - వారందరితో ఇంత సాన్నిహిత్యంగల శేషగిరి పరిచయం సంతోషమే ఆయినా, అతను ఈ విషయాల్ని చెప్పినతీరూ, ధోరణీ ఆశ్చర్యాన్ని కలిగించినై.

ఎనిమిదికావస్తుంటే... నేను సెలవుతీసుకున్నాను. వచ్చేస్తుంటే వెనక్కి పిలిచాడు శేషగిరి. ఆగేను. "అవునూ మీరు సినిమాల కెందుకు రాయకూడదు నూష్టారూ" అన్నాడు.

నవ్వివూరుకున్నాను. మళ్ళీ అదేప్రశ్నని రెట్టించాడు.

"నాకు అలాంటికోరికలేదుసార్, పైగా నా ఉద్యోగం నన్నలాంటి పనులకు ప్రేరేపించేదికాదు" చెప్పాను.

"ఓ కే. ఆ సంగతలా వదిలేయండి" అని చిత్రంగా కళ్ళుచికిలించి, "రండి, కాఫీతాగి పోదాం" అంటూ హాల్లోకి దారితీశాడు.

ముగ్గురమూ కాఫీత్రాగేము.

సూరి బిల్లుచెల్లించాడు. "మళ్ళీ కలుద్దాం" అన్నాడు శేషగిరి. నేను ఇంటిదారిపట్టేను.

ఆ తర్వాత నెలదాకా శేషగిరిని మళ్లీ చూళ్లేదు.

ఆరోజు.....

ఆఫీసులో ఏదోకాన్ఫరెన్స్ జరుగుతోంది. జవాను చీటీతెచ్చి ఇచ్చాడు, "వీరు మిమ్మల్ని అర్జంటుగా చూడాలిట" అని.

నేను కొంచెం ఇరకాటానపడ్డాను. మేనేజర్ అనుమతితీసుకుని బయటికి వచ్చాను.

శేషగిరి సోఫాలోకుర్చుని సిగరెట్ కాలుస్తున్నాడు.

"చెప్పండి" అన్నాను. మనస్సులో తొందరగావుంది నాకు.

తన పక్కగావున్న సంచిలోంచి ఒక పుస్తకాలదొంతర తీశాడు, శేషగిరి. వాటికి పురికొస కట్టివుంది.

"చూడండి రాజుగారూ. ఇవి చాలా అరుదైన పుస్తకాలు. నేను వొకాయన దగ్గర టోకున సేకరించి – మీలాంటి మిత్రులకి వొకరిద్దరికి మాత్రం ఇస్తున్నాను. సూరిగారికి ఇచ్చాను. పదిహేను పుస్తకాలు ఇరవై ఆఱ్రూపాయలు. అంతే."

"సరే ఇచ్చివెళ్ళండి" అంటూ పర్స్ తీసి డబ్బు ఇచ్చేను. పుస్తకాల్ని జవానుకిచ్చి నా సీట్లో వుంచమన్నాను. కాన్ఫరెన్స్ జరుగుతున్నవైనం చెప్పి శేషగిరి వద్ద సెలవు తీసుకున్నాను.

అతను థాంక్స్ చెప్పి వెళ్ళిపోయాడు.

.... ఆ రాత్రి,

ఇంట్లో పుస్తకాల్ని చూసేను. అన్నీ 1932-33లో అచ్చయిన పద్యగ్రంథాలూ వ్యాస సంపుటాలూ. గ్రంథకర్తలు ఎవరెవరో హైస్కూల్ ఉపాధ్యాయులు. అప్పట్లో వాటి వెల పావలా, అర్ధరూపాయీ వున్నై. మొత్తం కూడితే ఏడ్రూపాయల ఆరణాలు వచ్చింది.

ఆ మర్నాడు.

సూరిచెప్పేడు, "శేషగిరి ఇప్పుడు పాత పుస్తకాల వ్యాపారంచేస్తున్నాడు. మనకిచ్చిన పుస్తకాలన్నీ అతనికి తూకానికొచ్చిన సరుకు" అని.

"పోనీలే... ఏవో కొన్ని పాతపుస్తకాలు దక్కేయి. ఆనాటి రచనావిశేషాలూ, విషయ వైవిధ్యం, ముద్రణ. భాషా, శైలీ-చూడటానికి ఉపయోగపడతయ్.. ఉండనీ" అన్నాన్నేను.

"శేషగిరి బాగా బతికిచెడిన మనిషే. ఇబ్బందుల్లో వున్నాడు. ఎనిమిదిమంది సంతానం. ఇద్దరు పెళ్లాలు అంటే, వొకావిడ ఈయనతో నాటకాల్లో వేషాలేస్తూ ఈయనతోనే స్థిరపడిపోయింది".

సూరిమాటలకి ఆశ్చర్యపోయాను "ఐతే శేషగిరికి వయస్సెంత వుంటుందంటావ్?" అడిగేను.

"ఎంతలేకేం, ఏభైవుంటయ్" అన్నాడు సూరి.

"పోన్లేపాపం, అయితే, ఈ పుస్తకాలు కొని మనమూ ఒక సమిధ వేశామన్నమాట" అన్నాన్నేను.

వో వారంపోయాక కలిశాడు, శేషగిరి.

ఆవేళ ఎండతీవ్రంగావుంది. వడగాలి వీస్తోంది. కనుచీకటి వేళయినా, వాతావరణంలో ఆవిర్లు తగ్గలేదు.

కనిపిస్తూనే... వుసూరుమంటూ, కూల్‌డ్రింక్ షాప్‌వైపు దారితీశాడు, శేషగిరి. నేను అతన్ని అనుసరించాను.

ఐస్‌క్రీమ్‌కి ఆర్డరిచ్చాడు శేషగిరి.

తింటూ కూర్చున్నాం.

"మంచి మిత్రుడొకాయన దొరికాడు మాష్టారూ, ఎంతైనా ఫర్లేదు, గొప్పఆర్ట్‌పిక్చర్ తియ్యమని పోరుతున్నాడు. డైరెక్షన్ మనమే. మొన్న మద్రాస్‌పోయి, ఆఫీస్ తెరిచివచ్చాం. ఆర్టిస్ట్‌ల సెలెక్షన్ మొదలెట్టాలి. స్క్రిప్టు నాదే వుంది. కానీ, దానికి మీ ఐడియాస్‌ని జోడించాలి. న్యాయానికి నేనే ఈవేళ రాత్రికి మీ యింటికి వద్దామనుకుంటున్నాను, మీరే కనిపించారు."

నేను పరధ్యానంగా వున్నట్టు గమనించి అన్నాడు శేషగిరి... "మీరేమీ సందేహించకండి. పేమెంట్‌విషయంలో నేనెంత చెప్తే అంత...మన ప్రొడ్యూసరు. కథ నాదైనా, మీ శ్రమకు బాగాముట్టచెప్పించే బాధ్యతనాది."

నా చేతిమీద తనచేతిని వేసి సుతారంగా కొట్టేడు. నా కళ్లల్లోకి చూస్తూ "ఊ" అనండి అన్నట్టు... తనే, "ఊఁ, అంతేమరి" అన్నాడు. నేను మౌనంగా ఉండిపోయాను. ఆ వెంటనే, శేషగిరి తన దగ్గరున్న కథని చెప్పటం మొదలెట్టాడు. చేతులు తిప్పుతూ, మధ్య మధ్యలో లొట్టలు వేస్తూ, అబ్బా, అమ్మా, "ఇకచూడు... సెంచరీఖాయం" వంటిమాటలు ఉటంకిస్తూ, ఏ పాత్రకు ఏ నటీనటులు సరిపోతారో వాక్రుచ్చుతూ... వివిధ భంగిమల్తో... అర్థగంటసేపు... చెప్పింది చెప్పకుండా మలుపుల్తో, తీపితలపుల్తో రంగరించి... కథ చెప్పాడు. చివరికి అన్నాడు, "మీరు బాగా ఆలోచించి స్క్రిప్టుమీద కూర్చోండి. నాకు చెప్తే నేనూ వస్తాను, ఎనభై సీన్లలో నరకండి చాలు"

నాకు నవ్వొచ్చింది, ఆయన ధోరణికి. సభ్యతకోసం ఆపుకున్నాను.

"మీకు సహాయం చేయడం నాకు ఇష్టమే అయినా... ఇలాంటి వాటిల్లో అనుభవం లేనివాణ్ణి, నన్నొదిలేయండి" అన్నాను మొహమాటంగా. "అమ్మమ్మ... ఎంతమాట. మీశక్తి నాకు తెలీన్దికాదు రాజుగారూ. మీరు కొంత టచ్ చేస్తేచాలు... నా కథకు బంగారపు తావి అబ్బుతుంది. అదీ నా ఆశ. మీరేం మాట్లాడకండి"

అంటూ లేచాడు.

బిల్లు ఇవ్వబోయి, "అరెరే. చిల్లరలేదు... హండ్రెడ్‌కి"అని జేబులో ఉంచిన చేతిని జేబులోనే ఇరికించుకున్నాడు.

డబ్బు ఇచ్చి బయటికి వచ్చాను. కిల్లీ కొట్టుదగ్గర విల్స్‌పాకెట్టూ, అగ్గిపెట్టే, కిల్లీ తీసుకున్నాడు. ...శేషగిరి. అతనేమీ అనకుండానే నేను డబ్బిచ్చాను.

శేషగిరి తీయబోయే సినిమా గురించిన ఆలోచనలతో ఇల్లు చేరుకున్నాను.

మర్నాడు... సూరి కలిసేడు. జరిగింది చెప్పేను.

"నేనూ విన్నాను. ఎవరో ప్రొడ్యూసర్ దొరికాడని మన శాస్త్రిగారికీ చెప్పేట్ట, ఎక్కువమందిని మనవూరి నటీనటుల్ని పరిచయం చేస్తానంటున్నాడట" అన్నాడు సూరి.

రోజులు వారాలై, వారాలు నెలలై... నాలుగు నెలలు గడిచిపోయినై.

సోమవారం....

ఉదయం- తొమ్మిది కావొస్తోంది. నేను స్నానం ముగించి, పేపర్ చూస్తున్నాను. భోజనం చేసి ఆఫీస్‌కు పోవాలి.

శేషగిరి ఊడి పడ్డాడు.

అవతారం మారింది. మనిషి నీట్‌గా ఉన్నాడు. డైరీ స్థానంలో చేతిలోకి ఒక జిప్ బ్యాగ్ వచ్చింది. దాన్నిండా చాలా కాగితాలూ, పుస్తకాలూ ఉన్నై.

ఏదో సేవింగ్స్ కంపెనీకి ఏజెన్సీ తీసుకున్నాట్ట. వ్యాపారం మరీ లాభసాటిగా ఉండటంతో .. చాలా 'బిజీ' అయిపోయాడట. ఆ కారణాన సినిమా వ్యవహారం మానుకున్నాట్ట. చుట్టుపక్కల వూళ్ళు తిరుగుతూ నాలుగు నెలల్లోనే నాలుగు వేల ఆదాయం సాధించాడట. ఆకంపెనీ వివరాలన్నీ చెప్పేడు. నేను సహకరించాలనీ అర్థించాడు. ఆ నెల "టార్గెట్" కాలేదట. అందుకని నా సహాయంకోసం వచ్చానన్నాడు. సూరి కూడా కొంతమొత్తం ఇచ్చాడట. తప్పదన్నాడు. ఐదొందలు తీసుకొని ఏవో రసీదులిచ్చాడు. కొన్ని కరపత్రాలూ ఇచ్చాడు. కొన్ని ఫారాలమీద

సంతకాలు పెట్టించుకుని, కాఫీతాగి వెళ్లిపోయాడు.

భోజనాల దగ్గర శ్రీమతి నానా రకాల మాటలు అనడం మొదలెట్టింది. నాకు నోట్లో నాలుకలేదంది. ఎవరేం చెబితే అది నమ్ముతానంది. లౌక్యం తెలీదంది. చూస్తూ చూస్తూ అనవసరంగా ఐదువందలు శేషగిరికి సమర్పించుకున్నారంది.

"పొదుపుచేస్తే సాధిస్తావేంవిటే" అని విసుక్కున్నాను.

"ఆc.. పొదుపే, మళ్లీ వచ్చేదెంతో" అని నసిగింది.

ఎందుకనోగానీ, ఆఫీసుకు వెళ్తూనే... సూరికి ఫోన్ చేశాను. నే చెప్పింది విన్నాడు, సూరి.

"ఫర్వాలేదులే, నేనూ కట్టాను. చూద్దాం కానీ" అని భరోసా ఇచ్చాడు సూరి.

నాలోనేను కొంతసేపు మల్లాగుల్లాలు పడి ఆ విషయం మర్చిపోయాను.

కార్తీకమాసం...

వనసమారాధనకి మామిడితోటకి వెళ్లాం. ముప్పై కుటుంబాలు.

మధ్యాహ్నం భోజనాలు చేసి పేకాటలో కూర్చున్నాం. లోకాభిరామాయణం విడిపడ్డది. ఎవరో ముల్లుగుచ్చారు. "ఆతను ఏజంటుగా వున్న కంపెనీ బోర్డు తిప్పేసిందట. డబ్బు కట్టినవాళ్లకి ఏంవీ తిరిగిరాదు" అని.

ఇది విని నేను చాలా రిచ్చపడ్డాను. ఐదొందలకి నువ్వులూ నీళ్ళూ వదలాల్సి వచ్చింది. "నావీ రెండొందలుపోలా" అని తేలిగ్గా అని 'షో' చేశాదు సూరి. ఫస్ట్‌రౌండ్ తిరిగింది. అంతే, అందుకని వందదాకా వచ్చింది.

"సగం వచ్చేసిందిలే" అని నవ్వేదు సుబ్బారెడ్డి.

వనభోజనం ఆనందాన్ని ఆ రాత్రి మాయావిద సాధింపూ, ఏడుపూ హరించేసినై.

ముందుగా ఆలోచిస్తే... అప్పట్లో కలిగిన తృప్తి పోతుందేమోనన్నట్లు... అనవసరంగా భార్యమాటలు వినలేదని పశ్చాత్తాపమూ కలిగిందినాకు.

అయినా, అడుసుత్రొక్కటం అయ్యే పోయింది, కాలుచూసుకుని విచారించి లాభమేముందిగనుక?... కిమిన్నాస్తిగా ఊరుకున్నాను. నలుగురితోపాటు చావు పెళ్లితో సమానమన్నట్లు నాతో పాటు మా మిత్రబృందంలోని అందరికీ అంతో ఇంతో చేతులు కాలాయని తెలిసి, అదోవిధమైన తృప్తికలిగింది నాకు! మానవబలహీనతకి మంచి ఉదాహరణ యింతకంటే ఏముంది?!

... రాత్రి పదకొండు దాటింది.

కాలింగ్‌బెల్ మ్రోగితే తలుపు తీశాను.

ఎదురుగా శేషగిరి! లోపలికివచ్చికూర్చున్నాడు.

నీరసంగా, దీనంగావున్నాడు మనిషి. అతన్ని చూడగానే చప్పున నా ఐదువందలు గుర్తుకొచ్చినై. వివరాలడుగుదామనిపించింది కానీ, నా ప్రశ్నలూ, సందేహాలూ నా గొంతుకలో ఉండగానే.. అతను పెదవి విప్పేడు.

"నా భార్య చావుబ్రతుకుల్లో వుంది రాజుగారూ. మీరే ఆదుకోవాలి. ఇప్పటికిప్పుడు కర్నూలు తీసికెళ్లమంటున్నారు డాక్టర్లు. ఒక్క మూడొందలు సర్దాలి. ఇవి చేతులు కావు." సజలాలైన కళ్లతో చేతులు పట్టుకున్నాడు శేషగిరి.

నా మనస్సు ఆర్ద్రమైంది. గుటకపడలేదు. "ఏ భార్య" అని అడగబోయి ఆగిపోయాను. ఇంట్లోకి వెళ్ళి మూడొందలు తెచ్చి అతనికిచ్చాను. మధ్యలో మాయావిద కళ్లతో, చేతుల్తో అడ్డుకున్నదిగానీ, నేను ఆమె అభ్యర్థనని ఖాతరు చేయలేదు.

శేషగిరి నా ఉదారతను ఎంతో పొగిడి నన్ను దేవుణ్ణి చేసి, చివరికి థాంక్స్ చెప్పి, గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయాడు.

ఒకవారం తరువాత... సూరిదగ్గర శేషగిరి ప్రస్తావన తెచ్చాను. అతను తనకేమీ తెలీదన్నాడు. శాస్త్రిగారినడిగితే.. ఏదో నాటక పోటీలు పెడుతున్నానని తన దగ్గర ఓ ఏభైరూపాయల టిక్కెట్లిచ్చి దబ్బుపట్టుకుపోయాడని చెప్పారు.

అసుర సంధ్యవేళ... శేషగిరి ఇల్లు వెతుక్కుంటూ నబీకోట వెళ్ళాను.

త్వరగానే దొరికింది. విచారించాను ఇంట్లో. పదహారేళ్లపిల్ల చెప్పింది, "పదిహేను రోజుల్నుంచీ వూళ్లోలేదు, మా నాన్న" అని. తల్లి జబ్బు గురించి అడిగేను. "మా అమ్మా పిన్నీ... ఇద్దరూ కులాసాగానే వున్నారే" అంటూ ఆశ్చర్యపోయింది.

దొంగకు తేలు కుట్టింది. నాలో నేను నా తెలివితక్కువ తనానికి విచారించి, లోలోపల ఏడ్చుకుని ఊరుకున్నాను. క్రియకీ, కర్తకూ కూడా అజ్ఞానమే కారణం మరి! నన్ను నేను నిందించుకోక చేసేదేముంది.

నాకుపట్టిన గ్రహణం అనుకోండి, లేదా నన్నుపట్టిన గ్రహం అనుకోండి... అంతటితో విడిచిపోయి ఉంటే ఈ కథకూడా తోకలేని కథే అయ్యిండేది. నేను మొదట్లోనే చెప్పినట్లు ఈ కథ కాగితాలకెక్కేది కాదు.

నిజానికి నాకు నేను లోకువైపోయిన ఇలాంటి సంఘటనలు నా జీవితంలో చాలానే జరిగినై. నా ఖాతాలో తన భార్యకు గుడ్డలు కొనుక్కున్న మిత్రుడూ, నా ఖాతాగల పచారీషాపులో నా పేరు చెప్పి తన పిల్లకి అమూల్ డబ్బాలు తీసుకున్న స్నేహితుడూ..... ఇలా చాలామంది శేషగిరులు నాకు తటస్థపడి ఉండనే ఉన్నారు.... గతంలో.

అయితే... ఈ శేషగిరి ఆ తర్వాత ప్రదర్శించిన వినోదమే నేను మీకు చెప్పాలనుకున్న అసలు కథ.

ఆదివారం...

మధ్యాహ్నం కలత నిద్రలో కునుకు తీస్తున్నాను. మా ఇంటి వీధి గుమ్మం ముందు కోలాహలంగా, హడావిడిగా ఉంది. సవ్వడికీ, కేకలకీ, అరుపులకీ నిద్ర చెదిరింది. లేచి తలుపు తీసి చూశాను.

శేషగిరి! అతని చొక్కా కాలర్‌ను పుచ్చుకుని చెప్పుతో కొట్టేస్తున్నాడు... ఓ నడివయస్సు వ్యక్తి.

నేను ఆశ్చర్యంలో మునిగిపోయాను. ఒకరిద్దరు వాళ్లిద్దర్నీ విడదీయాలని ప్రయత్నిస్తున్నారు. శేషగిరి ప్రతిఘటించడంలేదు. తలవంచుకుని, సిగ్గుతో, బాధతో...

దెబ్బలు తింటున్నాడు. నాకు జాలేసింది. గబగబా వెళ్ళి ఆవ్యక్తిని అడ్డుకున్నాను. పక్కకి తప్పుకుని నిలబడ్డాడు, శేషగిరి. నా కళ్ళల్లోకి ప్రాధేయపూర్వకంగా, కృతజ్ఞతగా చూస్తున్నాడు. అవతలివ్యక్తి మాత్రం రెచ్చిపోతూ, "కక్కరా దొంగనాయాలా, నా రెండొందలు ఇప్పుడు కావాలనాకు. నువ్వేంచేసినా సరే, ఇప్పటికిప్పుడు ఇక్కడికిక్కడ ఇవ్వాల. లేకపోతే ఇవ్వాళ నీ రక్తం కళ్లచూస్తాను" అని మీదమీదకి రాసాగేడు.

శేషగిరి హీనస్వరంతో సంజాయిషీ ఇస్తున్నట్టు చెప్పేడు, నాకు... "మా పెద్దమ్మాయి ఏదోగొడవల్లోపడి నిద్రమాత్రలు మింగి నెత్తిమీదకితెస్తే... బుద్ధి గడ్డితిని ఈయన దగ్గర వడ్డీకి తీసుకున్నాను, రాజుగారూ. నా పరిస్థితి నాకే దయనీయంగా ఉంది. ఏం చేస్తాను చెప్పండి. రోజులు బాగాలేవు. పట్టిందల్లా మట్టయిపోతోంది"

ఆవతలివ్యక్తి బూతులు అందుకున్నాడు. నన్ను కూడా పక్కకి నెట్టి శేషగిరి మీదకి లంఘించాడు.

నేను ఆవేశంగా అతన్ని ఒక్కతోపు త్రోశాను వెనక్కి. నోరుమూసుకొని అవతలికి నిలబడమన్నాను. ఏదో తెగింపూ, తెగువా వచ్చేసినై నాకు. లోపలికి వెళ్ళి రెండొందలు తెచ్చి ఆ వ్యక్తిమోహాన్న కొట్టేను. అదృష్టవశాత్తూ మాయావిడ మ్యాట్నీకి వెళ్ళింది!

మూగచూపులు చూస్తూ చేతులు జోడించాడు శేషగిరి. నేనే వారించాను. తనకష్టాల్ని నివేదించుకుని ఆ తర్వాత కొద్దిసేపటికి వెళ్ళిపోయాడు, శేషగిరి.

ఈ ఆదివారం సంఘటనంతా ఒక ప్రహసనమనీ, దానిలో రెండవ పాత్రధారి... శేషగిరి బావమరిది అనీ, ఈ నాటకానికి రచయిత, దర్శకుడు శేషగిరేనని తెలియదానికి... మరో ఇరవైనాల్గుగంటలకంటే ఎక్కువ పట్టలేదు.

నా గతితప్పిన కరుణ గుర్తుకొచ్చి, నా మనస్సు విలవిల్లాడిపోయింది.

కథకి తోకదొరికింది. శేషగిరిజిత్తులూ, వాటితోపాటు లయవిన్యాసం చేస్తున్న అతని తోకా... ఊళ్లో నలుగురూ దొరకపుచ్చుకున్నారు. అతను బిచాణా ఎత్తేశాడు.

చిన్నప్పట్నుంచీ నాకు గారడీ అంటే ఇష్టం. బహుశా నాలోని ఆ బలహీనతని గమనించే తెలివి ఒక్క శేషగిరిలాంటివాళ్లకే ఉంది కాబోలు!

ఆ రాత్రి... తనకు పండక్కి కొత్తచీర కావాలని గారంపోయింది, నా శ్రీమతి. డబ్బులేదనీ, చాలా ఇబ్బందిగా ఉందనీ, మొన్నటికి రెండొందలు అన్యాయంగా పోయాయనీ... ఏదో వాపోవబోయి.... చటుక్కున నాలుక కరుచుకుని, నోరుమూసుకున్నాను!

నా మౌనానికి తనభాష్యం తాను చెప్పుకుంది.... శ్రీమతి!!

★ ★ ★

(ఆగష్టు - 1984, స్వాతి మాసపత్రిక)



# పల్లవి

అబద్ధంతోనూ, నిజంతోనూ, చాలా కుస్తీపట్లు పట్టినవాణ్ణేనేను.

అబద్ధాలను అతి తరచుగా వింటూ వుండటం, వాటి వెనకాల ఎక్కడో దాగిన రేఖా మాత్రపు నిజాన్ని గుర్తించి నవ్వుకోవడం... తెలుసు నాకు.

అలాగే, నిజాన్ని ఎప్పుడో హఠాత్తుగా ఎదుర్కోవడం, దాని దాడికి కారణమైన అబద్ధాల్ని విశ్లేషించుకోవడం... ఈ విద్యనీ నేను చక్కగానే వొంటబట్టించుకున్నాను.

అయితే, గణపతి తన కథను నాముందు వెళ్లబోసుకున్నప్పుడు మాత్రం... నీరక్షీర న్యాయం తెలిసి నాలో నివశిస్తున్నదనుకున్న నా చాతుర్యపు హంసకి గట్టి పరీక్షే ఎదురైంది!

అసలు గణపతి కథ చెప్తాను.

* * *

మార్చినెల...

ఆర్థిక సంవత్సరంలో చివరిమాసం, అంతా హడావిడి. సంవత్సరం మొత్తానికి... నిర్ణయింపబడి అంగీకరింపబడిన 'టార్గెట్'ని సాధించి తీరవలసిన నెల. సహజంగా ఏటి కేడాదిపాటూ నిద్రించిన పులి కూడా లేచి 'అన్వేషణ'కు బయల్దేరే....

ఒక సోమవారం...

మధ్యాహ్నం మూడు గంటల సమయం.... గణపతికి చాలా చిరాగ్గావుంది.

నిజానికి అతనికి ఆ సంవత్సరమంతా, అందులోనూ ఆ నెల అంతా, మీదుమిక్కిలి ఆరోజు.... చాలా చిరాగ్గా వుంది.

దీనికి ఏకైక కారణం... అతని వ్యాపారం... అంటే అతని కంపెనీ అమ్మకాలు... అంటే అతని పని ఫలితాలు... ఏ మాత్రం సంతృప్తి కరంగాలేవు!

అయినా, ఇలాటి సందర్భాల్ని గతంలో చాలావాటిని చూసేడు, గణపతి. అతను తలచుకుంటే ఇలాంటి నిరుత్సాహపు వాతావరణంలో... 'మందు' దట్టించి, అమాంతం వో ఫిరంగిని పేల్చేయగలడు; కొండలో సగభాగాన్ని తనకు కావలసినరీతిలో పిండి చేయించుకోగలడు.

కానీ, ఈ ఏటి పరిస్థితి... బొత్తిగా ఆశాజనకంగా లేదు. తనకు తానుగా వరించిన 'టార్గెట్'లో కేవలం నలభై శాతం మాత్రం పని జరిగింది... ఇప్పటికి. ఇక మిగిలింది, పధ్నాలుగు రోజులు!

తన క్రిందివాళ్లు వొక్కరూ సరిగా చిత్తశుద్ధితో పనిచేయడం లేదు.

అవును... తాను వాళ్లలా 'ఏరియా మేనేజర్'గానో, 'ఇన్‌స్పెక్టర్'గానో వున్నప్పుడు... విధిపట్ల ఎంతటి చిత్తశుద్ధి వుండేది ? ఎంతగా 'టూర్' చేసేవాడు? ఎంత కష్టించి పనిచేసేవాడు? దాని ఫలితంగానేకదా... ఇవ్వాళ తాను... 'రీజినల్ మేనేజర్'... కాగలిగింది. అవును... ఈ తరం మనుషులే ఇంత! బాధ్యత తెలీదు.

అవును... ఈ విషయాన్ని మాత్రం ఢంకా భజాయించి మరీ చెప్పగలడు. అందరూ బాధ్యత తెలీని మనుషులే!...

సుందరికి సుందరి...

తన అవస్థ, ఆందోళన, పరిస్థితి, విసుగు, చిరాకు... అన్నీ తెలిసిన అర్ధాంగి కదా...

ఆమె... సరిగ్గా తాను చాలా పెద్ద పార్టీతో నిర్ణయించుకున్న సమయానికి... కారుని కాస్తా బయటికి పంపించేసి తనను డాన్స్ చేయిస్తోంది!

భోజనం చేయబోయేముందు తాను చెప్పను కూడా చెప్పాడు. 'మూడు గంటలకల్లా నేను మళ్లీ బయటికి వెళ్లాలి' అని. ఇరవై వొక్క ఏళ్ళు తనతో కాపరం చేసి, ఐదుగురు పిల్లల తల్లి అయినా... ఈ సుందరికి బాధ్యత తెలిసిరాలేదు!

కనుకనే, పదో తరగతి పరీక్ష రాయనున్న నాలుగో కూతురి అవసరాన్ని గమనించి ఆమెని కారులో ఇంచక్కా ట్యూషన్ మాస్టర్ దగ్గరకి పంపించిందిప్పుడు!

సుందరి సరే... ఆ రాజారావు మాత్రం!

సిటీలో వుండే ఏరియా మేనేజర్ గదా. అతని పనిని నిజానికి తను చేస్తున్నాడు కదా. సమయానికి వచ్చి కారులో తీసుకువెళ్లాల్సిన బాధ్యత లేదూ... అతగాడికి? ఉంది... కానీ, ఆ బాధ్యత తెలిసి ఏడిస్తే గదా! ఫోన్ చేస్తే, "సారీ సర్. నా కారు కొంచెం ట్రబులిస్తుంటే గేరేజ్‌కి పంపేను" అని సమాధానం. మార్చి నెలలో కారుని ట్రబులిచ్చేటట్లు(!) కాపాడుకుంటూ రావడం కంటే ఇంకేం తార్కాణం కావాలి... అతని బాధ్యతా రహిత ప్రవర్తనకి!

గణపతి పూర్తిగా డ్రెస్ చేస్కుని, కాలుగాలిన పిల్లిలా తిరగసాగేడు. క్షణ క్షణానికీ వాచీ చూసుకోవడం, కిటికీలోనుంచీ రోడ్డుకేసి చూడటం...... "ఛీ..ఛీ, ఛా...ఛా..." అనుకుంటూ, నసుగుతూ, గొణుగుతూ, విసుగునీ, చిరాకునీ ప్రదర్శిస్తున్నాడు.

అతనికి చాలా అసహనంగా వుంది. మళ్లీ వాచీ చూసుకున్నాడు గణపతి. మూడూ పదిహేను.

సమయం అయిపోతోంది.

మూడున్నరకల్లా తాను తారాచంద్ దగ్గర వుంటానని మాటిచ్చాడు. అతన్తో అర్ధగంట మాట్లాడాలి. పన్నెండు రోజుల అవస్థ తర్వాత అతనీ టైమ్‌ని ఫిక్సప్ చేశాడు. నాలుగు గంటలకు తారాచంద్ బొంబాయి ప్రయాణమై వెళ్లిపోతానన్నాడు.

కారు ఈ క్షణాన వచ్చినా, తాను తారాచంద్ దగ్గరకి చేరేసరికీ మూడూ నలభై అవుతుంది. ఫర్వాలేదు ఇరవై నిమిషాల్లో తాను "డీల్" ఫైనలైజ్ చేయగలడు. తారాచంద్ చేత చెక్‌మీద సంతకం చేయించుకొని రాగలడు.

కానీ, కారు రాలేదింకా.

సుందరి వచ్చింది, టీ కప్పుతో సహా!

గణపతికి మండిపోతోంది... అసలే. దానికి తగ్గట్టు చెమటలు కక్కించే వేడి వేడి టీ కప్పుతో ప్రత్యక్షమౌతోంది.... అర్ధాంగి. ఆమె అసలు బాధ్యత తెలిసిన

భార్యేనా?

వెన్నెలవాక జాల్వారినట్లు సన్నగా నవ్వింది, సుందరి.

"సిగ్గులేకపోతేసరీ... నవ్వడానికి". గణపతి కోపం.

టీ కప్పు ఇవ్వబోయింది. "అఖ్ఖర్లేదు"... గణపతి.

"ఎందుకలా చిందులు తొక్కుతారు? వస్తూనే వుంటుంది, కారు" అంటూ వంగి, టీ కప్పుని టీ పాయ్ మీద ఉంచి, తాను సోఫాలో కూర్చుంది, సుందరి.

"ఆఁ వస్తూనే వుంటుంది. మా పార్టీ బొంబాయి చేరేక ఆ కారూ ఇంటికి చేరుతుంది", తానూ కూర్చున్నాడు, ఎదురు సోఫాలో.

ఆమె మరోసారి నవ్వుకుంది. ఈసారి తనలోతాను... మల్లెల దొంతరని దోసిలితో ఆఘ్రాణిస్తున్నట్టు!

"టీ తీసుకోండి మీరు" మళ్లా హెచ్చరించింది.

"నేను తాగను. అఖ్ఖర్లేదు" ఖండితంగా చెప్తూ... దినపత్రికను చేతిలోకి తీసుకున్నాడు.

మారుమాట్లాడకుండా తానా టీ తాగేసింది, సుందరి.

గణపతి కడుపు రగిలిపోతోంది.

మళ్లీ వాచీ చూసుకున్నాడు. మూడూ ఇరవై ఐదు!

సమయం మించిపోతోంది. అతని కళ్లముందు ఒక్క తారాచంద్ కొనుగోలు జేసే టార్గెట్‌లోని పదిశాతం అమ్మకాల అంకెలే... కనిపించసాగినై.

పోనీ... రిక్షాలో పోతే... రేపటికి వెళ్తాడు!

ఇక్కడ టాక్సీలు దొరకవు! ఇదొక అవస్థ. ఊరికి దూరంగా... ఇటీవలే కట్టుకున్న సొంత ఇంట్లోకి... అనవసరంగా తొందరపడి మారేడు.

అయినా, తాను మారేదా? అదీ సుందరి నిర్వాకమే! బాధ్యత తెలిసి ఏడ్చిన మనుషులయితే గదా చెప్పేందుకు!

"అందుకనే ... ఏ పని చెయ్యాలన్నా అనుభవమన్నా ఏడవాలి; తెలివితేటలన్నా ఉండాలి...". పైకే అనేశాడు, గణపతి.

సుందరి మొహం మంకెనపువ్వులా అయిపోయింది!

"అవును. మీ అనుభవాలూ, తెలివితేటలూ... రెండూ గొప్పవే! అమ్మపుట్టిల్లు మేనమామ దగ్గర చెప్పినట్లు నాకే చెప్పుకోవాలి, వాటి గురించి."

గణపతికి సాచిలెంపకాయ కొట్టినట్లయింది. భరించలేకపోయాడు.

"ఏం. ఏం లోటు కనిపించింది వాటిల్లో. ఒక్కసారి వెనక్కితిరిగి చూసుకుంటే... నేను సాధించిన ప్రతి విజయంలోనూ వాటి విలువ తెలుస్తుంది."

"ఆఁ సాధించారు.... పేద్ద విజయాలు" సాధ్యమైనంత వ్యంగ్యమూ, వక్రోక్తీ ధ్వనించినై ఆమెమాటల్లో.

గణపతికి నిజంగానే కోపమొచ్చింది.

"ఏం... సాధించక ఏం చేశాను?" రెట్టించాడు.

"ఏం చేశారో నేను చెప్తాను" అని ఒక్కసారిగా గంభీరమైపోయింది సుందరి. అలసినట్లు సోఫాలో వెనక్కి వాలింది.

"హాయిగా ఫ్యాన్‌క్రింద కుర్చీలో టేబుల్ ముందు కూర్చుని చేసే ఉద్యోగాన్ని వదిలేశారు. ఇన్‌స్పెక్టరయితే... సంవత్సరానికి శక్తి మేరకూ బోనస్ గడించవచ్చని ఆ బోట్‌లోకి దూకేశారు. ఆ వెంటనే, ఆఫీస్ పరీక్షలంటూ ఒకవైపు, అమ్మకాల్లో ఎక్కువ రాబడి కావాలంటూ మరోవైపు – సవ్యసాచిత్వం మొదలెట్టారు. అక్కణ్ణుంచీ ఒకటే పరుగు. అతిత్వరలో ప్రమోషన్ సంపాదించాలని ఒకటే తపన, తాపత్రయం. ఇల్లూ వొళ్లూ తెలీకుండా, సమయమూ సందర్భమూ మరచి, 'బిజినెస్' 'బిజినెన్' అంటూ అహోరాత్రులు తపస్సు చేశారు."

"అవును. అలా దీక్షగా పనిచేస్తూ, పరీక్షలూ పాసవుతూ రాబట్టే... ఏరియా మేనేజర్ కాగలిగేను. అదీ జెస్ట్ ఆరేళ్లలో."

"ఆఁ ! అయ్యారు. మోటారు సైకిల్ పోయి, కారొచ్చింది. ఇంట్లో

టెలిఫోన్‌కూడా ఏర్పడింది. జీతం రెట్టింపయ్యింది. బోనస్ డబ్బుతో రెండుచోట్ల ఇండ్ల స్థలాలు కొన్నారు. ఇంట్లోకి ఫ్రిజ్‌లూ, కూలర్‌లూ వచ్చినై. నిజమే."

"కష్టపడితేనే మరి... అలాంటి సుఖాలు దక్కేది."

"హుఁ... సుఖం..." సుందరి చిత్రంగా నవ్వింది. విచిత్రంగా, చేతులు గాలిలో విదిలించింది.

చకితుడై చూస్తూ ఉండిపోయాడు గణపతి.

"ఆ సుఖాల కోసమే మీరు 'మందు' అలవాటు చేసుకున్నారు. పైవాళ్ల పార్టీలకి అది తప్పనిసరి అన్నారు. అలవాటైంది. నేను ఏవగించుకునే మాంసాహారాన్ని అదపాదడపా రుచిచూశారు. ఆ సుఖాలకోసమే మళ్లీ మీ క్రింది వాళ్లనీ కాకాపట్టాల్సిన ఉద్యోగిగా మారేరు. అవును. అంతా సుఖం కోసం; డబ్బుకోసం, డబ్బు అందించే సుఖంకోసం, సుఖాన్ని కొనుక్కొనే డబ్బుకోసం."

సుందరి కంఠస్వరం రుద్ధమైంది. ఆగింది. క్షణాల తరువాత...

"పోనీ అక్కడితో ఆగిందా మీ పరుగు. ఆగలేదు" అంది.

"జీవితానికి ఓ లక్ష్యం అంటూ ఉండకపోతే, మనిషి సోమరిగా మారిపోతాడు. వాడి కృషి అంతటితో ఆగిపోతుంది."

"అవును. అదే నేనూ చెప్తున్నాను. మీ కృషి ఆగలేదు. ఒక్క క్షణం సేపు ఆగివెనక్కి చూసుకోలేని 'బిజినెస్'లో పడిపోయారు. మీరు. "

" అందుకే అఖిలభారతదేశంలోనూ, మా కంపెనీ చరిత్రలోనూ మున్నెన్నడూ లేని రికార్డ్‌ని సృష్టించగలిగేను."

"వెంటనే అవుటాఫ్ టర్న్' ప్రమోషన్ వచ్చింది. రీజినల్ మేనేజర్ అయ్యారు."

"నేను ఏం సాధించి మాత్రం ఏంలాభం. నువ్‌మాత్రం నేను ఏ విజయాన్ని సాధించినా... ఆముదం తాగిన మొహం పెట్టావేగానీ, ఏనాడైనా... నన్నూ, నా కృషినీ మనస్ఫూర్తిగా అభినందించావా...లేదు." గణపతి స్వరంలో బాధని సుందరి

గుర్తించలేకపోలేదు. అయినా తన ధోరణిలో తాను చెప్పుకుపోయింది.

"నిజమే. ఒప్పుకుంటాను. అసలు నా ప్రశ్నే అది. నేనెందుకు అభినందించాలిమిమ్మల్ని? మీ కృషీ, దీక్షా పట్టుదలా, విజయాలూ... ఇవన్నీ నాకేమిచ్చాయనీ?" ఉద్వేగంగా అన్నది సుందరి.

గణపతి ఆమె మాటలకు చాలా నొచ్చుకున్నాడు. కోపంగా, విసుగ్గా అడిగేడు, "అంటే అవన్నీ నా స్వసుఖం కోసం మాత్రమే ఉపయోగించాయా. అలాగైతే, అసలు నేను సుఖంగా తిని హాయిగా విశ్రాంతి తీసుకున్న రోజంటూ వుందా... జీవితంలో?"

మ్లానంగా నవ్వింది సుందరి.

"లేదు. సరిగ్గా ఇదే ప్రశ్న... నేను మిమ్మల్ని వేయదలచుకున్నది. ఇంకా నిజంగా చెప్పాలంటే, మీకు విడమర్చి చెప్పాలనుకున్నదీ ఇదే. మీకేనాడూ కడుపునిండా తిండీ, కంటినిండా నిద్రా లేదు. నాకేనాడూ మీతో కలిసి నవ్వుతూ తుళ్ళుతూ సంతోషంగా గడిపే అవకాశం లేదు."

ఒక్క క్షణం ఆగి భర్తకేసి పరీక్షగా చూసింది సుందరి.

గణపతి కళ్లల్లోకి చూస్తూ, నిగ్గదీస్తున్నట్టు అడిగింది... "అయినా మనమిద్దరం ఇరవైఏళ్లపైబడి సంసారం చేస్తున్నాం. ఐదుగురు పిల్లల్ని కన్నాం. అవును. మీ మానసిక ఆందోళనల్నీ ఒత్తిడుల్నీ తగ్గించడానికీ, శారీరకంగా మీ అవసరాల్ని తీర్చి, మీకు పిల్లల్ని కని యిచ్చే యంత్రంగా ఉండటానికీ... ఉపయోగపడ్డాను. అదేగా నేను మీ దబ్బుతో, కృషితో సంపదతో, విజయాల్తో కొనుక్కున్న సుఖం?"

గణపతి నిర్విణ్ణుడైనాడు. సుందరిలోని అగ్ని పర్వతం అతని కళ్ళముందు పగిలి లావాల్ని విరజిమ్ముతోంది.

బోనులో నిద్రిస్తున్న సింహాన్ని నిద్రలేపినట్లు అర్థమైంది అతనికి.

సుందరికి దుఃఖం పొంగి, ఏడ్పులోకి దిగింది. చేతుల్లో మొహాన్ని దాచుకుని కుమిలిపోసాగింది.

ఆ వెక్కిళ్లలోనే అడిగింది. "ఒక్కసారి ఆలోచించి చెప్పండి. ఈ ఇరవై

ఏళ్లలోనూ మీకు మీరుగా నాకేనాడన్నా వో పూలమాల తెచ్చారా? కలిసి మనిద్దరం కార్లో ఒక్కసారన్నా హాయిగా వో షికారుకుగానీ, సినిమాకుగానీ వెళ్లామా? లేదు, మరి ఎందుకొచ్చిన అవస్థండీ ఇదంతా? పరమపద సోపాన పటంలో నిచ్చెనలమీద నిచ్చెనలు ఎక్కుతూ ఎంతదూరం వెళ్ళినా చివరికి సాధించే విజయం ఏంవిటో చెప్పనా?... పావుల్ని తీసేయడం, పటాన్ని దులిపేయడం!"

"చివరికి నువ్ చెప్పే వేదాంతం, వైరాగ్యం ఇదా?" అని దగ్గుత్తికతో అడిగేడు గణపతి.

"వేదాంతమూ కాదు, వైరాగ్యమూ కాదు.... ఆత్మక్షోభ" అని చెంగుతో కళ్లు ఒత్తుకుని, సోఫోలోంచి లేచి, ఖాళీ కప్పు తీసుకుని లోపలికి వెళ్లిపోయింది, సుందరి.

వాచీకేసి చూసుకున్నాడు, గణపతి. ఒక్కసారిగా ఉలిక్కిపడినట్లు సోఫాలోంచి లేచి నిలబడ్డాడు.

టైము నాలుగు దాటి ఐదు నిమిషాలు అయింది. కారు వచ్చింది. డ్రైవర్ సంజాయిషీ ఇస్తున్నాడు, గుమ్మం పక్కగా నిలబడి, "అమ్మాయి వాళ్ల ఫ్రెండ్‌కి సీరియస్‌గా ఉందని కబురందిందండీ దార్లో. కార్లో తీసుకువెళ్లి ఆ అమ్మాయిని హాస్పిటల్‌లో చేర్చి రావాల్సి వచ్చింది సార్."

గణపతికి ఏమీ వినపడటంలేదు.... 'ఆత్మక్షోభ...' అన్న పదం ఒక్కటే అతని చెవుల్లో మారు మ్రోగుతోంది.

★ ★ ★

రాళ్లు మోస్తున్న బరువుతో తల దిమ్మెక్కింది నాకు. గణపతి కథ వినేసరికి.

నా అభిప్రాయం వినడానికి ఉత్సుకతతో నాముందే కూర్చున్నాడు అతను. 'సుందరి ఆత్మక్షోభ సమంజసమైనదేనా?...' ఇదీ అతను నా ముందు పరచిన ప్రశ్న!

నాకు భయంకరమైన స్వప్నం నుంచీ బయటపడలేనట్లు తోచింది.

సరిగ్గా అప్పుడే నేను ఇరకాటాన పడ్డాను. నిజానికి, నా కుడికన్నదిరింది. అది శుభసూచనే మరి!

ఆ వెంటనే... నాకు ఒక్కసారిగా జ్ఞానోదయమైంది. కంటి వెలుగు, మనసు వెలుగు.... వొక్కచోట నిలిచేయి. ఆ వెలుగులో బుద్ధీ, మనసూ కూడా ఒకేసారి తాదాత్మ్యం చెందేయి. ఆ బిందువు దగ్గరే నిజమూ, అబద్ధమూ సంగమించి పోయాయి. గణపతీ, సుందరీ.... ఎవరి దృష్టి వారికి సమంజసమైనదే!

కొత్త తలుపుల్ని తెరచుకుంది నా మేధస్సు.

గణపతికేసి చూస్తూ చెప్పాను, "సుందరి ఆత్మక్షోభ ఎంతవరకు సమంజసమో చెప్పలేనుగానీ, పల్లవి తుంచిపారేసిన గీతానికి ఎన్ని బాణీలు కూర్చుకున్నా ఏదో లోపం తోస్తూనే ఉంటుంది. శ్రోతకి మాత్రమేకాదు; పాడే సంగీతకారుడికి కూడా. బహుశా నీ జీవితమూ అంతేనేమో!"

గణపతి నావైపు సాలోచనగా తేరిపార చూశాడు.

క్షణం ఆగి ఠక్కున అన్నాడు, "కథకుడివి గదా. నిజాన్నీ అబద్ధాన్నీ కూడా సమంగానే సమర్థించగలవు!"

నేను ఆశ్చర్యంలో మునిగిపోలేదు; ఆనందంలో తడిసిపోయాను... 'ఫర్వాలేదు; కథలో జీవితమూ, జీవితంలో కథా కల నేతలా అల్లుకుపోతున్నాయన్న మాట!'

గణపతికి మనస్సులోనే అభినందనలు చెప్పాను!.



(ఆంధ్ర సచిత్రవారపత్రిక - 19 ఆగష్టు 1983)

# నీడ - కీనీడ

ధనుర్మాసం రోజులు. మంచు కురుస్తోంది.

చలిలో మునగదీసుకుని పడుకున్నది... ఊరు.

వాక్యంలో కుదురుకున్న భావంలా వెట్టగా కూర్చుంది, ఇల్లు.

ఇంట్లో బుడ్డి దీపం మినుకు మినుకు మంటోంది. మంచంలో పడుకుని ఏదో తనలో తాను గొణుక్కుంటున్నాడు... సాంబయ్య.

పక్కనున్న కరణంగారింట్లో గడియారం పన్నెండు కొట్టింది.

సాంబయ్యకు నిద్రరావడం లేదు, " ఈ రాత్రి కింక నిద్రపట్టదు" లేచి కూర్చున్నాడు. మాసిన గడ్డాన్ని అలవోకగా నిమురుకుని, శాలువాని బుజం నిండుగా లాక్కున్నాడు. జలుబుతో పగిలిన గొంతుని సరిచేసుకున్నాడు.

ఎదురు గోడకేసి చూశాడు. "ప్రాణాలన్నీ అక్కడే ఉన్నై. మరిచిపోతామన్నా మరపురాదు. ఎంత ఘోరం జరిగిపోయింది."

సాంబయ్య మంచం దిగేడు. అడుగులు తడబడినై. కాళ్ళు చలితో బిరుసెక్కి, మేధస్సు చేస్తున్న ఆలోచనకు తాళం వేస్తూ వణకసాగినై.

గోడవారగా నడిచి తలుపుదాకా వెళ్ళాడు. ద్వారబంధం పక్కగా వున్న ఫోటోని చేతిలోకి తీసుకొని అక్కడేకూర్చుండి పోయాడు. ఫోటోమీదికి చూపులు నిలిపి, దాన్ని వేళ్లతో నిమురుకున్నాడు. రెండు చేతుల్తోనూ మొహానికి దగ్గరగా తెచ్చుకొని... పెదవులతో ముద్దుపెట్టుకున్నాడు.

"నా బంగారు తల్లి" సాంబయ్య కంఠం రుద్ధమైంది. తడిబట్టని పిండినట్లు బాధ... గుండెను పిండేయసాగింది. కూర్చున్నవాడికి కూర్చున్నట్టే ఏడుపు

ముంచుకొచ్చింది. ఫోటోని పక్కనే ఉన్న ఉయ్యాల బల్లమీద ఉంచి, వెక్కి వెక్కి ఏడవసాగేడు.

✶✶✶

సాంబయ్య తాతగారు బ్రహ్మీభూతుడు.

సాంబయ్య తండ్రి యజ్ఞం చేశాడు. ఆయన దేవీ ఉపాసకుడు. దేహీ అని ఒకర్ని యాచించకుండా నిత్యాన్నదానంతో, నిత్యాగ్నిహోత్రంతో ఇంటినీ వంటినీ పునీతం చేసుకున్న మహర్షిగా చెప్పుకుంటారు... ఆయన్ని తెలిసినవాళ్ళు. ఆ బ్రహ్మ తేజస్సు అలాంటిది! ఇంట్లోనే వేదపాఠశాల. చుట్టూ అంతేవాసులూ, ఇతర ఒజ్జలూ. ఆ ప్రాంతమంతా ఒక గురుకులం. ఆయన కర్మిష్ఠి; వేదాంతి, గురువు, శాస్త్రి, పెద్ద, అయ్యవారు...అంతే!

ఊరు మనుగడకే ఆయన ఏడుగడగా గడిచిన రోజులు అవి.

సాంబయ్య నూనూగు మీసాల రోజులలోనే కాంతమ్మతో వివాహం జరిగింది. అప్పటికి ఆమె... "అష్టవర్షాత్‌భవేత్ కన్యా."

తండ్రిచాటు బిడ్డగా ఉంటూనే సాంబయ్య ఆరోజుల్లో నాలుగెకరాల పొలానికి సరిపడా దబ్బును... నేతి దబ్బాల్లోంచీ, బియ్యపు బస్తాల్లోంచీ... రొల్లుకున్నాడు. అతని మేనమామ సాంబయ్యకు ఈ వ్యవహారాల్లో వత్తాసు.

తండ్రి తనువు చాలించగానే... తాను దాక్షికం వెలగబెట్టడం మొదలెట్టాడు సాంబయ్య. నోట్లో ఉన్న నాలుగు ముక్కలూ వైదీకానికి అక్కరకొచ్చినై. లౌక్యం తెలిసిన పిండం కనుక, దృష్టి రూపాయి కాసులమీదనే నిలిపి రోజుల్ని పరుగెత్తించడం నేర్చుకున్నాడు.

అతనికంటే మించిన లాఘవం కాంతంకి ఉంది. రూపాయిని చేతులు మార్చి చూస్తుండగానే రెండు చేసే చాకచక్యం... ఆమె విద్య.

పదహారో ఏటనే కాంతం కడుపుపండి రాజ్యం పుట్టింది. ఆ పిల్లకు పెళ్లయిన తరువాతగాని, ఆ ఇంట మరో ఉయ్యాల పడలేదు.

కాంతంకి ముప్ఫైరెండవ ఏట సుమతి పుట్టింది.

అప్పటికెప్పుడో గురుకులం రూపు మాసి పోయింది. పెద్దల ఆదర్శాలు, ఆశయాలు వాళ్లతోనే పోయాయి.

సాంబయ్య పదెకరాల మాగాణీ, ఆరెకరాల మెరకతో స్థితిపరుడిగా స్థిరపడ్డాడు. ఊరంతకీ ఆయన పురోహితుడు, పౌరాణికుడు.

✶✶✶

సాంబయ్య మెల్లగా కళ్లు పైకెత్తాడు.

ఎవరో నోటిముందటి ముద్ద లాక్కున్నట్లు ఉలిక్కిపడ్డాడు.

క్షణం తరువాత నిమ్మళంగా లేచి పక్క గదిలోకి వెళ్ళాడు. కావడి పెట్టి తెరిచాడు. దానిలోనుంచీ గుడ్డ సంచిని తెచ్చుకొని మంచం పక్కగా నేలమీద కూర్చున్నాడు.

సంచిముడి ఊడదీసి నేలమీదికి తలక్రిందుగా కుమ్మరించాడు.

డబ్బు!! అప్పుడే విడుదల పొందిన ఖైదీల్లా- నోట్లు, చిల్లర - చెల్లాచెదురుగా పడినై.

వాటన్నిటినీ ఒక్కటొక్కటే తీసి లెక్కపెట్టసాగేడు సాంబయ్య.

లెక్క పూర్తి చేసేసరికి మెరుపు తీగని అంటుకున్నట్లయింది.

"ఐదు వేలా ఇన్నూటా అరవై ఆర్రూపాయలైందన్నమాట ఖర్చు" అని పైకే అనుకున్నాడు.

దబ్బంతా సంచిలో ఉంచి మళ్ళీ బొందుతో మూతి ముడివేసేశాడు. తీసుకువెళ్లి కావడి పెట్టెలో పెట్టొచ్చి మంచంమీద కూర్చున్నాడు.

"దొంగముండా, దొంగముండాకొడుకూ... నా కొంప గుణ్ణం చేశారు."

సాంబయ్య ముక్కుపుటాలు అదిరినై, పెదవులు వణికినై.

ఉన్నట్టుండి రబ్బరు బంతిలా పైకి లేచాడు. మంచంకింది పొన్ను కర్ర తీసుకొని మంచంమీద బాదసాగేడు. "చావండి...చావండి... మీ రోగం ఇట్లాగే కుదురాలి...ఆఁ... ఏడవండి... బాగా కుయ్యో, మొర్రోమని, లబో దిబోమని మొత్తుకు చావండి." అంటూ శక్తి సన్నగిల్లేదాక కొట్టేడు.

ఆపైన కర్రని అవతలికి విసిరేసి దొడ్డి తలుపు తెరుచుకుని పెరట్లోకి వెళ్లాడు.

నూతి పళ్లెం పక్కగా బంతి చెట్ల వరుస ఉంది. ఆ చెట్లకు విరగకాసిన పూలన్నీ పుటుకు పుటుకున కోసుకుని శాలువా కొంగున కట్టుకుని లోపలికొచ్చాడు.

హాల్లో ఉయ్యాల బల్లమీద కూర్చుని పూలన్నీ మాల గుచ్చటం మొదలెట్టాడు. ఉండుండి కుడిపాదం నేలను తాకుతుంటే ఉయ్యాల వేగాన్ని పుంజుకుంటోంది.

పది నిమిషాలు గడిచినై.

కట్టిన మాలని గబగబా తెంచి, పూలన్నీ విరజిమ్మేశాడు. కట్టకుండా ఉన్న పూలని ఒక్కటొక్కటే తీసి ఫోటోమీద రాశిగా పేర్చేడు.

"నా బంగారు తల్లికి బంతి పూలంటే ఎంత ఇష్టమో" అని ఫోటోమీదికి ఒరిగి ఉయ్యాల బల్లకేసి తల బాదుకొని రోదించసాగేడు.

★ ★ ★

పెద్ద కూతురు రాజ్యం పెళ్లీ పేరంటాలు ఘనంగా జరిపించి పంపేరు సాంబయ్య, కాంతం. అల్లుడు హైదరాబాదులో గవర్నమెంట్ ఆఫీసరు. రెండుచేతులా సంపాదించడం అంటే ఏమిటో ఆయన ఇల్లు చూస్తే తెలుస్తుంది. బట్టలు ఉతికే మిషన్ నుంచి... బూజు దులుపుకునే మిషన్‌దాకా, ఆ యింట్లో అంతా విదేశీ సరుకే. మరో తాజ్‌మహాల్ లాంటి ఇల్లు కట్టి, అత్తమామల చేత ప్రయోజకుడనీ అనిపించుకున్నాడు, అల్లుడు.

కంప్యూటర్‌మీద పసుపూ కుంకుమా పెట్టి పూజ చేసినట్లు కాసుల పేర్లతో, కంటే, ఒడ్డాణాలతో ఆయింట్లో తిరిగే రాజ్యంను చూసే వాళ్లంతా "అదృష్టవంతురాలు" అనుకుంటూ ఉంటారు. తనకు తానుగా "నా అదృష్టం మండినట్లే ఉంది" అని మొహం పక్కకి తిప్పుకుంటుంది రాజ్యం. ఆ వెంటనే పట్టుచీర చెంగుతో కళ్లొత్తుకుంటూ వుంటుంది.

ఇరవై మూడేళ్ల కాపరంలో పదకొండుసార్లు 'చేదుమాత్ర'లే మింగింది రాజ్యం నలుగురు పిల్లలు భూమ్మీదపడి గర్భశోకం పెడితే... మిగిలినవి గర్భస్రావాలుగానే జరిగిపోయినై.

పదకొండుసార్లూ సాంబయ్యా, కాంతమ్మా కూతురి దుఃఖానికి ప్రత్యక్ష సాక్షులుగా మారిపోయారు.

అయినా, జీవితం పట్ల వాళ్ల దృష్టిలో మార్పేమీ రాలేదు; ఈ సంభవాలు వాళ్ల మనసుల మీద తీవ్రమైన ప్రభావాన్నీ కలుగజేయలేదు.



ఉయ్యాల బల్ల మీది నుంచి దిగి వంటింట్లోకి నడిచేదు, సాంబయ్య.

నిన్న ఉదయం వండుకున్న అన్నపుగిన్నె కుంపట్లో వుంది. పక్కన పీటా,

వెండి కంచం, రాగిచెంబులో నీళ్ళు. ఆ పక్కగా మజ్జిగ గిన్నె; పచ్చళ్ల రాచిప్పలూ వున్నై.

పీటమీద కూర్చున్నాడు. అన్నంతీసి కంచంలో పెట్టుకుని ముద్దలు చేయసాగేడు. క్షణాల తర్వాత కంచాన్ని చేత్తో పట్టుకుని లేచి నిలబడ్డాడు. గబగబా అడుగులు వేసుకుంటూ ఉయ్యాల బల్ల దగ్గరకి వచ్చాడు. దానిమీద నాలుగు మూలల్లోనూ, మధ్యలోనూ అన్నం ముద్దలు వుంచి పెద్దగా వికటంగా నవ్వసాగేడు.

✶ ✶ ✶

సుమతిని మురిపెంగా పెంచి, పెద్దచేసి, బియ్యేదాకా చదివించుకున్నారు కాంతం, సాంబయ్య.

సాగర్‌నీళ్లు ఫలసాయాన్నీ, పొలాల రేటునీ కూడా పెంచుకుపోవడంతో అప్పటికి వాళ్ల సిరిసంపదలు పది పదకొండు లకారాలు దాటినై.

మంచి సంబంధాలకోసం చూసి చూసి చివరికి పాతికేళ్ళు నిండిన తర్వాత సుమతికి పెళ్లి సంబంధం ఖాయం చేశారు. కట్న కానుకలూ పెళ్లి ఖర్చూ కలిసి అరవై వేల పై చిలుకే అయింది.

కూతురి గారామూ, మురిపెమూ... అల్లుడు... పంచముఖేశ్వర్రావుకీ పంచి, చెయ్యి విదిల్చడం నేర్చుకున్నారు దంపతులు. అల్లుడు బొంబాయిలోని వో కంపెనీలో కెమిస్టు.

కాపరానికి వెళ్లిన రెండు నెలలకే నెల తప్పింది సుమతికి. వెంటవెంటనే అచ్చట్లూ ముచ్చట్లూ జరిగిపోయినై. ఏడో నెలలోనే పురిటికోసం పుట్టింటికి వచ్చింది సుమతి. అరచేతిలో నిమ్మపండుగా చూసుకుంటూ, డాక్టర్ల మందులూ, పళ్లూ, ఫలాలూ గుప్పించారు సుమతికి.

నెలలు నిండాయి. పురిటికి నర్సింగ్‌హోమ్‌లో చేరింది సుమతి.

✶ ✶ ✶

తలుపు తెరుచుకొని బయటికొచ్చాడు సాంబయ్య.

పక్కింట్లో రుక్మిణమ్మ కూతురు గొబ్బెమ్మలు చేస్తోంది. రుక్మిణమ్మ ముంగిట్లో కల్లాపిజల్లి రంగవల్లులు తీరుస్తోంది. వీధి చివరగా సాతాని జియ్యరు హరిభజన చేస్తూ వస్తున్నాడు. వీధిలోని మిగిలిన ఇళ్లలోనూ ఆడవాళ్లు లేచి పనిపాటల్లో పడుతున్నారు.

గడపదాటి రుక్మిణమ్మ ఇంటి అరుగువరకూ అడుగులేశాడు సాంబయ్య. తయారైన ముగ్గుల్నీ, తయారౌతున్న గొబ్బెమ్మల్నీ మార్చి మార్చి చూస్తూ వుండిపోయాడు.

క్షణాల తర్వాత గొబ్బెమ్మల్ని ముగ్గుమీద పెట్టి పూలూ, పసుపూ, కుంకుమా చల్లి లోపలికి వెళ్ళిపోయింది రుక్మిణమ్మ కూతురు.

పదినిమిషాలు కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరిగేడు సాంబయ్య. ఆ తర్వాత దొంగచూపులు చూస్తూ రుక్మిణమ్మ ముంగిటిదా నడిచి గొబ్బెమ్మల్ని చెల్లా చెదురు చేసేసి, రెండంగల్లో వచ్చి, తన ఇంటి మెట్టు మీద కూలబడ్డాడు.

మొహాన్ని చేతుల్లోకి తీసుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగేడు.

★ ★ ★

రెండురోజులు నరకయాతన పడినా ప్రసవం కాలేదు సుమతికి. డాక్టర్ దంపతులు... 'చంద్రవదన', 'ముఖ్యప్రాణమూర్తి'.... 'సిజేరియన్' చేసి మగబిడ్డని తీశారు.

కాంతం, సాంబయ్య... ఆనందంతో పసిపిల్లల్లా కేరింతలు కొట్టారు; తల్లిదండ్రులుగా మురిసిపోయారు; తాతా అమ్మమ్మలుగా గర్వం పొందారు.

పదిహేను రోజులైనా తేరుకోలేదు సుమతి. ఒకటి తర్వాత ఒకటిగా అనేక బాధలు : వైద్య సమస్యలు వచ్చిపడినై. సీరియస్ అంటే అల్లుడొచ్చాడు.

సుమతిని హైదరాబాద్ తరలించారు. వెయ్యి దేవుళ్లకి మొక్కుకుని కారెక్కారు సాంబయ్య, కాంతం. సమయం మించిపోయిందన్నారు... పెద్ద డాక్టర్లు. ఆపరేషన్ సరిగ్గా చెయ్యలేదు.... అదే కారణం అన్నారు.

సుమతి చనిపోయింది.

సాంబయ్యా, కాంతం కొయ్యబారిపోయారు.

అంతా అయిపోయింది. డాక్టర్ దంపతుల్ని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టేరు.

తన పెళ్ళాన్ని నిలువునా పొట్టన పెట్టుకున్నారని డాక్టర్లనీ, అత్తమామల్నీ తిట్టి తిట్టి, తల గోడకేసి బాదుకున్నాడు.... అల్లుడు. సుమతి లేకుండా తాను బ్రతకలేనన్నాడు. ఆమె శవదహనం సమయంలో తానూ చితిలో దూకుతానని గుండె పిండుకుని రోదించాడు. ఊరూ వాడా అతని ప్రేమకు ముక్కున వేలేసుకున్నారు.

కాంతంని ఆమె అన్నయ్య వచ్చి వాళ్ల ఊరు తీసుకువెళ్ళాడు. ఇరవై ఏళ్ళ తర్వాత భర్తని వొంటరిగా వదిలి పుట్టింటికి వెళ్ళింది కాంతం.

రెణ్ణెల్లు గడిచినై.

* * *

కరకరలాడుతూ వచ్చాడు సూర్యుడు.

మండుతున్న జ్వాలల్లోంచీ వస్తున్నట్టు నడిచి సాగేడు సాంబయ్య. సాలెవీధి, కాపువీధి, తీర్థంవీధి దాటి చెఱువుకట్ట పక్కగా దొంకదారి పట్టేడు. ఆపైగా వాళ్ల పొలాలున్నై.

కనబడిన ప్రతివాళ్ళతోనూ ఏదో చెప్పబోతున్నాడు. అంతలోనే గ్రుడ్ల నీరు గుడ్డ కుక్కుకుంటున్నాడు. జుట్టు పీక్కుంటూ, గడ్డం నిమురుకుంటూ, మధ్య మధ్యలో క్రిందికి వంగి, నేలమీది గులకరాళ్లను పోగుచేసుకుంటూ అడుగులు వేస్తున్నాడు.

మామిడి తోపులో కొచ్చి చెట్టుకింద కూలబడ్డాడు. గడ్డిపోచల్ని పీకి మునిపంటితో కొరకసాగేదు ఉన్నట్టుండి పక్కనున్న తడిమట్టిని చేత్తో తీసుకొని మొహాన్న కొట్టుకుని పెద్దగా వికటంగా, వికృతంగా గావుకేక పెట్టేదు.

పాలు తీయబోయిన కాంతంని గేదె తన్నింది. మైకం కమ్మినట్లయింది ఆమెకు. ఎక్కడో మనోనేత్రం మూసుకుపోయినట్టయింది. వెన్నెముక విరిగి పోయినట్లయింది. నాడీమండలం నలిగినట్లయింది.

వారం తిరిగి ఆదివారం వచ్చింది.

పంచముఖేశ్వర్రావు పెళ్లి పీటలమీద కూర్చున్నాడు...రెండోసారి. అప్పుడు... ఆశచావని కాంతం సాంబయ్యని విశాఖపట్నం తీసుకు వెళ్తోంది.

పంచముఖేశ్వర్రావ్, సాంబయ్య...ఇద్దరూ మొగవాళ్లే...

ఒకరు భర్త; ఒకరు తండ్రి !!!

(ఆంధ్రసచిత్ర వారపత్రిక - ఏప్రిల్ 22 1983)



# మీరూ మనిషి మనిషికీ చెప్పండీకథ!

సాయంత్రం ఐదున్నరయింది.

అబిడ్స్‌లో కంపెనీ బస్ దిగేడు,సుందరం. చిక్కడపల్లిలో దిగవలసినవాడు... ఇక్కడిదాకా వచ్చేశాడు.

ఏం చేయాలో ఎటుపోవాలో తేల్చుకోలేక చేసిన పని,

జీ.పీ.వో. లోపలికి వెళ్ళి ఒకసారి హాలంతా కలయజూసి మళ్లీ బయటికొచ్చాడు. పుస్తకాల షాపుల ముందు పచార్లు చేయసాగేడు. రకరకాల పుస్తకాలు, పేర్లు చదువుతూ, ముఖచిత్రాలు చూస్తూ అటూ ఇటూ తిరిగేడు.

అరగంట గడిచింది.

రోడ్ దాటి పియమ్‌జీ ఆఫీస్ దాకా నడిచి ఆగేడు. పక్కగా అరటిపండ్ల బండి కనబడింది. రెండు పండ్లు కొని తిన్నాడు.

పేవ్‌మెంట్ మీద నడవసాగేడు. నాంపల్లి చౌరస్తా వచ్చింది. ఇది మరో మజిలీ.

రోడ్లన్నీ రద్దీగా వున్నై. బస్సులు రద్దీగా వున్నై. మనుషులు పరుగెత్తుతున్నారు. వాహనాలూ పరుగెత్తుతున్నై. ఎత్తయిన భవంతుల్లో దీపాలు వెలుగుతున్నై. వాటిలో రకరకాల నీడలు, వాటిక్రింద రకరకాల క్రీనీడలు.

బస్‌లు ఒకదాని వెంట వొకటి సర్రున దూసుకువచ్చి చౌరస్తాకు ప్రదక్షిణంచేసి వెళ్ళిపోతున్నై. పేవ్‌మెంట్ పక్కగా దుకాణాల్లో బేరాలు సాగిపోతున్నై.

"టైమెంత మాష్టారు?" .... ఎవరో అడుగుతున్నారు.

"సాడేసాత్" అని సాగిపోయాడు, రెండో ఆయన.

కాళ్ళు పీకుతున్నట్లనిపించింది సుందరంకి. తలపోటుగావుంది. పావలా ఇచ్చి పల్లీలుకొన్నాడు. ఒక్కొక్క గింజే నోట్లోవేసుకుంటూ బస్‌స్టాప్ దాకా ముందుకు నడిచేడు.

బస్‌వచ్చి ఆగింది. ఎక్కేశాడు.

చిక్కడపల్లికి టికెట్ తీసుకుని బస్‌ని కలయచూడసాగేడు... ఎక్కడన్నా కూర్చునే జాగావుందేమోనని.

సరిగ్గా అప్పుడే అతని కంట్లోపడింది... ముందుగావున్న సీట్లల్లో ఒకదానిలో ...ఆమె!

"రమణి!"... సుందరం పెదవులు గొణుక్కున్నై. గుండెలు జారినట్లయింది. పల్లీల్ని నములుతున్న దవడలు అసంకల్పంగా ఆగి, గిట్టకరచుకున్నట్లయింది. తలపోటు తాటి ప్రమాణానికి లేచింది.

నలువైపులా పరుగులు పెడుతున్న బాధను ఒక్కచోట పట్టి నిలపడానికి ప్రయత్నంచేస్తోంది మనస్సు.

అతని కళ్లముందు ఏవేవో ఆకారాలు మెదలసాగేయి.

వాటిల్లో అతను స్ఫుటంగా గుర్తించగలిగిందల్లా ఒక్కటే!.... అది... తెరచుకుంటున్న మొసలినోరు!!

✶ ✶ ✶

సుందరం ఇంటికి చేరేసరికీ... రాత్రి ఎన్మిమిదిన్నర దాటింది.

అప్పటికే...

అనుకోకుండా వెలువడిన ఎన్నికల వార్తల్లో దిగబడ్డారు... తండ్రి. మాధవయ్యా; తమ్ముడు... రామ్మూర్తీ.

కుశల ప్రశ్నలు అయినై. పరామర్శలు ముగిసినై.

భోజనాల దగ్గర అడిగేడు, మాధవయ్య... "జీతాల రోజున కూడా ఇంత ఆలశ్యమేమిటిరా సుందరం. పిల్లలు నీకోసం చూసి చూసి అప్పుడే పడుకున్నారు."

"అవసరమైన పనిబడింది. ఒక ఫ్రెండ్ ఇంటికి సంతోష్‌నగర్ దాకా వెళ్ళి రావాల్సొచ్చింది." పొడిపొడిగా సమాధానం చెప్పేడు.

ప్రసన్న చురుగ్గా సుందరం కళ్లల్లోకి చూసి, మజ్జిగ పోసి పక్కకి కదిలింది. భార్య చూపులకి తట్టుకోలేక తల దించుకుని భోజనం ముగించాడు, సుందరం.

ఆరుబయట మంచాలు వేసింది ప్రసన్న. వెన్నెల చల్లగా కురుస్తోంది. సుందరంకి మాత్రం చిరుచెమట పట్టింది. రామ్మూర్తి తన పరిస్థితంతా తండ్రికి చెప్పేవుంటాడని సుందరం నమ్మకం.

కాస్సేపు పొడిపొడి మాటలు సాగినై.

ఆ తర్వాత అడిగేడు, మాధవయ్య... "ఉద్యోగమా సలక్షణమైన ఉద్యోగం. ఏఁవిటిరా ఇది సుందరం?... ఇల్లు చూడబోతే అయ్యవారి నట్టిల్లు. కోడలు మెళ్లో నల్లపూసల గొలుసు కూడా పోయింది. పిల్లలిద్దరికీ సరయిన గుడ్డల్లేవు. నువ్వేమో ఒక్క జత బట్టలతో కాలక్షేపం చేస్తావుట; ఆ పిల్లకి నిండా రెండు చీరెలు లేవు. ఏఁ విట్రా ఇదంతా!"

మాధవయ్య గొంతులో బాధ, దుఃఖం, విచారం. అప్పటికే ఆయనకి ఆయాసం వచ్చింది.

"ఇవన్నీ అట్టావుంచు. అన్నం వండుకోడానికి రెండు మంచి గిన్నెలు లేవు; తనకు రెండో లుంగీ లేదు. "– తమ్ముడు.

సుందరం వింటున్నాడు. మాటా పలుకూ లేదు.

ప్రసన్నకూ వినపడుతున్నై... ఈ మాటలు. ఆమె కంచం ముందు కూర్చున్నద్నమాటేగానీ, ముద్ద గొంతు దిగడం లేదు.

"నెలకు ఎంతలేదన్నా ఆరొందలు వస్తయ్‌ట. సంసారం చూడబోతే నిండా మూడు పొట్టలు లేవు. ఇల్లేమో అదృష్టవశాత్తూ వందరూపాయల్లో దొరికె."

"ఇంత ఇంటికే నేను రెండొందల పాతిక కట్టుంటినిగా" అన్నాడు

"మరి. వచ్చేదంతా ఏమైపోతున్నట్టు? లక్షణంగా, ఆనందంగా కళకళ్లాడుతూ బతకాల్సినవాళ్ళు... ఇట్టా హీనంగా పూటలు గడపడం ఏఁవిటో... నాకేఁవీ అర్థం కావడం లేదు. అసలు... ఏఁవిటి నీ ఇబ్బందులు?"

కొంచెం నిగ్గదీస్తున్నట్టుగానే వున్నై తండ్రి మాటలు.

సుందరం ఏఁవీ చెప్పలేదు.

"ఇప్పుడు నేననేదేఁవంటే... అడపాదడపా ఇబ్బంది పడటం, ఖర్చులు ఎక్కువ కావడం, జీతం సరిపోకపోవడం... ఇవన్నీ అందరికీ వుండే బాధలే. కానీ అవన్నీ ఇక్కడ శాశ్వతంగా పీటవేసుక్కూర్చున్నాయే"... తమ్ముడి వివరణ.

"అవును. పెళ్లికాకముందూ ఇదే పరిస్థితి; అయిన తరువాతా ఇదే పరిస్థితి. పోనీ మాకేమన్నా పావలా, అర్థా అన్నా సహాయం చేస్తున్నావా అంటే అదీ లేదాయె. రిటైరయి, మీ అమ్మా, నేనూ, చంద్రం... ఏదో అక్కడే కాలక్షేపం చేస్తుంటిమి. ఒకరికి పెట్టాలా, పోయాలా? ఏఁవీలేంది ఏఁవిటీ పరిస్థితి? తమ్ముణ్ణే చూడు. వాడు మాత్రం... ఎన్ని బరువులు మోస్తున్నాడు? బావమరిది చదువా? వాడికీ ముగ్గురు పిల్లలా? అదేమంటే... వాడికి పై సంపాదన వుందంటారు, పోనీ అది... అది వదిలేయ్. నెలకు ఆరొందల చిల్లర తెచ్చుకొనే సాటివాళ్లంతా ఇలాగే చేస్తున్నారా సంసారాల్ని?"

మంచి నీళ్ల చెంబూ, గ్లాసూ తెచ్చి మంచం ప్రక్కగా వుంచి లోపలికి వెళ్లింది ప్రసన్న.

మాధవయ్య తన ఘోషని మళ్లీ మొదలెట్టాడు. "అటు మీ అత్తా మామలు, బావమరదుల దృష్టిలోనూ, ఇటు మనవాళ్లందరి దృష్టిలోనూ, నువ్వంటే ఎంత

చులకనో నీకు తెలుసు గదా. అసలేంవిటి దీనికంతా కారణం? పోనీ, ఏవైనా అలవాట్లున్నాయా అంటే అదీలేదాయె. సిగరెట్టు ముట్టుకోవు, కాఫీ తాగవు. ఎనిమిదేళ్ల నుంచీ గుండెలమీద కుంపటిగానే వుంది... నీ పరిస్థితి నాకు. ఆ పిల్లను చూస్తుంటే నాకు కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నై. మానానికి మగ్గే పిల్లగనక... రోజులు గడుపుకొస్తోంది... సంసారాన్ని బజార్న పడేయకుండా. గోగుకాడలా దాన్ని చూస్తుంటే... నాకే కడుపు చెరువైపోతోంది. ఇక వాళ్ల పుట్టింటి వాళ్లకెలావుంటుందో ఆలోచించు."

మామిడి ముక్కలు పళ్లెంలో తెచ్చి అక్కడ ఉంచి పక్కనే గడపలో కూర్చుంది ప్రసన్న.

తండ్రో, తమ్ముడో పండ్లు తెచ్చేరని గ్రహించాడు సుందరం.

అర్ధగంట గడిచింది.

"మనం ఎన్ని మాట్లాడినా, ఏం చెప్పినా, బ్రతిమాలినా, బామాలినా... వాడు ఉలకడు, పలకడు.సంగతేంవిటో చెప్పడు. పోనీ అసలు నీ బాధేంవిటో చెప్పరా... ఒక్కసారి విరగడ చేయడానికి ప్రయత్నిస్తానని... ఎంతగా నెత్తీ నోరూ కొట్టుకున్నా... ఏంలేదులే అంటాడు. ఏంవిటో... నేను మాత్రం ఏంచేసేది?" రామ్మూర్తి వేష్ట పడ్డాడు.

మామగారివైపు, మరిదివైపు జాలిగా చూసింది. "అది నాకే తెలీదు. మీకేం చెప్తారు" అంది. ఖాళీ పళ్లేల్ని తీసుకొని లోపలికి కదిలింది. ఆమె వెళ్లి గుమ్మానికి అవతల నిలబడింది.

కోడలివైపు పరీక్షగా చూశాడు మాధవయ్య. ఆకు దూసేసిన చిటికేశపు కొమ్మలా ఉంది ఆమె!

ఆ తర్వాత చాలాసేపు మాధవయ్య తనని గురించి మాట్లాడేడు. జీవితంలో తాను ఎదుర్కొన్న కష్టాలూ, అనుభవించిన చేదు ఘటనలూ, స్వశక్తితో కుటుంబాన్ని ఒకస్థితికి తీసుకురావడానికి చేసిన ప్రయత్నాలూ.... అన్నీ ఆయన మాటల్లో

వివరంగా దొర్లిపోయినాయి.

అప్పుడు సంభాషణ... అప్పులూ, ఆదాయాల మీదికి మళ్లింది.

నగర జీవనంలో చుట్టుపక్కల వుండే ఆకర్షణలకి లోనుకావడం, అందులోనూ ఆ వయసులో ఉండే సహజమైన వ్యామోహాలుండడం... వీటన్నిటిగురించి కూడా.... తనకు తాను చెప్పుకుంటున్నట్లుగా... సుందరంకీ, రామ్మూర్తికీ చెప్పాడు, మాధవయ్య.

ఈ ప్రసక్తి వచ్చినప్పుడు ప్రసన్న అన్నది, "అట్లాంటి అదృష్టం మాత్రం ఎక్కడిదీ? ఇల్లు చూశారు గదా... కూర్చునేందుకు రెండు కుర్చీలు లేవు కనీసం. మేము సినిమా చూసి ఆరు నెలలయింది. ఇంక నా బొంద- ఆకర్షణలూ, వ్యామోహాలూ గురించి చెప్పుకోవడమెందుకూ?"

ఆమె మాటల్లోని నిర్వేదం అర్థమైంది మాధవయ్యకు. రామ్మూర్తికి అదేమీ కొత్త భోగట్టా కాదు. అతను హైదరాబాద్‌లోనే శ్రీనగర్ కాలనీలో ఉంటూ అన్నావదినల పరిస్థితిని బాగా విశదంగానే ఆకళింపు చేసుకున్నాడు.

మరికొంత సేపటికి అన్నది ప్రసన్న. "తలకుమించిన అప్పుల్లో ఇరుక్కుపోవడమే ఈ బాధలన్నిటికీ కారణమని చెప్పుకున్నప్పుడు, ఆ ఊబినుంచి బయటకి లాగడానికి మా వాళ్ళు చేసిన ప్రయత్నాలు తెలుసుగదా మీకు? ఆ తర్వాత మాత్రం ఏమైంది? మళ్లీ మామూలే ఈ కథ."

ప్రసన్న మాటల్లోని దెప్పిపొడుపునీ, ఆసమయంలో ఆమె తనకేసి చూసిన చూపుల్లోని వేడినీ గ్రహించిన సుందరం చివాలున లేచి విసురుగాలోపలికెళ్లిపోయాడు.

ఎంతసేపు మాట్లాడుకున్నా ఆ ఆలోచనలు విడిపడేవికావని మాధవయ్యకూ, రామ్మూర్తికీ, ప్రసన్నకూ తెలుసు. సంభాషణంతా తండ్రీ కొడుకుల మధ్య సాగుతుంటే ప్రసన్న లాంఛనంగా మధ్య మధ్యలో ఏదో అంటూ కూర్చుంది.

జవాబు తెలీని ప్రశ్నల్ని ప్రశ్నలుగానే మనసుల్లో నొక్కి పట్టుకొని ఆ చర్చని విరమించారు.

ప్రసన్న గదిలోకి వచ్చేసరికి... కళ్లు మూసుకొని పడుకొని ఉన్నాడు సుందరం. "నిద్ర పట్టిందా?" అడిగింది ప్రసన్న. సుందరం కళ్ళు తెరవలేదు, మాట్లాడలేదు. చాపమీద పిల్లల పక్కన నడుంవాల్చింది ఆమె.

నిజానికి సుందరం మేలుకొనే ఉన్నాడు. జరిగిన చర్చ అతనిలో చాలా అశాంతిని రేకెత్తించింది. తన అసహాయతకు, తనమీద తనకే జాలి, విచారం, సానుభూతి, అసహ్యం కలుగుతున్నాయి సుందరంకి.

అతని అంతరాంతరాల్లోని సంఘర్షణ కంటి మీద కునుకును కరువు చేసింది.

ఒక రాత్రి వేళ....

ఇంటి బయటికొచ్చి దొడ్లోకి వెళ్లి నూతి గట్టుమీద కూర్చున్నాడు సుందరం. దూరంగా లారీలు దూసుకుపోతున్న చప్పుళ్లు; ఒకటీ అరా వివరం లేని సవ్వళ్లు.... వినపడుతున్నై.

"అవును... నన్ను నేను క్షమించుకోలేని పరిస్థితిలో పడిపోయాను. వాళ్ళంతా అనేదాంట్లో తప్పులేదు. అదంతా... వారికీ తన బతుకు పట్ల ఆందోళనా, తనపట్ల అభిమానం. ఇది తనకు తెలుసు. ఆ ఆందోళనకు మూలకారణమైన సమస్య గురించి మాత్రం తనకు మాత్రమే తెలుసు!"

ఇలా అనుకోగానే సుందరం వెన్ను జలదరించింది. గుండెలు బిగపట్టినట్లయింది. అతని కళ్లముందు ఏవేవో ఆకారాలు మెదలసాగేయి. వాటిల్లో అతను స్ఫుటంగా గుర్తించగలిగిందల్లా ఒక్కటే!.. అది తెరచుకుంటున్న మొసలి నోరు.!

అవును. అతి తెలివితక్కువ తనంతో తానా మొసలి నోట్లో చిక్కుకున్నాడు. అప్పట్నుంచి తన బతుకు బోనులో పడిన ఎలుకపిల్ల బతుగ్గా మారిపోయింది.

అప్పట్నుంచి... ఎన్నో రాత్రులు తను తన ప్రాణం తీసుకోబోయాడు. కానీ, అది మరింత మూర్ఖత్వంగా తోచి ఎప్పటికప్పుడు ఆ ప్రయత్నాన్ని విరమించుకుంటూ వస్తున్నాడు. 'విరమించుకోవడం కాదేమో' బహుశా... వాయిదా వేసుకుంటూ వస్తున్నానేమో.. అనిపించింది. సన్నగా నవ్వుకున్నాడు, సుందరం.

నీరసంగా కూర్చుండిపోయిన సుందరంకి ఒక్కసారిగా ఆరోజు గుర్తుకొచ్చింది. అవును, ఆరోజు – అప్పటికింకా తాను బ్రహ్మచారి.

తన సహోద్యోగి ప్రసాద్‌తో కలిసి ఏదో రిక్రియేషన్ క్లబ్‌కి వెళ్లాడు. ప్రసాద్ పేకాట ఆడతాడు. ఆరాత్రి బాగానే సంపాదించాడు అతను. బాగా పొద్దుపోయిన తరువాత... ఇద్దరూ ఆటోలో బయలుదేరారు. ఇద్దరూ ఉండేది ఒకచోట. కాని, ఆటో మరోదారి పట్టింది. తన జీవితానికి అదే మలుపయిపోయింది. ఆటో ఆగిన తరువాత తాను ముందడుగు వేస్తూ తనను ఆఇంట్లోకి ఆహ్వానించాడు, ప్రసాద్. క్షణాల తరువాత తెలిసిపోయింది తనకు... అప్పుడు తానెక్కడ ఉన్నదీ. ప్రసాద్ చేసిన పనేమిటో. అతనాయింటికి పాత కాపు. జీవితాన్ని రుచిచూడమని తననో గదిలో వదిలేసి పక్కకి పోయాడు ప్రసాద్. తనను చేయి పట్టుకొని లాక్కుని తనలో చేర్చుకుంది ఆమె! ఆమె... రమణి!! ఆ తరువాత తనకేమీ తెలియదు. మళ్లీతాను ఆవైపు వెళ్లనూలేదు. ప్రసాద్‌ని తిట్టాడు. ఆ పనినీ, అతన్నీ ఏవగించుకున్నాడు. తనను తాను అసహ్యించుకున్నాడు. కాని... జీతాల రోజున... తను బయటికి వస్తుంటే ఒక గళ్ల లుంగీవాలా, ఒక కసాయి... గేటు బయట నిలవేశాడు. చెయ్యి పట్టుకొని ప్రక్కకు లాక్కుపోయాడు. ఒక ఇరానీ హోటల్లో 'టీ' ఇప్పిస్తూ చెప్పాడు. నెల నెలా మూడొందలు తనకివ్వాలి. అదంతే. ఎందుకంటే... ఇందుకూ" అంటూ ఒక పాతిక ఫోటోలు తనముందుంచాడు. తనకు కళ్ళు బైర్లు కమ్మినై. కాళ్లూ, చేతులూ చల్లబడినై, వాటన్నిటిలోనూ తానూ, రమణి... నగ్నంగా...వివిధ భంగిమల్లో కనిపిస్తున్నారు! 'అన్యాయం, దారుణం, దుర్మార్గం' అని గొంతెత్తి అరవాలనిపించింది. కాని, అతను తన డొక్కల్లో బొటనవేలిని నొక్కి... "ఎట్లాంటి పిచ్చిపనులు చేసినా డొక్క చీరేస్తాం, జాగ్రత్త. ఉద్యోగం పోవడమే కాదు, సరాసరి పై టికెట్టు కొనిస్తా"

అని హెచ్చరించాడు. ఆ రాత్రి ఖాళీ జేబుల్తో ఇంటికి చేరి ప్రసాద్‌ని అనరాని మాటలు అన్నాడు తాను. ప్రసాద్ చాలా తేలిగ్గా నవ్వేశాడు. "పెద్ద మునిగిపోయిందేమీలేదు. అడపా దడపా వెళ్తూ వాళ్ల 'కస్టమర్' గా ఉంటే ఇలాంటి అవస్తేం ఉండదు. నే చెప్తాలే" అన్నాడు, రోగ్! తాను జుట్టు పీక్కున్నాడు. తల పగలగొట్టుకున్నాడు, ఏడ్చాడు, సిగ్గుపడ్డాడు, చెంపలు వాయించుకున్నాడు! కాని, ప్రసాద్ మాట వినలేదు! మళ్లీ ఆగడప తొక్కలేదు. తనకంతటి మహాబలం ఎక్కడిదా అని, ఎలా వచ్చిందా అని ఎన్నో సార్లు ఆలోచించాడు. జవాబు దొరకలేదు. కాని, అది నిజంగా నిలిచింది!

ఆతరువాత చాలా సార్లు, ఆ ఉద్యోగం మానేసి అడ్రస్‌లేకుండా ఆ ఊరు వదిలి వెళ్లిపోవాలనీ అనుకున్నాడు. కాని, అంతలోనే పెళ్లి జరిగిపోయింది. తనొక గుదిబండకు కట్టివేయబడ్డాడు. ఉద్యోగం వదిలేస్తే కలిగే పర్యవసానాలు... భయపెట్టినై. బదిలీకి అవకాశం లేదు, తమ కంపెనీకి బ్రాంచీలు లేవు. అప్పట్నుంచీ తన కష్టార్జితం గద్ద తన్నుకుపోతూనేవుంది! తిన్న పంజాదెబ్బనుంచి కోలుకోలేకుండానే ఉన్నాడు, తను.!

ఇంట్లోకి వచ్చేశాడు సుందరం. ప్రసన్న లేచి ఉంది. మాట్లాడకుండా తన పక్కమీద వాలేడు. జాలిగా భర్తవైపు చూసి అతనికేసి కదిలింది, ప్రసన్న!

బెరుగ్గానే భర్తపక్కకు చేరింది, ప్రసన్న. అతను గోడవైపు తిరిగి పడుకుని ఉన్నాడు.

లాలనగా అతని భుజంమీద చేయి వేసింది. అతను చలించలేదు. నెమ్మదిగా కుడిచేత్తో అతన్నీ, ముఖాన్నీ స్పృశించింది. అతని కళ్లలోని చెమరింపు నులివేడిగా తగిలింది. ప్రసన్న మనస్సు జాలితో కరిగిపోయింది.

అతన్ని తనవైపు తిప్పుకొని గట్టిగా కౌగలించుకొనేసరికి... ఆమెలోని బేలతనం... బావురుమనకుండా ఉండలేకపోయింది.

తన మనస్సులాగే ఆమె మనస్సూ, అనేక రకరకాల వేదనలతో కలిసి, వివశమైపోతోందని గ్రహించగలిగేడు... సుందరం.



తెల్లవారుతూనే వెళ్లిపోయారు తండ్రీ, రామ్మూర్తీ. నాలుగురోజులు రామ్మూర్తి ఇంట్లో ఉండి పల్లెకు పోతానని చెప్పి సెలవు తీసుకున్నాడు మాధవయ్య.

* * *

ఆ మరునాడు...

ఆఫీసులో... ఉద్యోగులు ఏదో నాటకం వేస్తుంటే కూర్చుండిపోయాడు సుందరం.

ఆ నాటకంలో ఒక పాత్ర... అతనికి బాగా నచ్చింది. అతనొక... ఎం.ఏ. నిరుద్యోగి. ఉద్యోగ ప్రయత్నాల్లో విసిగి వేసారి, పట్టువదలిన విక్రమార్కుడై.... చివరికి.... స్వంతంగా పాత పుస్తకాల షాపు తెరుస్తాడు. ఆ బంకులోనే ఒక ప్రక్కగా బిస్కెట్లు, టీ అమ్మకం ప్రారంభిస్తాడు. అతనంటాడు.... "మిథ్యా గౌరవానికి పోకుండా నిజాయితీగా నడి బజార్‌లో మనల్ని మనం అమ్ముకునైనా బతకడంలో నామోషి లేదు. ఈ చచ్చు ఉద్యోగాలకంటే, పచ్చి మిరపకాయ బజ్జీల వ్యాపారం చాలా అనువైన సంపాదనా మార్గం."

ఈ మాటలు సుందరం మనసును కదిలించినై; గుండెను కుదిపినై; మేధస్సును మథించసాగినై.

ఏదోఒక నిర్ణయానికి రానున్నట్లు వడివడిగా నడవడం మొదలెట్టాడు.

నారాయణగూడా చౌరస్తా దాటాడు.

నడిరోడ్డుమీద లారీ ప్రమాదం. జనాన్ని తోసుకుంటూ వెళ్లి చూశాడు. డ్రైవరూ, మరో వ్యక్తి రక్తపు మడుగులో చనిపోయి ఉన్నారు.

అవును... ఆ మరోవ్యక్తి..... గళ్లలుంగీవాలా.

సుందరంకి కళ్లు తిరిగినై. తూలి పడబోయి నిలదొక్కుకున్నాడు.

అతనికళ్లముందు... ఒక్కసారిగా గజేంద్రుణ్ణి పట్టిపీడిస్తున్న మొసలిమీదికి విడిచిన విష్ణుచక్రమే కనిపించసాగింది.!

పూనికగా అడుగులు వేసుకుంటూ ముందుకు కదిలేడు.

"నడిబజార్లో మనల్ని మనం అమ్ముకునైనా బతకడంలో నామోషీ లేదు"...

ఈ మాటలే అతని చెవుల్లో మారుమ్రోగసాగినై.

ఈ మాటల వెనగ్గా... అతని చూపులకెదుట... నిరుద్యోగి ఎం.ఏ.!

అతని చూపు ఇప్పుడు రేపటివైపు సంధించి ఉంది!

మొసలి మరణం యాదృచ్ఛికం కావచ్చుగాని, సుందరం నిర్ణయం మాత్రం... ఇసుక తిన్నెమీద లేచిన ఇంద్రభవనం కాదు!

పొరపాటునగానీ, గ్రహపాటునగానీ... తన అడ్రస్ తెలిసే అవకాశంలేని ఊరు సుందరం మేధస్సులో... చుక్కలా పొడసూపింది!

అవును.... సుందరం పిరికివాడైతే కావచ్చుకానీ, అతనిప్పుడు కాలిలో ముల్లు, కంట్లో నలుసు తీసేసిన హాయితో ఊపిరి పీల్చుకున్నాడు.!

తన మేధస్సులోని చుక్కతో ఒకే ఒక్క కోరికను ఆబగా, ఆత్రంగా, ఆర్ద్రంగా, ఆవేదనగా అడిగేడు.... "మనిషి మనిషికీ చెప్తావుకదూ, ఈ కథ?!"

(ఆంధ్ర సచిత్రవారపత్రిక, 5 ఆగష్టు 1983 )

✶ ✶ ✶



# ఉద్యోగం

ఎదురుగావున్న గోడగడియారంకేసి చూసింది మాలతి.

అప్పుడు సరిగ్గా ఐదునిమిషాలు తక్కువ పది అయింది.

హాయిగా ఊపిరి పీల్చుకుని, సీట్లో వెనక్కు వాలింది. లైబ్రరీ వారికి తిరిగి ఇవ్వాలని తెచ్చిన వీక్లీని చేతిలోకి తీసుకొని మళ్లీ ఓసారి తిరగేయసాగింది.

గడియారం పదికొట్టింది.

బజర్ వినిపించింది.

వీక్లీని పక్కన పడేసి లేచింది మాలతి. షార్ట్‌హ్యాండ్ నోట్‌బుక్ పెన్సిల్ తీసుకొని మేనేజర్ రూంలోకి నడిచింది.

"గుడ్‌మార్నింగ్" చెప్పింది.

అవతలివేపు నుంచీ చిన్న తల వూపు. దాని అర్థం ఆమెకు తెలుసు.

బసవరాజు చాలా "సీరియస్"గా ఉన్నట్టు!

ఇలాంటి సందర్భాల్లో పదిగంటలకల్లా సీట్లో లేకపోయినప్పుడు సంభవించిన పరిణామాలు ఆమెకు గుర్తుకొచ్చినై.

అవన్నీ... ఉరుములు, మెరుపులు, ఫిరంగి మోతలు! క్రమశిక్షణమీదా, "పంక్చుయాలిటీ"మీద, ఉద్యోగ ధర్మంమీదా..."ప్రి రికార్డెడ్ కాసెట్"లోని ఉపన్యాసాలు అవి!

ఇవాళ వాటిని వినే అవస్థ తప్పింది. ఇవాళ వాటిని భరించే బాధ తప్పింది. ఇవాళ వాటిని గురించి సాయంత్రందాకా ఆలోచించే అవసరం తప్పింది.

ఇవాళ తను సరియైన టైమ్‌కు ఆఫీసుకు చేరుకుంది.

మేనేజర్‌కేసి నెమ్మదిగా తలెత్తి చూసింది మాలతి.

సిగరెట్ పొగని గట్టిగా వదుల్తూ కిటికీలోనుంచీ ఆకాశంకేసి చూస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు బసవరాజు.

బట్టతలమీద ఎడారిలో గడ్డిపోచల్లా మిగిలిన ఒకటి రెండు వెంట్రుకలు... గాలికి కదులుతున్నై. ముఖంలో గాంభీర్యం, కళ్లల్లో తీవ్రతరమైన ఆలోచనా తరంగాలు.

కుడివైపు - కంటిఅద్దాల కిందుగా బయల్దేరి రెండు పెదవులూ కలిసిన చోటువరకూ వ్యాపించిన సన్నని కత్తిగాటు తాలూకు మచ్చ!

ఎప్పుడో... మంచి మూడ్‌లో వుండగా చెప్పాడు. చిన్నప్పుడు చాలా దుడుకు స్వభావమంట తనది. చెట్టుమీదకెక్కిన మిత్రుడు.. కింద నిలబడి చేతులు సాచి మెడలు రిక్కిరించుకుని చూస్తున్న తనకు - ఎంతసేపటికీ జామకాయని పడేయకపోగా వాడు తిని ఆనందిస్తూ కూర్చుంటే... కొట్లాటకు దిగి వాడితోతలపడ్డాట! దాని చిహ్నం అది!

ఆ సంఘటనని వర్ణించి చిత్రంగా నవ్వేడు, బసవరాజు. బాల్య స్మృతులు తలపుకువచ్చి ఏమేమో చెప్పుకుపోయాడు, అప్పట్లో తన మొండి తనం గురించి.

"కనబడుతూనే వున్నై లక్షణాలు... ఇప్పుడూనూ!" అనుకుని లోలోపల నవ్వుకుంది... తానా వేళ!

"యూ టేక్ దిస్..." అనే పిలుపుతో ఈ లోకంలో పడింది మాలతి. పుస్తకంమీదకి ఆనింది పెన్సిల్

సిగరెట్ మసిని "యాష్ ట్రేలో విదిలిస్తూ తన డిక్టేషన్ సాగించేదు బసవరాజు.

లెటర్ అయిపోయింది. మాలతి లేచి తన గది లోకి వచ్చింది.

టైప్ రైటర్‌లో కాగితాలు అమర్చింది. ఆమె వ్రేళ్లు నాట్యంచేయసాగినై. క్షణాల్లో లెటర్ తయారైపోయింది.

చదివి చూసుకుంది. తనను ఈ సంవత్సరం ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ

ఊరినుంచి బదిలీచేయవద్దని డైరెక్టర్‌కి చాలా ఘట్టిగా రాసుకున్న విన్నపం అది!

సన్నగా నవ్వుకుంది మాలతి. లెటర్ తీసుకుని ఛాంబర్‌లోకి వెళ్లింది.

ఫోన్లో మాట్లాడుతున్నాడు బసవరాజు...

కూర్చుంది.

విషయం అర్థమౌతూనే వుంది. ఉత్తరంలోని విషయాల్నే డైరెక్టర్‌గారికి మనవి చేసుకుంటున్నాడు.!

బసవరాజు ముఖకవళికల్ని చూసీ చూడనట్లు గమనిస్తూ, లెటర్‌కేసి చూపులు మార్చిమార్చి చూస్తూ, గదిలోని వాతావరణంలో ఇరుగ్గా కూర్చుంది... మాలతి.

క్షణాల తర్వాత...

ఆవతలవైపు నుంచీ ఏదో అడగబడినట్లూ, దానికి సమాధానంగా బసవరాజు చాలా చాలా వినయంగా, ఆనందంగా, హాయిగా నవ్వేస్తూ... "యస్. యస్ సర్ అదేమంత కష్టంకాదులెండి. అలాగే తప్పకుండా. ష్యూర్. తప్పకుండా చేస్తాను. ఉంటాను సార్" అంటూ తన అంగీకారాన్ని పుష్కలంగా వెదజల్లుతున్నట్లూ... అర్థమైంది మాలతికి.

బసవరాజు ఫోన్ పెట్టేశాడు. సిగరెట్ వెలిగించుకుని 'లెటర్' చూశాడు.

పైనుంచీ క్రింది దాకా అతి శ్రద్ధగా జాగ్రత్తగా చదవసాగేడు.

ప్రాణాలు ఉగ్గబట్టుకుని కూర్చుంది మాలతి. ఉత్తరం సంతకమైంది. "యూ సెండ్ దిస్ అవే" అంటూ ఆమెకేసి తోశాడు.

'హమ్మయ్య' అనుకున్నట్లు ఊపిరి పీల్చుకుని అతి త్వరగా లేచి బయటికి వచ్చేసింది మాలతి.

'మొదటి ప్రమాదం నుంచీ రక్షింపబడ్డాను'. అని తనలోతానే అనుకొనే సరికి సన్నగా నవ్వొచ్చింది.

ఉత్తరాల్ని భూతద్దంలోంచీ చూస్తాడు బసవరాజు. కామాలూ, సెమీకోలన్‌లూ సరిగా రాకపోయినా సరే. ఇక ఆ రోజంతా... క్షణక్షణమూ... చిరాకూ, విసుగూ, చీదరింపూ... వీటన్నిటితోపాటు ఛాంబర్‌లోకి వెళ్ళినప్పుడల్లా కరకరలాడే హెచ్చరికలూ.. దుముకుతూ ఉంటై ఆయన నోట్లోంచి.

"కుడి ఎడమల డాల్‌కత్తులూ, నోట్లోంచీ ఎప్పుడూ లెక్చర్లూ... ఆయన దగ్గర పని చేయడం కంటే, సెంటర్లో పచ్చి మిర్చి బజ్జీలు అమ్ముకోవడం మంచిది" అంటూ వుంటాడు చంద్రబాబు.

అతను నలభై రోజులు ఆ సీట్లో పనిచేశాడు. ఆ అనుభవం తాలూకు వ్యాఖ్యానం అది!

తానువచ్చి రెండేళ్లయింది.

ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఆయన డిక్టేషన్ 'పర్‌ఫెక్ట్'గా ఉంటుంది. మనిషి కొంచెం"ఫెస్టిడియస్"! అంతే స్టెనోగా తన అభిప్రాయం ఇది!

ఉత్తరాన్ని పంపి, ఫైలు తిరగేయసాగింది మాలతి.

దేశంలోని చాలా పెద్ద కంపెనీల్లో ఒకటైన తమ కంపెనీకి- ఇక్కడి ప్రాంతీయ కార్యాలయ పరిధిలో పనిచేస్తున్న చాలా మంది ఆఫీసర్లకు సంబంధించిన రహస్య భోగట్టా కలిగిన ఫైలు అది! వారంతా బసవరాజు ఆధీనంలోని పావులు.

బసవరాజు బదిలీకి సంబంధించిన ఈ ఆర్డింపు కాపీనీ... ఆ ఫైల్‌లోనే వేసింది మాలతి.

వెనకటి కాగితాలు తిరగేస్తుంటే, బసవరాజు వ్యక్తిగత జీవితం గుర్తుకొచ్చింది మాలతికి.

తన పదహారో ఏట ఈ కంపెనీలో 'బాయ్, గా చేరేట్ట బసవరాజు. ముప్పై ఎనిమిదేళ్ల సర్వీసు. 'బాయ్' నుంచి జనరల్ మేనేజర్ వరకూ ఎదగడం! ఎంత సుదీర్ఘమైన యాత్ర అది! పరమపద సోపాన పటంలో కేవలం నిచ్చెనలే ఎక్కుతూ వచ్చేదన్నమాట! అవును ఎక్కడ, ఏపాము నోట్లో పడివున్నా; ఇప్పుడీ అంతస్తుకి

రాగలిగేవాడు కాదు. ఇదంతా... తనశక్తి యుక్తులూ, సామర్థ్యం, నేర్పు, చాకచక్యాల వల్లనే సాధ్యమైందనే గర్వం వుంది బసవరాజుకు, ఆయన అహంలో అర్థం వుందనే అనిపించింది, మాలతికి.

బజ్జర్ మ్రోగింది.

మాలతి లోపలికి వెళ్ళింది.

ఆఫీస్ సర్క్యులర్ ఒకటి చెప్పాడు బసవరాజు. దాన్ని పూర్తిచేసి లోపలికి వెళ్ళేసరికి మళ్లీ ఫోన్‌లో మాట్లాడుతున్నాడు బసవరాజు

ఆ 'కాల్' ఎక్కడినుంచో... క్షణాల్లోనే తెలిసిపోయింది మాలతికి.

బసవరాజుకి ఆంజనేయుడులాంటి ఒక మేనేజర్ వున్నాడు. అతనా కంపెనీ అమ్మకాల వ్యవహారాలు చూస్తూ వుంటాడు. అతని పేరు హనుమంతరావు. అతన్తోనే ఇప్పుడు బసవరాజు మాట్లాడుతున్నాడు.

"అవును. డైరెక్టర్ గారికి చెప్పాను. మీరు పంపుతారనే 'ప్రామిస్' చేశాను. ఆఁ... అవునవును, మీ పేరు చెప్పకుండా వుంటానా... షూర్... అలాగే... ఆఁ ... అలా చేసేయండి. ఇవ్వాళే అరెంజ్ చేసెయ్యండి. ఓకే".

బసవరాజు ఫోన్ పెట్టేసి, మాలతికేసి చూశాడు. సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు. ప్యూన్‌ని పిలిచి కాఫీకి ఆర్డరిచ్చాడు. అప్పుడు కాగితాన్ని చూడసాగేడు.

మళ్లీ ఉగ్గబట్టి కూర్చుంది, మాలతి.

సంతకం అయింది. ఊపిరి పీల్చుకుంది మాలతి. కాగితాన్ని తీసుకుని ఇవతలికి రాబోయింది.

"మిస్ మాలతీ"... పిల్చేడు.

వెనక్కి తిరిగి నిలబడింది మాలతి.

"డైరెక్టర్ లెటర్‌ని పంపావు కదూ?" అని అడిగేడు.

"యస్ సర్"

"ఓకే" అన్నాడు.

ఆమె తన గదిలోకి వచ్చేసింది.

బసవరాజు రాసిన ఉత్తరంలోని అంశాలు గుర్తుకొచ్చినై మాలతికి.

తనను ఆ ప్రాంతీయ కార్యాలయానికి మార్చిన తర్వాత, ఇక్కడ తను సాధించిన విజయాలూ, వ్యాపారాభివృద్ధికి తీసుకున్న నిర్ణయాలు, ఉద్యోగుల్లో, సిబ్బందిలో నెలకొల్పిన క్రమశిక్షణ, మొదలైన అంశాలన్నిటినీ ముందుగా రాశాడు. ఆ తర్వాత, బదిలీచేస్తే తనకు కలిగే అసౌకర్యాల్ని గురించి రాశాడు. వాటిలో ప్రధానమైన అంశం... తన పెద్దకూతురు పెళ్ళి విషయం. ఈ ప్రాంతాల్లో తప్ప తమ కులానికి చెందిన వరులు లభ్యంకారనీ, తమ శాఖవారు అతి అల్పసంఖ్యాకులనీ...కనుక, ఆమెపెళ్లి పూర్తిచేసే వరకూ తనని ఇక్కడినుంచీ కదలించవద్దనీ అభ్యర్థిస్తూ పూర్తిచేశాడు.

ఏదో గజిబిజి దృశ్యాలు మాలతి మనసును చీకాకు పాలు చేశాయి. తన సంగతి, తన కుటుంబం సంగతి కళ్లముందు మెదిలాయి. తమ పరిస్థితిని యధాతదంగా చిత్రిస్తే 'అంతులేని కథ' కు భిన్నమైన చిత్రం తయారు కాదు. ఇంట్లో ఏ మూల చూసినా చదువుకుంటున్న తమ్ముళ్లు, పెళ్లి కాని చెల్లెళ్లు!

అదృష్టమో, దురదృష్టమో తానింకా ఎవ్వరి "ప్రేమ"లోనూ పడలేదు. అంతే!

ఉన్నట్టుండి చంద్రబాబు చెప్పిన ఒక్క విషయం గుర్తుకొచ్చింది మాలతికి. బసవరాజుకి ఇద్దరు పెళ్ళాలట. ఎవరికూతురో ఈ పెద్ద పిల్ల? సన్నగా నవ్వొచ్చింది మాలతికి. ఏమిటో ఈ సమాజం? అర్థంకాని చిక్కు ముడి – అనిపించింది.

సర్క్యులర్‌ని 'డిస్పాచ్' చేసి ప్యూన్‌ని పిలిచింది మాలతి. వీక్లీని లైబ్రరీ వారికి తిరిగి ఇచ్చేయమని అతని చేతికిచ్చింది.

అతను వెళ్లిపోయాడు.

లంచ్ టైం అయింది. కుర్చీలోంచి లేచింది మాలతి. టిఫిన్ కాఫీ ముగించి

తన రూంకు వచ్చేసరికి చంద్రబాబు, శ్రీనాథయ్యా అక్కడ కూర్చుని వున్నారు.

చంద్రబాబు అన్నాడు. "వీరు తెలుసు గదా శ్రీనాథయ్యగారు. జి.యమ్‌తో మాట్లాడటానికి వచ్చారు"

మాలతికి శ్రీనాథయ్య తెలుసు. తను ఆ సీట్లోకి వచ్చిన తరువాత కనీసం పది సార్లయినా వచ్చి ఉంటాడు. ఆయనకి ట్రాన్స్‌ఫర్ కావాలి. ఆ కారణాన్నే చంద్రబాబు ఆయనతో వచ్చాడు.

మాలతికి విషయం ఇట్టే అర్థమైపోయింది. మేనేజర్ రూమ్‌లోకి వెళ్లి శ్రీనాథయ్య వచ్చినట్లు చెప్పింది.

ఆయన ఫైల్స్ చూస్తూ "ఊ" అని ముభావంగా వూరుకున్నాడు. దాని అర్థం ఆమెకు తెలుసు. కూర్చోనిమ్మని ఆయన భావం.

వెనక్కి వచ్చింది. శ్రీనాథయ్యతో చెప్పింది. చంద్రబాబు వెళ్లిపోయాడు.

శ్రీనాథయ్య మాట కలిపేడు. "నా సమస్య నీకు తెలుసుగా మాలతీ, ఈ ఏడన్నా నాకు మోక్షం వస్తుందోలేదో..."

వయస్సులో మాలతికంటే ఎంతో పెద్దవాడు శ్రీనాథయ్య. అందుకనే ఆయన ఆమెని చనువుగా ఏకవచనంలో సంబోధిస్తాడు.

మాలతికి ఆయన సమస్యలు బాగా తెలుసు. ఆయన ఉండే వూరికి మూడువందల కిలోమీటర్ల దూరంలో ఉద్యోగం చేస్తూ ఉంటుంది ఆయన భార్య. వాళ్లకు ఐదుగురు పిల్లలు. బీటెక్ నుంచీ పదోతరగతి దాకా వారంతా తలా ఒక చోటా చదువులు సాగిస్తున్నారు. పెద్దపిల్ల పెళ్లీడుకొచ్చింది. తల్లి దగ్గర ఉంటుంది. ఆయనకో ముసలి తల్లి ఉంది. ఆమెకు టీబీ జబ్బు. అయినా పల్లె వదిలిరాదు. ఆ పల్లె ఆయన ఊరికి సుమారు రెండు వందల కిలోమీటర్లు. ఆర్థికంగా అంతంత మాత్రం సంసారం.

రెండేళ్లనుంచీ ఆయన బదిలీకోసం బాధపడుతున్నాడు. తానూ భార్య పనిచేసే ప్రదేశానికి వెళ్తే అక్కడికే తల్లిని తీసుకొచ్చి వైద్యం చేయించవచ్చుననీ,

కూతురికి పెళ్లి సంబంధాలు చూసుకోవచ్చుననీ ఆయన ఆశ. ఇన్ని చోట్ల వేరువేరు కుంపట్లని సాగించడం తప్పిపోతే బాగుండునని ఆయన కోరిక.

కాని, అక్కడ ఖాళీ ఉన్నా శ్రీనాథయ్యకు బదిలీ రావడం లేదు. దీనికి యాజమాన్యం చెప్పే కారణాలు కోకొల్లలు. వాటిలో ముఖ్యమైనది... ఆయనకంటే ఉత్సాహవంతుడై, ఏ బాదర బందీ లేని యువకుణ్ణి ఆ ప్రాంతంలో వేస్తే అక్కడ తమ వ్యాపారం బాగా అభివృద్ధి కావడానికి అవకాశం ఉంటుందని! ఈ రెండేళ్లనుంచీ ఈ ఆలోచన ఆలోచనగానే ఉంది!

"ఇదంతా కాగితాల మీద కథ! అసలు వ్యవహారం వేరు. శ్రీనాథయ్యకి లౌక్యం, లౌకికం తెలీవు.!" ఇది చాలా మంది చెప్పుకుని నవ్వుకొనే వాస్తవం. అందుకనే ఆయనకి పన్నెండేళ్లనుంచీ ప్రమోషనూ లేదట.

ఇదంతా మాలతికి తెలుసు. ఆయన పరిస్థితి తలుచుకుంటే ఆమెకు జాలి కలుగుతుంది.

ఈ నిబంధనలూ అవీ ఇలా కొందరికి మాత్రమే ఎందుకు ఏర్పాటవుతాయో, ఏమిటో అని అప్పుడప్పుడూ ఆలోచిస్తూ ఉంటుంది మాలతి. అయితే, ఆమెకు అవన్నీ పూర్తిగా అర్థంకావు. ఆలోచన సాగుతూ ఉండగానే బజ్జర్ మ్రోగుతుంది.

అవును ఇప్పుడూ బజ్జర్ మ్రోగింది.

మాలతి లేచి లోపలికి వెళ్లింది. అంతలోనే బయటికి వచ్చి చెప్పింది. "మీరు వెళ్లండి"

శ్రీనాథయ్య అంతఃపుర ప్రవేశం చేశాడు.

"కాదు అది ఓపెద్ద గ్యాస్ ఛాంబర్" అంటాడు చంద్రబాబు.

సన్నగా నవ్వుకుంది మాలతి.

క్షణాల తరువాత మేనేజర్ రూములోనుంచి తారాస్థాయిలో మాటలు వినిపించసాగినై.

"నావల్లకాదండీ, చెపుతున్నానుకదా. మీ బదిలీ సాధ్యపడేదికాదు. నేను సిఫారసు చేయలేను"

... ఏదో నసుగుడు.

"మీ వ్యాపారం కూడా ఏవీ బాగాలేదు. ఇవ్వాళే డైరెక్టర్ ఫోన్ చేసి మీ గురించి నన్ను నానా మాటలూ అన్నారు."

....శ్రీనాథయ్య మళ్లీ ఏదో గొణిగి ఉంటాడనుకుంది మాలతి.

"ఐతే ఏంచెయ్యమంటారండీ, ఆమెను రిజైన్ చెయ్యమనండి. లేదా మీరు చేయండి. నాకేమీ అభ్యంతరం లేదు".

... ఇవతల ఏదో... సొన....మళ్లీ...

"అవును, నేనుగా పైవాళ్లకి చెప్పను, చెప్పను. అయినా, మీమీద నాకేవీం సానుభూతి లేదు. కారణం - మీ పర్ఫామెన్స్. ఉన్నవిషయం చెబుతున్నాను కదా!"

"కర్కోటకుడు!" మాలతి మనస్సు గొణుక్కుంది.

"ఇవన్నీ అందరికీ ఉన్న సమస్యలేనండీ! మీ తలనొప్పిని నాకు బదిలీ చెయ్యకండి. వెళ్లండి. అసలు నన్నడిగితే... ఈ దేశంలో ఆడవాళ్లకు ఉద్యోగాలిచ్చినంత బుద్ధితక్కువపని ఇంకోటి లేదు. ఉద్యోగం వచ్చేవరకూ నాలాంటి వాళ్లని నానా తిప్పలూ పెడతారు. ఆతరువాత మెటర్నిటీ లీవ్‌లు, ఇతర సెలవులూ, ట్రాన్స్‌ఫర్‌ల కోసం ఘోష... ఇంతేగా! పెద్ద న్యూసెన్స్"

బసవరాజు చిరాకు సరాసరి మాలతి గుండెల్లో తగిలింది. నివ్వెరపోయింది.

"చెప్పానుగా మిమ్మల్ని ఈఏడు బదిలీ చేసే అవకాశంలేదు."

శ్రీనాథయ్య బయటికి వచ్చాడు నీరసంగా, బాధగా, ఉక్రోషంగా, కోపంగా! లోలోపలి వ్యధ తాలూకు చిహ్నాలు ముఖంమీద తాండవిస్తున్నాయి.

"వస్తానమ్మా మాలతీ!" అంటూ నిమ్మళంగా వెళ్లిపోయాడు.

"ఏంవిటో ఈ ద్వంద్వ నీతి!" అనుకుంది మాలతి.

ఉన్మాదంలాటి ఆవేశం ఆమె బుద్ధిని తాడితం చేయ్యాలని చూసింది. కాని, నిగ్రహించుకుంది.

బజ్జర్ మ్రోగింది.

లేచి లోపలికి వెళ్లింది.

"ఉత్త యూజ్‌లెస్ ఫెలో" తనలో తాను అనుకుంటున్నట్లు పైకే అనేసి, వేరే లెటర్ చెప్పడం ప్రారంభించాడు బసవరాజు.

తిరిగి వచ్చి తన సీట్లో కూర్చుంది.

ఆమె మేధస్సులో చాలా ఆలోచనలు గిర గిర తిరగసాగినై.మనస్సు ఎందుకో అస్థిమితంగా తయారైంది. విసుగ్గా, చకచకా లెటర్‌ని టైప్ చేయసాగింది.

✶✶✶

రెణ్ణెళ్లు గడిచాయి....

ఆ ఆఫీసులో, బసవరాజు బదిలీ కాలేదు.

హనుమంతరావుకి ప్రమోషన్ వచ్చింది.

శ్రీనాథయ్య గొంగళి అక్కడ్నుంచీ కొంచెం కూడా కదల్లేదు.

డైరెక్టర్‌గారికి హనుమంతరావు ద్వారా బసవరాజు అరేంజ్ చేసిన వస్తువులు మాలతి కళ్లముందు కదలాడినై.! వాటిని వర్ణించకూడదు.!!!

✶✶✶

రాత్రి....

అమ్మా నాన్నా తన పెళ్లి గురించి మాట్లాడుకుంటుంటే హఠాత్తుగా ఉలిక్కి పడింది మాలతి.

బసవరాజు రూపం కళ్లముందు మెదిలింది. కుడివైపు కంటి అద్దాలక్రిందుగా

బయలుదేరి రెండు పెదవులూ కలిసినచోటువరకూ వ్యాపించిన సన్నని కత్తిగాటు తాలూకు మచ్చ!

ఆయన మాటలు చెవుల్లో మారుమ్రోగినై.

"అలాగైతే ఆమెను రిజైన్ చెయ్యమనండి లేదా మీరే చెయ్యండి. ఈ దేశంలో ఆడవాళ్ళకి ఉద్యోగాలిచ్చినంత బుద్ధితక్కువ పని ఇంకొకటి లేదు"

చెంపమీద చెళ్లున చరిచినట్లయింది మాలతికి. తనకు చూస్తున్న పెళ్లికొడుకు బొంబాయిలో ఉద్యోగం చేస్తున్నాడు.

కొండలాంటి జీవితం ఎదురుగా నిలబడింది.

జీవితాంతం కొండకు ఈవలి వైపునే నిలబడి పోవాలేమో తను?

ఎవరో కళ్లకు గుడ్డకట్టినట్లనిపిస్తోంది. ఇక ఎల్లకాలం చేతులతో వెదుకుతూ తిరుగుతూ ఉండాలేమో! ఎక్కడ? – చీకట్లో, శూన్యంలో!

మాలతి బెదిరింది. ఆమె కళ్లల్లో 'పెళ్లి పందిరి' మసక మసగ్గా కనిపించసాగింది. ఆలోచన.... ఉద్యోగాల్లోని ద్వంద్వ నీతిలో చిక్కుకుంది. ద్వైదీభావంతో ప్రతిమలా కూర్చుండిపోయింది.

కథకి వెంటనే ఎలాంటి ముగింపూ తోచడంలేదు.!!! జీవితానికి ముగింపు ఏంవిటి? కథ జీవితం కాదూ, మరి?!

( ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక 6 అక్టోబర్ 1983.)



# రాతిబొమ్మకు చక్కలిగింతలు

సుబ్బరాయుడు అయ్యవారుగా పనిచేస్తున్నాడు. బుద్ధిజీవి.

బుద్ధిజీవి కనుక అలోచలు దండిగా ఉన్నై. ఆలోచనలున్నాయి కనుక దురాలోచనలూ, దూరాలోచనలు కూడా బుర్రని తొలిచేస్తూ వుంటాయతనికి.

అమావాస్యకీ, పౌర్ణమికీ ఉచ్ఛనీచాల్ని అనుభవించే మానసిక రోగంలా అతని ఆలోచనల్లోనూ, ఉచ్ఛనీచాల స్థాయీ భేదం, అస్తవ్యస్తతా తరచూ గోచరిస్తూ ఉంటాయి.

ఈ "బ్యాక్‌గ్రౌండ్" చాలు - సుబ్బరాయుడు ఆలోచనలతో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకోవడానికి.

ఇవ్వాళ అతను పల్లెకి పోయి వచ్చాడు. పల్లెకి పోయి వచ్చినప్పుడల్లా అతనికి కడుపు రగిలిపోతూ ఉంటుంది. కసిత్వం పెల్లుబికిపోతూ ఉంటుంది.

పల్లెలో అతనికి అన్నీ వికారాలో, ప్రకృతీ వికృతులూ కనిపించినై.

పెద్దిరెడ్డి ఎలపుటెద్దుని కసాయి వాండ్లకు అమ్ముకుంటున్నాడు.

ఎత్తునబద్ద పుల్లావుని చూసుకుంటూ కన్నీరు కారుస్తున్నాడు, ధర్మయ్య.

చేతి గీరలు కనబడే ప్రొద్దున లేచి ఇసుర్రాయి గాలికి పోయినట్టు ఏ పడమటి దిక్కుకో పారిపోయినాడు, బాల్యమిత్రుడు పుల్లారెడ్డి.

ఎక్కిరించినట్టన్నా వస్తావుండే చెర్లోనీళ్ళు సమ్మెచేశాయి. చెరువున్న చోట చెలమన్నా లేదు, పత్తికాయ పగుళ్లులా.

గూడెంలో ఏమనిషికీ - కాకి పీకను కూడా కండలేదు.

రైతును కదిలిస్తే... పడవనేరిస్తే సరి వ్యవసాయం సెయ్యంటున్నాడు.

ఉద్యోగిని పలకరిస్తే "గోలుకొండ ఉద్యోగమూ గొర్రెతోకా ఒకటి"

అంటున్నాడు!

సన్నకారు జీవుల సంగతి సరేసరి. ఎవరెన్ని కబుర్లాడినా "ఒట్టి మాటలేగాని రొట్టిమీదికి తేమ లేదు" అంటున్నారు!

ఇవన్నీ ఒకెత్తు. తాగేదానికి చుక్కనీరు లేదు. బీదా బిక్కీ... గొడ్డూ గోదం... నడుస్తున్న శవాల్లా ఉన్నారు.

సుబ్బరాయుడి గుండె బేజారయి పోయింది.!

సుబ్బరాయుడికి ఎంచబోతే ప్రపంచమంతా కంతల్లా కనిపించింది. రకీమని నాలుగు మినీ కవితలూ.... పది పద్యాలూ రాసి పారేసేదు.

మణీ హోటల్లో కాఫీ తాగి మా ఇంటికొచ్చాడు. కాస్సేపు కవిత్వం వెళ్లబోసుకున్నాడు. ఆ తరువాత కసిత్వం మొదలైంది.

మింగ మెతుకు లేదు, మీసాలకు సంపెంగనూనె అని.... మనకీ సభలూ సన్నాహాలూ ఎందుకంట అసలు. ఆ దబ్బంతా గోదకు కొట్టిన సున్నమే కదా. దాన్నంతా వెచ్చిస్తే ఓ వంద గ్రామాలకి బోరింగులొచ్చేవి కావంటావా? అనే ప్రశ్నతో మొదలెట్టి సభలకు పోయి ఏడ్చినవాళ్లనీ, పోలేక ఏడ్చిన వాళ్లనీ; పోయిన వాళ్లనినీ చూసి ఏడ్చినవాళ్లనీ, పోయొచ్చిన వాళ్ల సన్మానాలు చూసి ఏడ్చినవాళ్లనీ.... అందరి ఏడుపుల్నీ - అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మనల ఏడ్పులతో కలగలిపి రస ప్రవాహకంగా ఏకరువుపెట్టాడు. ఆ తర్వాత సుబ్బరాయుడు కళ్లల్లో రక్తం దిగింది.

"నన్నడిగితే ఈ దేశంలో అత్యధికమయిన నెలసరి జీతం డ్రైవరుకివ్వాల" అంటూ ఊగిపోయాడు. శ్రీశైలంలో బస్సుప్రమాదం గురించి వివరించాడు. "దెబ్బై ఎనబై మంది ప్రాణాల్ని సేతుల్లో బెట్టుక నడుపుతావుంటాడు" అని, డ్రైవర్ల కష్ట నష్టాల్లో పడ్డాడు.

మాయావిడ నిమ్మరసం తెచ్చింది. సుబ్బరాయుడు వాక్ప్రవాహానికి అడ్డుకట్టబడింది. ఆవేశం ఒకింత చల్లబడింది. అప్పటిదాకా ఉచ్చరిస్తున్న "లం...లు" వగైరా సంస్కృత ముక్కల ధాటి తగ్గింది. నిమ్మరసం సేవించాడు.

ఆ తర్వాత... పెరిగిన పాల ధరమీదికి మళ్లింది... సంభాషణ. "ధర పెంచితే పెంచారయ్యా... నీసాలెందుకు పోయినట్టు. పోనీ, కవర్లా కరువైపోయాయా? ఏం దేశమయ్యా ఇది? ఈ దేశానికి మోక్షం లేదుగాక లేదుగాక, లేనేలేదు." అని వాగేసి... మాయల ఫకీరు చూపు విసిరేడు. "తెల్లవారు ఝామునే పోయి క్యూలో నిలబడతానా? నావెనుక ఒక్క వెధవా క్యూ 'మెయింటెయిన్' చెయ్యడు. అంతా 'అన్‌రూలీ' ఫెలోస్! ఈ జనానికి 'సివిక్‌సెన్స్' లేనేలేదు; రాదుగాక రాదు. అందుకనే.... నాలాంటి వాడికి ఒక 'చెర్నాకోల' ఇచ్చి; 'ఈ దేశాన్ని బాగు చేసే బాధ్యత నీది, నువ్వేంచేసినా సరే' అని ఫుల్ పవర్స్ ఇవ్వాల. నాలుగు రోజులు... జస్ట్ నాలుగురోజుల్లో 'షేపులు' మార్చి పారేసి; దడదడలాడించేయనూ!!"

సుబ్బరాయుడి ఛాతి నాలుగంగుళాలు ఉప్పొంగిపోయింది. కళ్లల్లో ఎంత తేజస్సు!

"ఇంతకీ నే చెప్పేది విన్నావా?" పాలని కేన్‌లలో పంపుతున్నారు. ఇక్కడ కొలతల్లో లొసుగు సంగతి ఏం చెప్పను? పెద్ద ట్రాజడీ అది. నాలాంటోడు సీసా పట్టుకెళ్లి గట్టిగా అడిగేడో అంతే సరి. మర్నాటినుంచి మాయావిడ నన్ను గేట్లోకి తోలేస్తుంది. కారణం మరేంలేదు. మర్నాటినుంచి మాకు పాలకు పుట్టగతి ఉండదు. ఇంతే సంగతులు... చిత్తగించవలెను. అయిపోతుంది".

సుబ్బరాయుడు కుర్చీలో అస్థిమితంగా కదిలేడు. ఆ తరువాత కొద్దిసేపు పెరిగిన బస్ ఛార్జీల గురించి తన అభిప్రాయాలు చెప్పేడు.

క్షణాల తరువాత....

'టాపిక్' ని పంచాయితీ ఎన్నికల వైపు మళ్ళించాడు. అట్నుంచీ ఐరిష్ గెరిల్లాలమీదికి దూకేడు; అక్కడ్నుంచి మిట్టరాండ్ పడబోయే అవస్థలకి జాలిపడ్డాడు; ఆపైన చైనా వాళ్లనుంచి మనకు ఇప్పట్లో యుద్ధ ప్రమాదం లేదని ఊపిరి పీల్చాడు; శ్రీహరికోటలో రాకెట్ లాంచింగ్ ఎలా జరుగుతుందో... దాని మార్గం వివరాలు వర్ణించాడు.

ఉన్నట్టుండి అతని వాయిస్ ఫెయిల్ అయ్యింది. నాకేసి చాలా తీక్షణంగా చూస్తూ ఉండిపోయాడు. "ఏమిటి సంగతి?" అని ప్రశ్నించాను... ఆతృతగా... ఏమన్నా అయ్యిందో ఏమో అనే భయంతో. ఈమధ్యనే ఒక హార్ట్ ఎటాక్ కేసును ప్రత్యక్షంగా చూశాను లేండి. గొంతుసరిచేసుకొని అడిగేడు, " ఇప్పుడు జరుగుతున్న సాహిత్య హింసాకాండ గురించి నీ ఉద్దేశ్యం ఏమిటి?" అని.

నేను చాలా దీర్ఘంగా ఆవులించాను, "రేపు మాట్లాడుకుందాంలే" అంటూ లేచాను. అతనూ కదిలేదు. "గొంగట్లో భోజనం చేస్తూ వెంట్రుకలు ఏరుకుంటున్నాం మనం." అన్న నా మాటలకి రియాక్షన్ లేకుండా, ముందుకు నడిచాడు - సుబ్బరాయుడు.

ధన్యోస్మి!!!

(మాసీమ 20 మే 1981.)



# ఒక్క క్షణం

చలికాలం

ఉదయం ఎనిమిది గంటల వేళ ఓపెన్ బాత్‌రూమ్ స్నానం చేస్తున్నాడు పరమేశం.

చలి విపరీతంగా ఉంది. బడబడా రుద్దేసుకుని బుడ బుడా వంటి మీద దిమ్మరించుకుంటున్నాడు చన్నీళ్లు.

మూడవ రౌండు సబ్బు ముఖానికి పులుమేసుకొని కిందకు వంగాడు చెంబుకోసం.

"యురేకా, యురేకా!" వంటగదిలోంచి భార్య కేకలు.

'ఏమై వుంటుందబ్బా? గ్యాస్‌గానీ లీక్‌అయిందా?' ఉన్న పళంగా నీళ్ల బకెట్‌తోనే వంటగదిలోకి పరుగెత్తాడు. కంగారు కంగారుగా ఉంది.

లోపల భార్య నిక్షేపంగా వుంది.

'యురేకా, యురేకా!' అని అరుస్తోంది, నాట్యం చేస్తూ.

"ఏమొచ్చిందే మాయరోగం? ఇప్పటి దాకా బాగానే వున్నావుగా?" అన్నాడు కోపంగా.

"అమ్మయ్య వచ్చేశారా? రండి రండి." సంతోషంగా చేతులు విదిలిస్తూ అంది.

"ఈ బక్కెట్ ఏమిటీ లోపలికి తెచ్చారు!" ఆశ్చర్యంగా అంది.

"నీవేమైనా తగలబడ్డావేమోనని" అన్నాడు విసుగ్గా, అసహనంగా.

"అదికాదండీ నేనండీ... మరండీ... నేనండీ..."

"త్వరగా చెప్పిచావ్వే. కళ్లలో సబ్బుపడి మండుతోంది." కళ్ళు మూస్తూ తెరుస్తూ అన్నాడు.

అయినా తాయారు కోపగించుకోలేదు. తన ఆనందంలో తానుంది.

"గుడ్‌న్యూస్. మీరెళ్లి స్నానం త్వరగా ముగించి రండి చెప్తాను." భర్తను బయటికి తోసింది.

హడావిడిగా స్నానం ముగించి లుంగీ కట్టుకుని లోపలికి నడిచాడు.

అప్పటికే డైనింగ్ టేబుల్ మీద ప్లేట్‌లో అన్నం వడ్డించి భర్త రాకకై నిరీక్షిస్తోంది బుగ్గన చేయిచేర్చి.

"ఏం తాయారు! ఈ పూట స్పెషల్ ఏం చేశావ్?" అడిగాడు వస్తూ...

"యురేకా! యురేకా"

"మళ్లీ ఏం పోయేకాలం వచ్చిందే" దీర్ఘంతీస్తూ...

"ఎందుకండీ ఊరికే మూతి విరిచేసుకుంటారు" అంది కోపంగా. "ఈరోజు మీకోసం సరికొత్త స్పెషల్ కూర తయారుచేశాను. ఎంత కమ్మటి వాసన వేస్తుందో... ఆనందం దాచుకోలేక యురేకా, యురేకా అని అరుస్తే మీరేమో గైమని నోరు చించేసుకుంటున్నారు." మూతి మూడొంకర్లు తిప్పుతూ తనే అంది.

"అబ్బా తొందరగా వడ్డించవే స్పెషల్." లొట్టలు వేస్తూ భార్యవైపు ఆశగా చూశాడు.

వడ్డించింది స్పెషల్.

"ఏమిటే ఇది ఘుమఘుమలాడిపోతోంది."

"తమలపాకుల పచ్చడి."

"ఆ..!" నోరు తెరిచి ఆశ్చర్యంగా చూశాడు భార్యవైపు.

"అవునండీ.. ఎంత కమ్మని వాసన వేస్తుందో..." అని మరికాస్త వడ్డించింది.

"చాలు చాలు ప్రేమ ఎక్కువైతే విషంగా మారుతుంది." భార్య చేతిని

తీసివేస్తూ అన్నాడు.

స్పెషల్‌తో రెండు ముద్దలు లాగిచించేసి గుడ్లప్పగించాడు పరమేశం. వారం రోజుల క్రితం తిన్న తిండి– బోరింగ్ పెట్టి కొట్టినట్లుగా బయటకు తన్నుకొస్తోంది. "పరమశివుడు గరళాన్ని గొంతులో దాచుకున్నాడని విన్నాను. ఈ స్పెషల్ పచ్చడి నాలుకమీద వేసుకుచూడమను", అనుకున్నాడు మనసులో.

"ఏమోయ్ తారూ... వాట్ ఎ వండర్ ఫుల్ టేస్ట్! అద్భుతం, మహా అద్భుతం! నీలాంటి భార్య దొరకటం నూటికి నూరు పాళ్లు నా దురదృష్టం.... ఛ, ఛ కాదు కాదు అదృష్టం! ఈ శుభసమయంలో ప్రేమగా నీకు రెండుముద్దలు తినిపించాలనుందోయ్."

"ఎంత ప్రేమండీ నేనంటే మీకు." మురిసిపోతూ దగ్గరకు వెళ్లింది.

'ప్రేమా, పచ్చిబద్దలా, రెండు ముద్దలు తిని చూడు నరకం గేటు దగ్గరకెళ్లొస్తావ్.' కసిగా అనుకున్నాడు మనసులో.

ప్రేమగా రెండు ముద్దలు తినిపించాడు. మరింత ప్రేమగా మరిరెండు ముద్దలు తినిపించాడు.

ప్రేమ ఎక్కువైతే విషమెలా అవుతుందో బోధపడింది తాయారుకు. మారు మాట్లాడకుండా బయటకు నడిచింది. భర్త మరోముద్ద తినిపించబోతే "భగవాన్, ఏమిటీ ఈ తమలపాకుల పచ్చడి పరీక్ష ?" పైకే అని, బయటికి పరుగెత్తింది తాయారు. కంచంలో చేయి కడిగి లేచాడు, పరమేశం.

బయట వాంతి చేసుకుంటోంది తాయారు.

"ఏవోయ్ తారూ నెలతప్పావేమిటి? ఎంత అదృష్టం నాకు. ఏడుకొండలవాడా, వెంకటరమణా, గోవిందా, గోవిందా! నీ కొండకొచ్చి వెయ్యినూటా పదహారు కొబ్బరికాయలు కొడతాను స్వామీ."

"అబ్బ అరవకండి. నెల తప్పలేదు. సంవత్సరం తప్పలేదు. ముందు మందులషాపుకెళ్ళి వాంతులు తగ్గటానికి మాత్రలు పట్రండి." అంది తల

పట్టుకొంటూ.

ముసి ముసిగా నవ్వుతూ బయటకు నడిచాడు పరమేశం, తాయారుని ముడివేసుకొని మూడు సంవత్సరాలయింది. మేనమామ కూతురవడం వలన ఇష్టంలేకపోయినా కట్టేశారు. తాయారు పెద్దగా చదువుకోలేదు. స్కూల్ ఫైనల్‌ను కాలేజి ఫైనల్‌గా భావించి"చదివి రాజ్యాలేల్నా?"అంటూ చదువు మాన్పించారు ఆమె తల్లిదండ్రులు. తరువాత తాయారు పెద్ద రచయిత్రుల నవలలన్నీ పిండి జల్లించినట్లు జల్లించేసి, నవలా ప్రపంచంలో మకుటంలేని మహారాణి కావాలనే ప్రయత్నంలో, వారంరోజులు వంటమానేసి మొగుణ్ణి మూడుకిలోలు తగ్గించేసింది. పరమేశం ఓ ఐదురోజులు ఆమరణ నిరాహార దీక్ష పూనిన అనంతరం నవలలు రాయటం నిలిపేసి, సరికొత్త వంటలు తయారు చేయటం మొదలెట్టింది.

పరమేశానికి మంగతాయారు పేరు ఇష్టముండేదికాదు. ఇదేమిటి హోటల్ ముందు "భోజనం- తయారు" బోర్డు లాగా అనుకునేవాడు. తరువాత తారు అనిపిలవడం మొదలెట్టాడు ముద్దుగా.

ఆఫీసు పని వొత్తిడివల్ల ఆరోజు ఆలస్యంగా, విసుగ్గా ఇంటికొచ్చేసరికి మంచంమీదా మంగతాయారు ముసుగుతన్ని ఉంది. పక్కనే టేబుల్‌మీద కాఫీ ఫ్లాస్క్.

దగ్గరగావెళ్లి చేయిపట్టుకు చూశాడు. చల్లగానే వుంది. 'మరి ముసుగు ఎందుకేసినట్టబ్బా' ఆలోచిస్తున్నాడు.

"ఒంట్లో బాగాలేదా అలా పడుకున్నావు," అడిగాడు.

ముసుగు తొలిగించి ఒక్కసారి తీక్షణంగా చూసి మరోవైపుకు తిరిగి పడుకుంది.

తల ప్రక్కగా పుస్తకం కనిపించింది. చేతిలోకి తీసుకొని చూశాడు. 'తిరుగుబాటు' అనే నవల అది.

"తారూ, ఈ నవల చదివేవా?" గాబరాగా అడిగేడు. ఉలుకూ పలుకూ

లేదు. దుప్పటి మరింత బిగతన్నింది, అయితే ఖచ్చితంగా ఆ నవల చదివుంటుంది. నాలుగు కప్పులు కాఫీ మరీ ఏడ్పించుతుంది. వంటచేసిన జాడ లేదు. ప్చ్ లాభంలేదు!

అది కొత్తకాదు అలాంటి నవలలు చదివినప్పుడల్లా అంతే... భర్తను మాడ్చేస్తుంది. ఇదేమని అడిగితే మరో రెండు రోజులు కుంపటి అంటించదు.

వంట మొదలెట్టి, విఫలమై - హోటల్‌కు వెళ్లాడు పరమేశం.

మరుసటి రోజు ముఖం కడుగుతుంటే పక్కింటి బామ్మగారు అడిగింది.

"రాత్రి, అబ్బాయే వంటచేసినట్లున్నాడు."

"అవునండీ, వంట నేర్చుకుంటానంటేనూ," నసిగింది.

"తొందర్లో పుట్టింటికి వెళ్లబోతున్నావన్నమాట."

"అబ్బే అదేంకాదు వంటనేర్చుకుంటానని మావారు కాస్త సరదాపడితేనూ" అంది చిరునవ్వు నవ్వుతూ.

తల పట్టుకొని కూర్చున్నాడు లోపల అంతా విన్న పరమేశం. తలబాదుకొని తన కోపమంతా తీర్చుకున్నాడు.

పరమేశం ఆ ఇంటిలో అద్దెకు దిగి ఆరు నెలలవుతోంది. ఆ యింటికి ఆనుకొనే బామ్మగారి ఇల్లు. వచ్చిన రెండు రోజులలోనే రెండిళ్లమధ్యా ఉన్న అడ్డుగోడ అధిరోహించేసింది తాయారు.

ఆఫీస్‌కు టైమ్ అవుతోంది. స్నానం చేసే బకెట్ కోసం ఇల్లంతా గాలించాడు. ఎక్కడా కనిపించలేదు.

"ఏమే తారు! బకెట్ ఎక్కడ దాచావే?" పెద్ద గావుకేక వేశాడు కోపంగా.

తాయారు గోడనానుకొని బామ్మగారితో రామాయణం మాట్లాడుతోంది.

"అబ్బా వస్తున్నా, ఒక్క క్షణం ఆగండి," విసుగ్గా అరంగుళం కూడా కదలకుండా అంది పెద్దగానే.

రామాయణం మొదలై అప్పటికి అరగంట.

"ఏమే మీ నాన్నకు టెలిగ్రాం ఇవ్వమంటావా పోయానని," అసహనంగా కేకేశాడు.

"మళ్లీ వస్తాను బామ్మగారూ. క్షణంకూడా ఊపిరాడనీయరనుకోండి" అని ఒక్క వేడి నిట్టూర్పు విడిచి, గోడప్రక్కనే బోర్లించి తాను నిలుచుని ఉన్న బక్కెట్‌ను దిగి, లోనికి పట్టుకెళ్లింది.

భర్త ఆఫీసుకెళ్లిన తరువాత బామ్మగారితో మళ్లీ బాతాఖానీ.

"బామ్మగారూ, అరటికాయతో ఆవకాయ పెట్టాలనుంది, ఎలావుంటుందంటారు." అడిగింది బుగ్గన చెయ్యి ఆనించి.

ఆ ఇంట్లో దిగిన మూడురోజుల్లోనే తాయారు మనస్తత్వం పూర్తిగా చదివేసిన బామ్మగారు, " అరటి కాయతో ఆవకాయ ఏమిటి, మిగిలిన అరటి తొక్కలతో హల్వా కూడా చేసుకోవచ్చు." అంది వ్యంగ్యంగా.

అదేం గమనించని తాయారు చెప్పుకుపోతోంది.

"మరిచి పోయాను. వారం రోజులనుంచి ఒకటే జలుబు" ఎన్ని మందులు వాడినా తగ్గటం లేదు. మీకేమన్నా చిట్కా వైద్యం తెలిస్తే చెప్పరూ..." అడిగింది తాయారు ఆశగా.

"చిట్కా వైద్యాలు ఈరోజుల్లో సరిగా పనిచేయటంలేదమ్మా. అప్పటి రోగాలు వేరు, ఆ మందులు వేరు. అప్పటి తిండి కూడా వేరు. అయినా ఓ చిన్న చిట్కా చెబుతాను జాగ్రత్తగా విను. అశోక్ థియేటర్ ఉంది చూసేవూ.... అందులో 'కన్నీరు... మున్నీరు' సినిమా అడుతోంది. ఒక్కసారి చూసొచ్చావంటే దెబ్బకు తగ్గిపోవచ్చు.

క్షణం ఆగి,

"ఆఁ.. మరచే పోయాను. వెంట ఓ టవల్ కూడా పట్టుకెళ్లు." ఉచిత సలహా పారేసింది.

ఆ మధ్యాహ్నమే సినిమాకెళ్లి హుషారుగా ఇంటికి తిరిగొచ్చింది, తాయారు. బామ్మగారి చిట్కా బాగా పనిచేసింది అనుకుంది.

ఆ రాత్రికి స్పెషల్ వడియాలు తయారు చేసి ప్రేమగా భర్తకు వడ్డించింది.

"తారూ"

"ఊc..."

"త్రేతాయుగంలో రాముడు సీతకి అగ్ని పరీక్ష పెట్టింది ఒక్కసారే అవునా?"

"అవును"

"ఈ అణు యుగంలో నాకు రోజూ అగ్ని పరీక్షలేనా" అన్నాడు, పన్నూడినట్లుంటే దవడ గట్టిగా పట్టుకొని.ఆమె చేసిన కొత్త వంటకం ప్రభావం!

"మీకన్నీ అలానే వుంటాయి. నేనంటే మరీ అంత చులకనైపోయాను." అంది ముక్కు పైకిపీల్చుతూ, కొంగు కళ్లకద్దుకుంటూ.

"వర్షం కురిపించకేతారూ, నీవు ప్రేమతో బండరాళ్ళు పెట్టినా ఇనప్పళ్ళు కట్టించుకొని మరీ నమలతానే."

అదే అదనుగా మరికొన్ని వడ్డించింది.

రాత్రి చలిగాలి రివ్వున వీస్తోంది. పరమేశం భార్యతో సరసాలాడుతున్నాడు.

"తారూ ఈ పండు వెన్నెల భగ్నం చేయకుండా ఓ పాట వినిపించు" అన్నాడు తెలుగు సినిమా హీరోలా.

"అబ్బా, ఉండండి. ఓక్షణం బామ్మగారితో మాట్లాడి వస్తా," చర చరా వెళ్ళిపోయింది.

ఒక్క క్షణం, ఒక్క క్షణం... వంద క్షణాలు గడిచిపోయాయి.

పరమేశం ఇక ఆపుకోలేక, తన గురకపాట తాను మొదలెట్టాడు.

(మయూరి సచిత్ర వారపత్రిక 1 నవంబర్ 1985)

# నీడ

పడమర గాలిలా వచ్చివాలేడు, ప్రసాదం.

వాలకంలో ఆ వేడీ సెగా కనిపిస్తూనే వున్నై.

సిగరెట్‌ని కసిగా వూదేస్తున్నాడు, ఉఫ్ ఉఫ్ మంటూ. నుదుటిమీద నరాలు బిరుసెక్కి ముడిపెట్టిన నులకతాడులా కనిపిస్తున్నై.

కుర్చీలో కూర్చున్నాడు. ఏదో పత్రికని చేతిలోకి తీసుకుని, మరుక్షణం చిర్గా దాన్ని నా మంచం మీద గిరవాటేశాడు. నేను మంచం మీద లేచి కూర్చున్నాను.

ఏదో జరిగిందని తెలుస్తూనే ఉంది. నేనుగా పలకరిస్తే... ప్రసాదం పొంగుని ఆపడం కష్టం. క్షణాల తరువాత వాడే చెప్తాడు.

వాడి తత్వం నాకు తెలియనిదా మరి. నీళ్ళలో నీళ్ళలా కలిసిపోయినవాళ్ళం మేమిద్దరమూ.

బాల్కనీలోకి వెళ్లి, పిట్ట గోడ మీదికి వంగి, ఒకటి రెండు సార్లు కేకరించి వుమ్మేసి... తిరిగి గదిలోకి వచ్చాడు. కుర్చీని నా కాళ్ళవారగా లాక్కుని కూర్చున్నాడు.

కిటికీలోంచి బయటికి చూస్తున్నాన్నేను. పక్క డాబా మీద మూలగా ఉంచిన పచ్చగడ్డిని కిందికి తీసుకుపోతున్నాడు, ఆ యింటి వారబ్బాయి గోపి. వాడు పదేళ్లవాడు. బుజాన జందెం పోగు, నుదుట విభూతి రేఖలు, పింజెపోసి కట్టిన పంచె! శుద్ధ శ్రోత్రియ కుటుంబంలో ఆరో సంతానంట గోపి. వాళ్ల నాన్న వైదీకం చేస్తాడు.

"నాకు మనుషులమీదా, వాళ్ల చేష్టలమీద విరక్తి పుట్తోంది. ఛీ... ఛీ... పెంట బుద్ధులూ, పెంట ఆలోచనలూ".

ప్రసాదం కేసి చూసేను. క్రింది పెదవిని పైపంటితోనొక్కి, మరో సిగరెట్‌ని

పాకెట్‌లోంచి తీస్తున్నాడు.

"ఏంవైంది?" అడిగేను.

"మా రాఘవరావ్ మావ గారింట్లో ఘనమైన సన్మానం జరిగింది. జుట్టులో జొనిపి, తల పక్కకి తిప్పి అన్నాడు.

"వివరంగా చెప్పు"

"నే వెళ్లేసరికి వాళ్లింట్లో హోమ్ పార్లమెంట్ జరుగుతోంది. మా అత్త... భర్తకీ, ఆమె అత్తకీ, తన పిల్లలకీ ఉపన్యాసం ఇస్తోంది. సారాంశం ఏమిటంటే... ప్రసాదం గాడి రాకపోకలకి మరీ అడ్డూ ఆపు లేకుండా పోతోంది. వాడి తిరుగుడూ, ప్రవర్తన చూస్తుంటే నాకెందుకో రెండు విధాల అనుమానంగా ఉంది. వాడి ఆరాటం మన నళినిని చూసయినా కావాలి, లేదా ఉన్నట్టుండి మన దగ్గర కొంత డబ్బు ఉడాయించుకుపోవడమైనా కావాలి. ఇదీ ఆమె నన్ను విశ్లేషించి తీసిన ఫోటో".

నేను సన్నగా నవ్వాను. నా నవ్వు ప్రసాదంకి చిరాకేసింది.

"ఆమె భయానికి అర్థముంది ప్రసాదం. ఆడపిల్ల తల్లి, డబ్బున్నవాళ్లు. అందులోనూ ఆ ఆడపిల్ల ఎమ్మే చదివి లెక్చరర్‌గా పనిచేస్తున్న యువతి."

"అంతమాత్రాన యింత దారుణంగా ఆలోచించడమేనా?"

"అవును. పరిస్థితులూ, పరిసరాలు అలాంటివి. నేన్నీకు గతంలో కూడా ఒకసారి చెప్పేను గుర్తుందా. నువ్వు కేవలం ఒక ప్రైవేట్ కంపెనీలో స్టెనోవి. ఆకారం, వేషధారణా... చూసేవాళ్లకి నువ్వు ఏపూటకాపూట కనపడ్డవాడి నెత్తిన చెయ్యిపెట్టి బతికే రకానివనే అభిప్రాయాన్ని కలుగజేస్తయ్. మరి, అలాంటి పరిస్థితుల్లో... నువ్వెంత బంధు ప్రీతితో, ఆప్యాయతతో నిష్కల్మషంగా మీ బంధువుల ఇళ్లకు తిరిగినా... వాళ్లకి మాత్రం నీ పట్ల సదభిప్రాయం కలగదు. ఈ వాస్తవాన్ని నీకు నేను ఇదివరకే చెప్పాను. మీ అత్తయ్య నా ఆలోచన నిజమని ఋజువు చేసింది, అంతే."

"ఆఁ.. అంతే... ఆమె డబ్బుమీద ఆశ కలవాణ్ణయితే, వాళ్ల ఇంటికి వెళ్లినప్పుడల్లా పళ్ళూ, పూలూ, మిఠాయిలూ, బిస్కెట్లూ తీసుకుపోతానూ, షికార్లకూ,

సినిమాలకూ నా డబ్బులు పెడతూనూ ఎందుకు తిరుగుతాను?"

అదే నేనూ అడుగుతున్నాను. అయినా, నీకెందుకురా ప్రసాదం ఈ తిరుగుళ్లంటే విన్నావా? మా అత్తయ్య, మా మామయ్య, మా నళిని, మా రవి అంటూ అక్కడికిపోతావాయె. అదేమంటే వొంటరివాణ్ణి, నా అవసరాలకీ ఎంత కావాలి?... అని ఎదురు ప్రశ్న వేస్తావ్. నీకు తగలాల్సిన దెబ్బే తగిలింది. అంతే కావాలి" చిరుకోపంతో అన్నాను.

"అంటే బాంధవ్యాలు ఇంతలో ఉన్నాయన్న మాట"

"అవును. విలువలు త్వరత్వరగా మారి పోతున్నయ్. ఇది ఈ యుగలక్షణం భాయ్. మరీ సీరియస్‌గా తీసుకోకు. నీ పని నువ్ చేసుకు పో. ఎప్పుడో వాళ్ల కనిపిస్తే "హలో"అని సాగిపో..అంతే."

చాలాసేపు మౌనంగా కూర్చుండిపోయాడు, ప్రసాదం.

చీకటి పడింది.

ఆదివారం వాతావరణం... వీధిలో ధ్వనిస్తోంది.

కుర్చీలోంచి లేచి బయటకి బయల్దేరాడు, ప్రసాదం.

"ఎక్కడికి?" అసంకల్పంగా అడిగేను.

"మధు వాళ్ళింటికి పోయొస్తాను"

నేనేమీ మాట్లాడలేదు. ప్రసాదం వెళ్లిపోయాడు.

నాలో నేను నవ్వుకున్నాను. దాలిగుంటలో కుక్క సామెత గుర్తుకొచ్చింది. ప్రసాదం చిత్రమైన మనిషి. అతనికి బంధు ప్రీతి జాస్తి. అలాగే స్నేహానికి ప్రాణమిస్తాడు. నాకు ప్రాణస్నేహితుడు.

ప్రసాదం అమ్మా నాన్నా అతని చిన్నప్పుడే పోయారు. మామయ్య, ఇతర బంధువులు... అతని పెంపకాన్ని గురించి మొహాలూ చూసుకుంటుంటే అతని అమ్మమ్మ వారూ వీరూ అనే మాటలు పట్టించుకోకుండా అతన్ని శరణాలయంలో

చేర్పించేసిందట. అతరువాత కొన్నాళ్లకి ఆమె కాలంచేసింది.

తన కాళ్లమీద తాను నిలబడటం ప్రారంభించాక, ప్రసాదంకి తన వాళ్లన్న వాళ్ల పట్ల అభిమానం పెరిగింది. తానొక ఉద్యోగస్తుడైనాడు. బంధువుల ఇళ్లకి వెళ్లడం, తరచు అక్కడ పదిమందితో కలిసి సరదాగా గడపడం... అతనికి అభిమాన విషయాలైనాయి. ప్రసాదం మామ రాఘవరావ్, అతని బాబాయి చంద్రశేఖరం ఇంకా నాలుగైదు కుటుంబాల దూరపు బంధువులు... అంతా ఈ వూళ్లోనే ఉన్నారు.

ప్రసాదం మనస్తత్వాన్ని గురించి నాలో నేను వితర్కించుకుంటుంటే ఆశ్చర్యంగా ఉండేది నాకు.

న్యాయానికి బంధువులందరిచేత ఆదరింపబడలేదని తెలుసు కనుకా, శరణాలయంలో పెంచబడిన వాస్తవం తెలుసు కనుకా... ప్రసాదం ఈ జనానికి దూరంగా ఉండాలి, ఇంకా తరచి చూస్తే వాళ్లపట్ల అంతరాంతరాల్లో అతనికి కోపమో, ద్వేషమో పేరుకుపోయి ఉండాలి. కాని, దీనికి విరుద్ధంగా అతనికి బంధుప్రీతి ఉబుకుతోంది.

రాఘవరావ్ మామయ్య గారింట్లో ధ్వనించిన నిరసనకు బాధపడిన ప్రసాదం... ఆవెంటనే మధు వాళ్ల ఇంటికి వెళ్లటం.... మరీ విడ్డూరంగానే తోచిందినాకు.

మధు చంద్రశేఖరంగారి అబ్బాయి. అంటే ప్రసాదంకి బాబాయి కొడుకు. అతను ఏదో కంపెనీలో పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. మధు భార్య వసంత కూడా కార్పొరేషన్‌లో ఆఫీసరు. వాళ్లకో అబ్బాయున్నాడు. వయస్సు పదేళ్లు. పేరు రాజు, రాజు అంటే ప్రసాదంకి వల్లమాలిన ప్రేమ, అభిమానం. అందువలన కూడా ప్రసాదం తరచుగా మధు వాళ్ళ ఇంటికి వెళ్తూ ఉంటాడు. ఇవన్నీ అతని ద్వారా నాకు తెలిసిన వివరాలే!

ఉదయం నుంచీ గదిలోనే కూర్చుండి పోయానేమో... మనస్సుకి ఇరుగ్గా తోస్తున్నది. అఖిలన్ నవల "చిత్రసుందరి" పూర్తి చేశాను. వేరే ఏదైనా పుస్తకం

తీద్దామా అనిపించింది. కాని, చదివి చదివి పుస్తకాలంటేనూ విసుగ్గానే వుంది.

క్లబ్బు దాకా పోయి, కాస్సేపు టి.టి. ఆడి వస్తూ వస్తూ హోటల్లో భోంచేసి రావచ్చని లేచి బయటికి బయల్దేరాను.

ఆకాశం మబ్బులు కమ్మింది. చల్లగాలి వీస్తోంది. ప్రాణం తేరుకున్నట్లయింది. పేవ్‌మెంట్ మీదుగా నడక సాగించాను.

...రాత్రి పదిగంటలవుతోంది. పుష్పవర్షంలా తుంపర మొదలైంది.

...ఇంటికి చేరేను.

గుమ్మంలో ఎదురైనాడు గోపి. “ఉండండి. మీరొస్తే చెప్పమంది మా అక్క” అంటూ గబగబా వాళ్లింట్లోకి పరుగెత్తాడు. ఏమీ మాట్లాడే అవకాశం ఇవ్వలేదు నాకు. తలుపు తీసి లైట్ వేసుక్కూర్చున్నాను.

సరళ వచ్చింది, “మీ ఫ్రెండ్ ప్రసాదం గారు వూరుకి పోయానని చెప్పమన్నారు. నాలుగైదు రోజుల తరువాత వస్తారట” అంది కూర్చుంటూ. ఈ వార్త చెప్పటానికి తానుగా ఎందుకు రావాలో అర్థం కాలేదు నాకు.

సరళతో నాకు గోపి ద్వారా పరిచయమైంది. మొదట్లో తరచుగా మా గదికి వస్తూ ఉండేది. హైస్కూల్ చదువుతో ఇంట్లో కూర్చున్న పిల్ల. పుస్తకాలూ, పత్రికలూ తీసుకుపోతూ వుంటుంది. సరళకి ఇంకా చదువుకోవాలనే ఉత్సాహం ఉంది. ప్రయివేటుగా బి.ఏకి తయారవవచ్చుఅని నేను ప్రోద్భలిస్తే... వాళ్లనాన్న అతి కష్టంమీద ఒప్పేసుకున్నాడు. నా గురుత్వంలో ఎంట్రెన్స్ టెస్ట్ పాసయి, మొదటి సంవత్సరం పరీక్షకు తయారౌతోంది.

“మీతో మాట్లాడాలి”. అని పమిట కొంగుని వేలితో ముడిపెడుతూ నేలచూపులు చూడసాగింది.

“వాళ్ల రాఘవరావ్ మామయ్యగారింట్లో జరిగిన సంఘటనకి మీ ఫ్రెండ్ చాలా బాధపడుతున్నాడు. అందుకనే ఈ వూరు ప్రయాణం పెట్టుకున్నారు.” అని ఒక్కక్షణం ఆగింది. తలను కుర్చీకి ఆనించి ఇంటి కప్పును చూస్తూ కూర్చుంది.

క్షణాల తర్వాత అన్నది. "నన్ను కూడా తనతో రమ్మన్నాడు." నేను ఉలిక్కి పడ్డాను. సరళ, ప్రసాద్ మధ్య స్నేహం, చనువు చాలా దూరం నడిచేయనిపించింది.

"తనకు కంపెనీ కావాలిట. మా నాన్న సంగతి తెలుసుగా. మీ దగ్గర చదువుకోను వస్తుంటేనే రోజూ సాధిస్తూ వుంటాడు. ఒంటరిగా గడపదాటటమంటే... మా ఇంట్లో ఎనిమిది శవాలూ లేచినట్లే. రాలేనని చెప్పాను. మీరు వెళ్లి రాకూడదూ" నా కళ్లల్లోకి చూసింది.

సరళ చాలా ఎదిగిపోయింది అనిపించింది. నిన్న మొన్నటిదాకా సరళ చూస్తుంటే... 'చింతచిగురు పులుపనీ, చీకటంటే నలుపనీ చెప్పందే తెలియని చిలిపి పిల్ల, అది చెరువులోన ఈదుతున్న చేపపిల్ల అని అనుకుంటూ వుండేవాణ్ణి. ఇవాళ నా అభిప్రాయం మార్చుకోవాలనిపిస్తోంది.

"ఇంతకీ ప్రసాదం ఎక్కడికి వెళ్లినట్లు?" అడిగేను.

"తెలీదు. రాజుని తీసుకుని వెళ్తాలెండీ అంటూ గబగబా వెళ్లిపోయారు."

"చిత్రమైన మనిషి" అనుకుంటూ లేచాను. సరళకూడా లేచింది, గుమ్మందాకా సాగనంపి, నేనూ బయటికి కదిలేను.

నేను మధు ఇంటికి వెళ్ళేసరికే రాజుని తీసుకుని వెళ్లిపోయాడు, ప్రసాదం. తిరుపతి, చంద్రగిరి పోయొస్తామని వెళ్ళాడట.

వారం గడిచింది.

తెల్లవారుతూనే వచ్చాడు, ప్రసాదం. తలుపు తీయగానే కళ్లొత్తుకుంటూ బావురుమన్నాడు. ఆశ్చర్యంతో గతుక్కు మన్నాన్నేను. మెల్లిగా నడిపించుకుంటూ వచ్చి, నా మంచంమీద కూర్చొబెట్టాను. అతని అరచేతిని నా చేతుల్లోకి తీసుకుని లాలనగా చేతిని నొక్కేను. వెక్కిళ్ల పర్యంతంగా ఉంది ప్రసాదం పరిస్థితి, తననుతాను సంబాళించుకోడానికి చాలాసేపు పట్టింది. ఆ తర్వాత చెప్పాడు. తాము వెళ్లినప్పుడు చంద్రగిరిలో భారీవర్షంట. రాజూ, తనూ ఆ వర్షంలో తడిసేరట. ఆ సాయంత్రం నుంచీ రాజుకు తీవ్రమైన జ్వరం ట. రాత్రికి ఇంటికి తీసుకువచ్చాడుట.

"ఇల్లుచేరి నాలుగురోజులైంది. రాజుని కంటికి రెప్పలా చూసుకుంటూ అక్కడే వుండిపోయాను. ఈ నాలుగురోజుల్లోనూ జ్వరం తగ్గకపోగా, కాళ్లూ చేతులూ చచ్చుబడినై. వొళ్లంతా నొప్పులు. పిల్లవాడు బెడ్‌లో కూడా కదలలేక పోతున్నాడు. రాత్రి కార్లో మద్రాస్ తీసుకుపోయారు" అని ఆపేడు. రుమాలుతో మొహం తుడుచుకుని మళ్లీ అన్నాడు, "వెళ్తూ వెళ్తూ మధు, వసంత అన్నమాటలు గుర్తుకొస్తుంటే తల బాదుకు చావాలనిపిస్తోంది. కావలని నిలువునా వాళ్ల పిల్లవాణ్ణి ఈ గండంలోకి తోశానుట నేను. నేనూ మద్రాస్ వస్తానంటే వీల్లేదన్నారు"

నాకూ బాధకలిగింది. "నీ బంధుప్రీతి చివరికి నీకు అన్నీ బాధల్నే కొని తెస్తోంది" అన్నాను.

ఆ తర్వాత నాలుగు రోజులకి రాజు చనిపోయాడు. మధు, వసంత ల దుఃఖాన్ని చూడలేక పోయాం మేము. ప్రసాదం బాబాయి... చంద్రశేఖరం గారితో సహా వాళ్లంతా రాజు మరణానికి ప్రసాదమే కారణమని తిట్టిన తిట్టు తిట్టకుండా దూషించేరు.

ఆరోజు

ఒక రాత్రివేళ ఎందుకో మెలుకవ వచ్చి చుట్టూ చూశాను. గదిలో ప్రసాదం లేడు. అతని సూట్‌కేస్ కూడా లేదు, అంతే.

ప్రసాదం ఏమయ్యాడో, ఎటుపోయాడో ఎవరికి తెలీలేదు. అతన్ని నేను మళ్లీ కలుసుకోలేదు.

నాకు బెంగుళూరుకు ట్రాన్స్‌ఫర్ అయింది. శకుంతలతో నా పెళ్లి జరిగింది. నేనొక ఇంటివాణ్ణయి సంసార గొడవల్లో పడిపోయాను.

నాలుగేళ్లు గడిచేయి.

ప్రసాదం నుంచీ ఉత్తరం వచ్చింది. అనూహ్యమైన పరిణామం. ఆనందంతోనూ, ఆశ్చర్యంతోనూ చదివేను. "మూర్తి.. డిసెంబరు 13న నాపెళ్లి. పెళ్లికూతురు మీ శిష్యురాలు... సరళే, గుర్తుంది కదూ, అవధాన్లగారమ్మాయి. అదే

గోపి అక్కయ్య పెళ్లి తిరుపతిలో. నాకు బంధుప్రీతి ఎక్కువ అని, దాంతో అనవసరంగా ఇబ్బందులు కొని తెచ్చుకుంటానని అంటూ ఉండేవాడివి నువ్వు. నిజమే. బంధుప్రీతి అనేది ఒక ఉన్మాదం అయితే, స్నేహం అనేది ఒక వ్యసనం అంటోంది మీ సరళ. నాతో నీ స్నేహం వల్లనే తనతోనూ నేను స్నేహం చేశానట; ఆ స్నేహం వల్లనే నేను తనను ప్రేమించానట; వాళ్ళనాన్నావాళ్ళంతా వొద్దన్నా కూడా తనను పెళ్లి చేసుకుంటున్నానట. నువ్వేమంటావో మరి. పెళ్లికి నువ్వు వస్తావని నాకు నమ్మకం. వుంటాను మరి. నీ ప్రసాదం."

ప్రసాదం గురించి ఆలోచిస్తూ కూర్చుంటే... "అనారోగ్యానికి గురిచేసే తినుబండారాలనే రోగి జిహ్వా కోరుతూ వుంటుంది. అవే అతనికి మక్కువ, ప్రాణం." అనే మాటలు గుర్తుకొచ్చాయి.

మమతల పూలే ఎప్పుడూ ప్రసాదం కోరికల కవాటాన్ని తెరుస్తూ వుంటాయనిపించింది.

ఆఫీసు పనుల వొత్తిడి వలన ప్రసాదం పెళ్లికి వెళ్ళలేకపోయాను.

చాలా కాలం తరువాత... ప్రసాదం నాకు జాబు వ్రాసేడు.

అందులో చివరి వాక్యాలు ఇలా ఉన్నై.

"నీకు తెలుసో తెలీదో మూర్తి. మీ శిష్యురాలు... సరళ... నానుంచి విడివడి వేరే వుంటోంది. ఆమె ఇప్పుడు...టీచర్. నేను తన పుట్టింటివాళ్ళకి ఆసరాగా వుండటం, బంధు ప్రీతి అంటూ బాధ్యతల్ని వహించడం..ఆమె దృష్టిలో నేను చేసిన నేరాలు. తన భవిష్యత్తుకూ, తనకు మాత్రమే నేను బాధ్యత వహించాలట. ఇది ఆమె ఆంక్ష. ఇదే మా వేర్పాటుకి కారణం. సిల్లీగా లేదూ?"

అవును సరళ సిల్లీగానే ప్రవర్తించింది!

చంద్రుడుకేసి చూస్తూ నడుస్తున్నా, వెనకనుంచీ చీకటి మీదబడి దబాయిస్తుందన్న నిజం... ప్రసాదంకి... ఇన్ని అనుభవాల తరువాత కూడా... ఇంకా తెలీలేదు మరి!!

( జ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక ...1984)

# లోవెలుగు

తెనాలి నుంచీ నరసమ్మ ఉత్తరం రాయించింది... ఉన్నపళంగా వోసారి

బ్రహ్మానందం పెదనాన్నని గురించి నా అభిప్రాయాల లెక్కలు నరసమ్మ దగ్గర ఉన్నాయి. ఇది నాకు తెలుసు. అయినా, ఆవిడ నాకు ఉత్తరం రాయించిందంటే ఆశ్చర్యం వేసింది.

"వెళ్లిరండి, విషయం తెలుస్తుంది" అంది రమ.

పదిహేనేళ్ల తర్వాత... మళ్లీ నేను తెనాలికి బయల్దేరాను. కఠెవరం వంతెన; ఐతా నగర్; పడవల కాలువ, పంట కాలువ, పెదరావూరు రోడ్డు, గాంధీచౌక్, కాలేజీ భవనాలు... అన్నీ నా చిన్నప్పటి విహార స్థలాలు... కళ్లల్లో మెదిలి, ఆలోచనల్లో కదిలి... మనస్సును చిత్రమైన అనుభూతికి గురిచేసినై.

బస్సు ముందుకు పోతోంది. నా ఆలోచన వెనక్కు నడిచింది.

బ్రహ్మానందంగారు మా నాన్నకి అన్న. పదిహేనేళ్లక్రితం అరవయ్యోఏట నాన్న పోయారు. ఆయనకీ ఈయనకీ మధ్యన నాకోమేనత్త వుంది. ఆలెఖ్ఖన బ్రహ్మానందంగారి వయస్సు ఇప్పుడు సుమారు ఎనభై పైమాటే. వాళ్లు... నలుగురు అన్నదమ్ములూ, ఐదుగురు అప్పచెల్లెళ్లూ.

బ్రహ్మానందం పెదనాన్నకి ఎనిమిది మంది కొడుకులు, ఒక్కతే ఆడపిల్ల. మా నాన్నకేమో నేనొఖ్ఖణ్నీ ఒకే వొక్క నలుసుని.

తన సంతానం, కోడళ్లూ, అల్లుడ్లూ, మనుమలూ, మనుమరాండ్రూ, మేనల్లుళ్లూ వాళ్ల భార్యాబిడ్డలూ, మేనకోడల్లూ వాళ్ల భర్తలూ, వీళ్లందరకూ నా గుజ్జూ...అంతా కలిసి ఆయనదో పెద్ద బలగం. సంపదకీ కొదవేం లేదు. తండ్రి ఆస్థిని పాతికెకరాల చొప్పున పంచుకున్నారు, అన్నదమ్ములు.

బ్రహ్మానందంగారు ఆ కాలంలో స్వాతంత్ర్యోద్యమంలో తిరిగేరు; లాఠీ దెబ్బలు తిన్నారు; ఊళ్లు పట్టుక తిరిగారు; జైలు సంగతి సరేసరి.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అది ఆయన కొడుకులకీ స్వాతంత్ర్యాన్నిచ్చింది. ఆయనకు మాత్రం ఆ 'ఫలం' దక్కలేదు.

వెనక్కి తిరిగి చూసుకునే సరికి... సున్నకు సున్న హళ్లికి హళ్లి అన్నట్లయింది... ఆయన ఆర్థిక పరిస్థితి. భార్య పోయింది. ఆడపిల్ల పెళ్లి ఎప్పుడో అయిపోయి ఉండటం... 'గుడ్డిలో మెల్ల' అనిపించింది, ఆస్థితిలో.

బస్సు ఏదో వూళ్లో ఆగింది. రోడ్డుపక్కనే ఇళ్లు... ఇసిరేసిన పిండి గోళీల్లా. గుడిలో గంటల శబ్దం వినిపిస్తోంది.

నా పక్కగా కూర్చున్న వ్యక్తుల్లో ఒకతను అంటున్నాడు, "ఓడలు బండ్లు కావడం, బండ్లు ఓడలు కావడం సహజం. ఎన్ని సంసారాలు చూళ్లేదు గనుక?!"

బస్సు కదిలింది. నా ఆలోచనా సాగింది.

బ్రహ్మానందం పెదనాన్న కొత్త జీవితం ప్రారంభించాడు. కొత్త రెక్కలు తొడుక్కున్నాడు. అయినా వాళ్లందరి నుంచీ దూరంగా జరిగిపోయాడు.

అప్పటి వరకూ జీవితంతో పట్టిన కుస్తీ పట్లతో ఆయన అలసిపోయి కూలబడతారనుకున్నవాళ్లంతా నోళ్లప్పగించి చూస్తూ వుండిపోయారు.

అంటు గట్టిన కొమ్మలా, నరసమ్మ ఆయనజీవితంలోకి ప్రవేశించింది.

నరసమ్మని తెచ్చుకున్నాడని కొందరూ, కాదు నరసమ్మే వచ్చిందని కొందరూ అనుకున్నారు. ఆమెది ఆయన కులం కాదని తెలుసుకున్నారు గాని, ఎక్కణ్ణుంచి వచ్చిందో మాత్రం ఆచూకీ దొరకలేదు వాళ్లకి.

ఆయన ఓ చిన్న హోటల్ ప్రారంభించాడు. దానికి ఆయన యజమాని, ఆయనే వంటవాడు. నరసమ్మ సర్వరూ, క్లీనరూ అయింది.

మా వూరి వాళ్లకి అదొక వింత, విడ్డూరం అయింది. క్షణంలో బ్రహ్మానందంగారు వలపు కథకి నాయకుడైపోయాడు. అందులోనూ మా పినపాడు

టొానుకు విసిరేసినట్లు వుండేదేమో... ఆయన వ్యవహారం జనం నోళ్ళల్లో బాగానే నానుతూవుండేది.

సాటి వాళ్లల్లో కానిపనిచేశాడనీ, పిల్లలకు లోకువైపోయాడని...చాలా మంది చెవులు కొరుక్కున్నారు. ఆయన సంతానం సంగతి చెప్పేదేముంది... మొహాన్నే ఆయన్ని ఛీకొట్టి... తొలగిపోయేరు.

తమకోసం తాము ఏడ్చుకుంటూ, తమకోసం తాము నవ్వుకుంటూ... ఒకరి గుండెల్లో ఒకరు కాపురముంటూ వో పదేళ్లు బరువుగా కాలం గడిపేరు; నరసమ్మా ఆయనా.

నాణెం రెండోవైపుది పై చెయ్యి అయింది.

స్వంతానికి అందమైన విశాలమైన మేదని పట్నంలో కొన్నారు ఆయన. ఆతరువాత, మరో ఐదేళ్లయ్యేసరికీ వరద గోదావరిలా ఆయన్ని ముంచేసింది... సిరి.

జనం ఆయన్ని గౌరవంగా సంబోదించడం మొదలెట్టేరు. ఈగలన్నీ దగ్గరైనాయి. సంతానమంతా ఆయనముందు అణకువగా ప్రవర్తించగలమనే హామీనిస్తున్నట్టు కావలించుకో చూసేరు.

కానీ, ఈగల్ని దగ్గర కానీయలేదు ఆయన. నలుగురిలోనూ పెద్ద వ్యవహార వేత్తగా మారేడు.

బస్సు కోదాడలో ఆగింది. కాఫీలకీ, భోజనాలకీ స్టాప్ అది. నేనూ దిగేను.

వాతావరణంలో చీకటి పరచుకుంది. దూరం నుంచీ వివరంలేని సవ్వళ్లు వినిపిస్తున్నాయి. బస్టాండు మూలకి నడిచేను... ఆవరణలో.

జుట్టుపట్టుకొని భార్యని కొట్టున్నాడు.. వో నడివయస్సు ఆసామీ. చాలామంది ఆ వినోదపు ప్రదర్శనని చూస్తూ నిలబడ్డారు. పేకాటకు డబ్బుకోసం పెళ్లాన్ని చావబాదుతున్నాట్ట ఆ పెద్దమనిషి. ఆమె కూలి చేస్తుంది.

చన్నీళ్లు మొహాన్న చల్లినట్లయింది నాకు. తిరిగొచ్చి బస్‌లో కూలబడ్డాను.

బస్ బయల్దేరింది.

మా నాన్నది మంకు స్వభావం. నోటి దురుసు ఎక్కువ. వీటికితోడు నడి వయస్సులోవుండగా ఎవరో ఒక ఆశని ఆయన బుర్రలోకి ఎక్కించారు... ధనయోగం వుందని. ఆయన పేకాటకు దాసుడైనాడు. కొండలాంటి జీవితమే గడిపేడు. ఏటికో కోటికో తప్ప ఏనాడు ఇంటిపట్టున వుండేవాడు కాదు. ఎప్పుడూ క్లబ్‌లోనో, డెన్‌లలోనో కాలం గడిచిపోయేది. టిఫిన్, కాఫీలూ కారియర్, సిగరెట్లతోనే ఆయన బ్రతుకు తెల్లారిపోయింది.

వెర్రిదానిలా అత్తవారింటికి వచ్చి వెర్రిదానిలాగానే రోజులు వెళ్లమార్చింది అమ్మ. నాన్నముందు ఏడ్చింది; మొత్తుకుంది. తలబాదుకుంది. ఆయన ప్రవర్తనలో మార్పులేదు. ఆమె ఎదారి జీవితానికి నేనే ఒయాసిస్సుని. ఆయన పోయిన తరువాత అమ్మకు కుట్టుమిషనే ఆధారమైంది.

బ్రహ్మానందం పెదనాన్న పట్ల నా వైముఖ్యానికి కారణం వెతుక్కోవాలంటే చాలా వెనక్కు వెళ్లక తప్పదు.

అప్పట్లో నేను నాలుగో తరగతో ఏదో చదువుతున్నాను. మా స్కూలు ఆటస్థలం పక్కగా వాళ్ల ఇల్లు. ఓరోజు సాయంత్రం నేను ఆటల్లో అలసిపోయి మంచినీళ్ల కోసం వాళ్లింటికి వెళ్లాను. నాతోపాటు నా మిత్రుడు విఠల్ కూడా వచ్చాడు. అప్పట్లో వాళ్లుంటున్నది, వో పాత కొంపలోనే, నిజానికి అది కొట్టడి లాంటిది. కప్పునిండా కంతలు. నేను వెళ్లేటప్పటికీ కుంపట్లో మొక్కజొన్న కండెలు కాలుస్తోంది... నరసమ్మ లోవాకిలి నిలబడ్డాడు విఠల్. నాపుస్తకాల దొంతర అతని చేతికిచ్చి... నేను లోపలికి వెళ్లి మంచినీళ్లు అడిగేను. నరసమ్మ ఇచ్చింది. విఠల్‌నీ అడిగింది. వాడు కావాలన్నట్టు తలవూపేడు. ఆమె మరో గ్లాసుతో నీళ్లు తెచ్చి వాడికిచ్చింది. ఇద్దరమూ నీళ్లు తాగి వస్తుంటే ఆమె మళ్లీ పిలిచింది. మేము ఆగేము. ఒక కండెను తుంచి చెరో సగమూ మాచేతుల్లో పెట్టింది. ఆమె చూపుల్లో అదో తృప్తి. ఆరాత్రి ... మా యింటికొచ్చి పెద్ద రాద్ధాంతం మొదలెట్టాడు బ్రహ్మానందం పెదనాన్న. తన బౌండు పుస్తకమేదో నేనుదొంగిలించుకొచ్చానట. అందులో ఆయన

హోటల్ లెక్కలున్నాయట. నాకేమీ తెలియదని నేను బెరుగ్గా సమాధానం చెప్పేను. నా మెతక తనం, బెరుకు బహుశా ఆయన నమ్మకాన్ని మరింత రూఢీ చేశాయి కాబోలు. నాలుగు అంటించాడు. అమ్మేమో నా కళ్లలోకి చూస్తూ "చెప్పునాన్నా... ఎక్కడ పెట్టావో చెప్పు. ఇచ్చేసేయ్" అంటోంది. నాకేమో లోపల కోపం, కసి. అన్యాయంగా నన్ను కొడతాడేమా అని రోషం. నాకు తెలీదని గట్టిగా అరిచేను. వో అర్థగంట తరువాత ఆయన బూతులు తిడుతూ వెళ్లిపోయాడు. నాగుండెల్లో ఒక విషపు బాణం గుచ్చినట్లయింది. ఆ పుస్తకాన్ని విఠల్ పట్టుకపోయాడని మర్నాడు తేలింది. మనస్సు విరిగిపోవడమంటే ఇదే అని పెద్దయిన తరువాత తెలుసుకున్నాను.

బస్‌లోనుంచి పక్కకు చూశాను. బస్సు వంతెన దాటుతోంది. వంతెన క్రిందుగా కాలవ. నీళ్లు జలజలా పారుతున్నై.

శివరాత్రికి అమ్మా నేను సంఘం జాగర్లమూడి వెళ్లాము. స్నానాలు చేసుకొని దేవుణ్ణి చూసి గుడి ఆవరణ దాటి బయటికొచ్చాం. అన్నీ అంగళ్లు. చెక్కబొమ్మలు, గాజులు, దువ్వెనలు, అద్దాలు, కుండలు, చాటలు, వినసకర్రలూ, చిలకలపూడి నగలూ, వాటి పక్కగా చెరకు గడలూ, మంచం మిఠాయిలూ, ఐస్‌క్రీమూ, పీచు మిఠాయీ... అన్నీ నాకు అందని ద్రాక్షపళ్లు; దైన్యాన్ని కళ్లల్లోనూ, ఆశని గుటకల్లోనూ తొక్కిపెట్టి అవన్నీ చూస్తున్నాను. అమ్మ నాప్రక్కగా నడుస్తోంది. "ఒరేయ్ రాజీగా" అన్నపిలుపుకు ప్రక్కకి చూస్తూ ఆగేము. మా పెదనాన్న. ఆయన ఇడ్లీలూ ఉప్మా కొట్టుపెట్టేడు. ఆయన పక్కగా నరసమ్మ. ఆకులో ఇడ్లీలు పెట్టి ఎవరికో అందిస్తోంది. ఆయన మా అమ్మతో అన్నాడు, "వీణ్ణిక్కడ వుంచిపో. రాత్రికి మాతో వస్తాడు. జనం బాగా వచ్చారు. బేరం బాగానే వుండేట్టుంది. గ్లాసులు తియ్యడానికన్నా ఉపయోగపడతాడు." వెంటనే నా వైపు చూసి, "ఏరా, ఇడ్లీ తిని ఇక్కడేవుండు" అన్నాడు. నేను ఠక్కున సమాధానం చెప్పేను. "నీ ముష్టి నాకేం అక్కర్లేదు. నేను వుండను" గబగబా ముందుకు వెళ్లిపోయాను. ఆయన చిరాకు పడుతూ అమ్మతో అంటున్నాడు, "అయ్యలాగానే పర్థి పెంకి ఘటం. ఆ తలబిరుసుతనం చూడు." నేను ముందుకు నడిచి మలుపు తిరిగేసరికి, తన కొట్టు వెనగ్గా... గుడి ప్రహారీకీ

కొట్లకీ మధ్యగా నరసమ్మ నుంచుని వుంది. ఏమీ మాట్లాడకుండా నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని గుప్పెట్లో అర్ధరూపాయి నాణెం వుంచింది. ఆమె కళ్లల్లో అదో తృప్తి! వెనక్కి తిరిగి గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయింది. అమ్మ వచ్చేసింది. వేరే హోటల్లో పులిహోర పెట్టించింది. చెరకుగడ కొన్నది. నేను కొండెక్కినంత సంబరపడ్డాను. పన్నెండవుతుండగా ఇంటిదారి పట్టేము. నరసమ్మ ఇచ్చిన అర్ధరూపాయి నా రేకుపెట్టెలో పడేశాను.

నాకు ఇప్పటికీ బాగా గుర్తు. ఆ తర్వాత చాలాకాలానికి ఏదో పెళ్లిలో కలిశాం... నేనూ పెదనాన్నా. అందరూ ఆయనపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపిస్తూ, మెచ్చుకోలు గౌరవంతో, అడుగులకు మడుగులొత్తుతూ తిరుగుతున్నారు. నాకా వాతావరణమంతా కృతకంగా అగుపించింది. అందరి మొహాల్లోకీ పరీక్షగా చూశాను. అంతా ఆత్మవంచన, కపట నాటకం. ఆ నాటకంలో ఆయన సంతానమూ ముఖ్య పాత్రధారులు కావడం నాకు మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది. భోజనాల దగ్గర... అన్నం పళ్లెం పట్టుకున్నాడు ఆయన... వడ్డనకు. ఆయన పెద్దకొడుకు గబగబా వచ్చి పళ్లేన్ని లాక్కుంటూ ఆయన్ని వారిస్తున్నాడు."ఫర్వాలేదు. నాకు బాగా అలవాటైన పనే ఇది" అని ఆయన ముందుకు సాగుతున్నాడు. వాళ్లిద్దర్నీ చూస్తూ నేను ఠక్కున అన్నాను... ఆయన్ని వుద్దేశించి... "అన్నయ్య శ్రద్ధంతా నీ మీద కాదులే పెదనాన్నా... నీ డబ్బుమీద. పాప, మహా కష్టపడిపోతున్నాడు. పళ్లెం ఇచ్చేసి హాయిగా కూర్చోరాదూ?" అన్నాను. ఆయన నావైపు అదోలా చూశాడు. ఆయన కుమారరత్నం మిర్రి మిర్రి చూశాడు. ఆతరువాత కొంతసేపటికి... పందిట్లో కూర్చుని తాంబూలం వేసుకుంటూ... మా అమ్మతో చెప్పేడు ఆయన, "నీ కొడుక్కి గీరతోపాటు అతి తెలివీ బాగానే వస్తోంది" అని. నేనూ దగ్గర్లోనేవున్నాను... ఏదో పత్రిక తిరగేస్తూ. "చూశావా?" అన్నట్టు అమ్మ నాకేసి చూపులు మరల్చింది.

బస్సు విజయవాడ వచ్చేసింది.

మా నాన్న పోయింది... విజయవాడలోనే. ఆయన్ని మా వూరికి తీసుకువెళ్లడం, శవదహనం... ఆ దృశ్యాలన్నీ నా కళ్లముందు మెదిలినై. అప్పుడు

నేను బియ్యే మొదటి సంవత్సరంలో వున్నాను. ఒక నెలలో స్పెషల్ ఫీజులూ, టరమ్ ఫీజూ వొకేసారి చెల్లించాల్సి వచ్చింది. అమ్మా, నేనూ ఏం చెయ్యాలో తెలీక దిక్కులు చూస్తున్న సమయం. ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలించలేదు. చివరకి అమ్మ బ్రహ్మానందం పెదనాన్నని చూపింది. నేను సుతరామూ యిష్టపడలేదు మొదట్లో. కానీ అమ్మ ఎంతో నచ్చచెప్పింది. నా భవిష్యత్తు గురించి తనకున్న ఆశల్ని వల్లించింది. నేను అంగీకార సూచనగా మౌనంగా వుండిపోయాను. మేమిద్దరమూ పెదనాన్న యింటికి వెళ్లాం. నరసమ్మ మమ్మల్ని చాలా సాదరంగానే ఆహ్వానించింది. ఆయనా సావున్నాడు.... యింట్లో. అడ్డు వస్తున్న అభిమానాన్ని పక్కకు నెట్టి... చాలా బిడియంతో... ఆ విషయం ప్రస్తావించి వూరుకుంది అమ్మ. ఆయన తన వుపన్యాసం మొదలెట్టాడు. నేను నేల చూపులు చూస్తూ వింటో కూర్చున్నాను. దానంతటి సారాంశం... జీవితంలో కష్టపడి పైకిరావాలనీ; ఇతరుల వద్ద చేయి సాచకూడదనీనూ; మధ్య మధ్యలో తన అనుభవాల్నీ గుర్తు చేశాడు ఆయన. నీతీ నిజాయితీగా బతకాల్సిన ఆవశ్యకత గురించీ గట్టిగానే హెచ్చరిక చేశాడు. నాకూ రోషంగానూ, ఉక్రోషంగానూ వుంది. అమ్మకళ్లల్లో సందేహం వున్నా; రవ్వంత ఆశల ఛాయలూ వున్నై. చివరికి ఆయన మొండిచెయ్యి చూపుతున్నాడనీ, ఆ విషయాన్ని ఆయన చెప్పక చెప్తున్నాడనీ అర్థమైంది నాకు. ఉండబట్టలేక అడిగేను, "మీరు చెప్పిందంతా బాగానే వుంది. గుఱ్ఱమూ నాడా కథలా, చెట్టూ విత్తనం వ్యవహారంలా మాట్లాడుతున్నారు మీరు. ముందు నే నీ చదువు పూర్తి చెయ్యాలి గదా... ఆనక ఎలా బతికినా? పైగా నాదొక చిన్న సందేహం. నీతీ నిజాయితీల గురించి ఇన్ని కబుర్లు చెప్పారు గదా... మీరు మూడు పైసలు గిట్టే ఇడ్లీని పదిహేను పైసలకి అమ్మడం న్యాయమేనంటారా? ఇది దోపిడీ కాదూ?" నా ప్రశ్నకు ప్రక్కనే ఫిరంగి పేలినట్లు ఉలిక్కిపడ్డాడు ఆయన. క్షణాల్లో తేరుకుని, "చొప్పదంటు ప్రశ్నలంటే ఇవే. చిన్నంతరం పెద్దంతరం లేకుండా, చూశావా, నీ కొడుకు ప్రశ్నలు?" అని అమ్మతో గసురుకున్నాడు. మా అమ్మ నా ప్రవర్తనకి కించపడ్డట్టు పక్కకి తప్పుకుంది. మేము తిరిగి వచ్చేశాం. తనంటే నాకున్న అభిప్రాయాలన్నిటికీ... ఈ సంఘటన...

ముక్తాయింపుగా తోచిఉండాలని నా అంచనా.

ఆ తర్వాత మళ్లీ ఆయన్ని నేను కలవలేదు. బియ్యే ఆపి ఉద్యోగంలో పడటం; అమ్మ మరణం, రమతో పెళ్లి, పిల్లలు; సంసారం జంఝాటం, హైదరాబాద్ నగర యాంత్రిక జీవనం... సాగిపోతోంది.

బస్ తెనాలికి వచ్చేసింది.

కళకళలాడే కొత్త బస్స్టాండు, చాలా ఎత్తు ఎదిగిన రోడ్లు; కాలవలకు అటూ ఇటూ పిట్టగోడలూ మారాలని ప్రయత్నం చేస్తూ మారలేకపోతున్న మధ్యతరగతి వాడిలా వుంది మా వూరు. చిత్రమైన అనుభూతికి లోనయ్యింది మనస్సు.

నేను ఇంటికి వెళ్లేసరికే బ్రహ్మానందంగారు ఇహలోకంనుంచి వెళ్లి పోయారు. క్రితం రాత్రి ఆయన అసువులు వీడారు.

ఆయన సంతానం... కోడళ్లూ, అల్లుడ్లూ అంతా అక్కడ చేరివుంది. శవదహనానికి ఏర్పాట్ల గురించి ఎవరూ పట్టించుకోవడంలేదు. అంతా ఏవో తర్జనభర్జనల్లో మునిగివున్నారు.

గోడవారగా కూర్చున్న నరసమ్మ నన్ను చూసి లేచి వచ్చింది. నేనూ ఆవిడా వసారా మెట్ల మీద కూర్చున్నాం.

"వారం రోజుల క్రితం ఆయన మంచాన పడ్డారు. ఈ వారం రోజులూ ఆయన ఎంత బాధపడ్డారో..." నరసమ్మ గొంతు పూడుకపోయింది. చీరచెంగుతో కళ్లొత్తుకుంది. మాటలు పెగల్చుకుని చెప్పింది, "నిన్ను చూడాలి, పిలిపించమన్నారు." ఆలస్యమైంది. చూపులు దక్కలేదు.

ఆయన కొడుకులూ, కూతుళ్లూ మా కేసి చూసి మొహాలు మాడ్చుకునీ, మూతి విరుచుకునీ, చూపులు మరల్చుకొన్నారు. గుండెల్లో అనుమానం, భయం, సందేహం; ... ఇన్ని రకాల అగ్గి రగులుతుంటే మొహాలు మాడి పోకుండా వుంటాయా?

నరసమ్మే అన్నది, "నీకు తెలుసో తెలియదో గానీ; ఆ వేళ నువ్వూ మీ

అమ్మా డబ్బుకోసం వచ్చి వెళ్లారు గుర్తుంది కదూ... అప్పట్నుంచీ ఆయన వ్యాపారం ఎత్తేశారు."

నేను ఆశ్చర్యపోయాను. అంటే.. నా మాటలు ఆయనమీద అంత తీవ్రంగానూ, అంత త్వరగానూ పనిచేశాయన్న మాట!

క్షణాల తర్వాత అప్పుడు నలుగుతున్న సమస్య తెలిసింది నాకు. ఆయన ఆస్తిపాస్తుల గురించి తెలియనిదే శవ దహనానికి పూనుకోరట... కొడుకులు.

సుబ్రమణ్యంగారు వచ్చారు. ఆయన లాయరూ, మా పెదనాన్నకి మంచి మిత్రుడూ. ఆస్తిని బ్రహ్మానందంగారు ఏం చేశారో విల్లు చదివి వినిపించాదు ఆయన.

అదివిని అంతా రిచ్చపడ్డారు. నేను నరసమ్మ మొహంలోకి చూశాను. ఆవిడ నిర్లిప్తంగా శూన్యంలోకి చూస్తోంది. కొబ్బరిచెట్టు మొదట్లో కూర్చున్న అల్లుడు... తువ్వాలా విదిలించి తలకు చుట్టాదు; సిగరెట్ వెలిగించుకున్నాదు. "ఇహ పదండోయ్. చావు కబురు చల్లగా తెలిసిందిగా". అన్నాడు... బావమరుదుల్ని ఉద్దేశించి.

అంతా శవంమీదగా నడుచుకుంటూ వెళ్లిపోయారు. ఊళ్లో జనం ముక్కున వేలేసుకున్నారు; ఛీ కొట్టారు; తలో మాటా అన్నారు.

ఆ తర్వాత కార్యక్రమాన్ని నేనే పూర్తిచెయ్యాల్సి వచ్చింది.

ఆ రాత్రి...

ఇన్ని మజ్జిగనీళ్లు తాగి పడుకున్నాను.

సుబ్రమణ్యంగారు వచ్చేరు. విల్లులో విషయాల్ని మళ్లీ వివరంగా చెప్పేరు. ఒక బిల్డింగ్‌నీ, లక్షరూపాయల నగదునీ పాఠశాలకు రాశారు. దానికి ఆయనా నేనూ ట్రస్టీలం. మిగిలిన స్థిర చరాస్తులన్నీ నరసమ్మకి చెందుతయ్. ఇదీ సారాంశం!

ట్రస్ట్ భవిష్యత్ కార్యక్రమం గురించి మళ్లీ రాస్తానన్నాదు.

కర్మాంతరాలు కాగానే హైదరాబాద్ తిరిగి వచ్చేశాను.

...జరిగిందంతా విని సన్నగా నవ్వింది, రమ. బ్రహ్మానందం పెదనాన్న నన్ను చూడాలని ఎందుకు పిలిపించమన్నాడో అర్థంకాలేదునాకు.

...నెల రోజులు గడిచినై.

నరసమ్మ వచ్చింది, ఆశ్చర్యపోయాను. పరామర్శలయ్యాక చెప్పింది "ఆస్థిని ఆయన సంతానానికి రాయించి రిజిష్టర్ చేయించాను. ఇప్పుడు ప్రాణం తేలికపడింది. నెత్తిమీదినుంచి బరువు దించినట్లైంది. ఏదో, ఈ కట్టెనీ నీ చేతులమీదుగానే వెళ్లిపోనీ!"

ఆత్మ లభించినట్లయింది నాకు, నా పాత ట్రంకుపెట్టె మూలగావున్న అర్థరూపాయి గుర్తొచ్చింది. సూర్యుడిలా వెలిగిపోతోంది...నరసమ్మ. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుడిచుట్టూ కూడా తిరుగుతోంది.!!!.

(యువ మార్చి,1983)



# ఒకరిద్దరుచాలు

'ఎందుకో నాకు మనస్కరించడంలేదు' అని తనలో తాను అనుకున్నది - సునీత.

అప్పుడే హైదరాబాద్ నుంచి వచ్చాడు ప్రభు. అతను తండ్రికి చెప్తున్నదంతా శ్రద్ధగా విన్నది సునీత.

మనసంతా కలచినట్లయిందామెకు.

'నాకు మనస్కరించడంలేదు'. ఈసారి పైకే అన్నాననుకున్నది కానీ, ఆ మాట పెదవిదాటి బయటికి రాలేదు.

సునీతకు సన్నగా నవ్వొచ్చింది.

ఇంత చిన్న వాక్యాన్ని తను ఎందుకు చెప్పలేకపోతోంది. చిత్రంగా వుంది. విశ్వవిద్యాలయ వక్తృత్వ పోటీలో మొదటి బహుమతి గ్రహీత! అవును తన వాగ్ధాటికి అంతకు ముందు కూడా చాలా బహుమతులు తెచ్చుకుంది.

నిజానికి అమ్మ పోకముందు ఆమె 'వసపోసిన పిట్ట' అని చాలా తరచుగా తనను అంటూ వుండేది.

మరి ఇప్పుడెందుకని ఇలా అయిపోతున్నది?

శ్యామల అంటూ వుండేది, "సునీత ముందు మనమంతా మూగవాళ్ళమే" అని. తమ జట్టులో తాను పరమ పెంకి అనీ, మనసులో మాటని ఫెళ్ళున పైకి అనేస్తుందనీ తనకు పేరు.

అలాంటిది ఇప్పుడు తన మనసులోని మాటను తనకు ఇష్టం కాని విషయాన్ని గురించి పైకి అనలేకపోతుందేమిటి?

తెలియకుండానే సిగ్గుపడింది, సునీత.

కొంగు కొసని తీసుకుని వేలికి చుట్టుకుంది. చుట్టూ చూసింది.

నూతి చప్టా మీద ఆరపోసిన మినుములు దగ్గర పిచ్చుకలు కిచకిచలాడుతున్నై. సన్నగా గాలి వీస్తోంది. పెరటిమూలగా వున్న వేపచెట్టుపై కాకి వొకటి వుండుండి కూస్తోంది.

పక్కనేవున్న బెత్తంతో పిచ్చుకల్ని అదిలించింది సునీత. అవి ఎగిరిపోయినై.

మళ్ళీ ఆలోచనలో పడింది.

అసలు మొదట్లోనే తాను సందేహించింది - అవతల మనుషులు బాగా భేషజం, అతిశయం ఉన్నవాళ్ళని వరుడి తండ్రిని గురించి విన్నప్పుదే తనకు అలా అనిపించింది.

ప్రభు తండ్రికి చెప్పిన మాటల్ని నెమరువేసుకుంది సునీత. "నా కేమిటి మాష్టారూ మాకున్నది ఇద్దరు కొడుకులు, ఒక్క ఆడపిల్ల. మగపిల్లల మీద నాలుగు లక్షలు తీసుకుంటాను. కావాలంటే రెండు లక్షలు ఆడపిల్లకి ఖర్చుచేస్తాను. నా కొడుకులు రత్నాల్లాంటివాళ్ళు. ఒకడు ఎమ్‌టెక్, ఇంకొకడు డాక్టర్. న్యాయానికి.. కో అంటే కోటిమంది నా వాకిలి ముందు మూటలు పుచ్చుక్కూర్చున్నారు. నేను తల పంకిస్తే చాలు ఎగరేసుకుపోవాలని చూస్తున్నారు. మీకు తెలుసు కదా! అసలిదంతా ఎందుకు? మా ఆస్తీ అంతస్తూ సంగతేమిటి? ఏదో మీ సంబంధం నాకు మరీ కావలసిన మిత్రుడు చెప్పాడు కదా అని ఆలోచిద్దామంటున్నాను ..." అన్నాడట.

ఇదీ ఆయన వరస. ఆయన మాటల ధోరణిని గురించి తెలుసుకున్నప్పుడు వాళ్ళని గురించిన తన వూహ నిజమేనని తేల్చుకుంది, సునీత.

"సునీతా -" ప్రభు పిల్చాడు.

లేచి లోపలికొచ్చింది.

"నాకు నీళ్ళు తోడమ్మా" అంటూ, "వాళ్ళ చూపు ఆకాశంలో వుంది. చూడాలి ఏమౌతుందో" అన్నాడు - తండ్రి కేసి చూస్తూ. ఆ వివరణ తనను వుద్దేశించే చెప్పాడని ఇట్టే గ్రహించింది సునీత.

ఆ ఆదివారంనాడు పెళ్ళిచూపులు ...

రంగనాథం, చంద్రమతి, భారతి, రాజు, శివరావ్ వచ్చారు. రాజు వరుడు. భారతి అతని చెల్లెలు. శివరావ్ అతని తమ్ముడు. తల్లిదండ్రులతో కలిసి అంతా వచ్చారు.

పరిచయాల తర్వాత టిఫిన్, కాఫీలు అయినై.

శ్యామలే ఏర్పాట్లన్నింటికీ ఆధ్వర్యం వహించింది. తాను మధ్యమధ్యలో కల్పించుకుని ఆ పనీ, ఈ పనీ చేయబోతే – "నీ పెళ్ళికి నువ్వే పౌరోహిత్యం చేయకూడదే అమ్మదూ, కావాలంటే నా పెళ్ళిచూపులప్పుడు బదులు తీర్చుకో" అంటూ ఫెళ్ళున నవ్వేసింది.

తన మనస్సు చివుక్కుమంది. ఇద్దరూ తల్లిలేని పిల్లలే. కళ్ళలో నీళ్ళు తిరిగినై. శ్యామల చూసింది. బుజం మీద తట్టి, "పిచ్చి మొద్దూ – మన అందర్లో మహా ధైర్యవంతురాలివనే పేరు కొట్టేశావ్ గానీ, వఠి మేకపోతు గాంభీర్యమే అన్నమాట. వూరుకో" అని ఆప్యాయంగా అంది.

శ్యామలా, సునీతా హాల్లోకొచ్చి కూర్చున్నారు.

నెమ్మదిగా తలెత్తి పెళ్ళివారి వైపు చూసింది సునీత.

చంద్రమతి చాలా ఆడంబరంగా వుంది. మెళ్ళో నాలుగు పేటల చంద్రహారం కంటె, చేతికి వంకీలు, నడుముకు వడ్డాణం, చెవులకు రవ్వల దిద్దులు, చేతులకు ఆరు జతల బంగారు గాజులు, కట్టిన పట్టుచీర మూడు వేల రూపాయల విలువ చేస్తుంది. భారతి వంటిమీద చాలా జహ్వారీ వుంది. పాపిట చేరు, చెవులకి పెద్ద పెద్ద రింగులూ, మెళ్ళో నెక్లెసూ, రెండు పేటల బొట్ల గొలుసూ, కుడిచేతికి నాలుగు బంగారు గాజులూ, ఎడమచేతికి క్వార్ట్జ్ వాచీ.

సునీత కాలేజీ చదువు గురించీ, ఆమె తెలివితేటల్ని గురించీ, ఎమ్మే వరకు ఫస్ట్‌క్లాస్‌లో పాస్ కావడం మొదలైన విషయాలు వాళ్ళతో చెప్తూ కూర్చున్నాడు ప్రభు.

కొద్దిసేపటి తర్వాత రంగనాథం అన్నాడు "ధర్మారావుగారూ ... మాకు

ఇంకా రెండుమూడు ఆఫర్లు వున్నై. అవి కూడా చూసిన తర్వాత మీకు కబురు చేస్తాను".

తండ్రి తలవూపేడు గానీ, సునీతకి మనస్సు కలుక్కుమంది.

సునీత కేసి మరోమారు నిశితంగా చూసి ముందుకు నడిచేడు రాజు. వాళ్ళు వెళ్ళిపోయారు.

"ఏమంటావోయ్" అని పరిహాసంగా అడిగింది శ్యామల.

సునీత సన్నగా నవ్వి వూరుకుంది.

"ఎందుకనో నాకు మనస్కరించడం లేదు" అని తనలో తాను మాత్రం అనుకుంది. కానీ, పైకి అనలేకపోయింది.

రాత్రి - ఆరుబయట మంచం మీద పడుకుని వుంది సునీత. నల్లని ఆకాశాన్ని, తెల్లని నక్షత్రాల్నీ చూస్తోంది. చల్లని గాలి విరజాజి పందిరి మీంచి పరిమళాల్ని మోసుకొస్తోంది.

తండ్రీ, అన్నా పక్కన మంచాల మీద పడుకుని ఈ సంగతులే ముచ్చటించుకుంటున్నారు.

ప్రభు అంటున్నాడు, "పిల్లవాడు మంచివాడనీ, మంచి ఉద్యోగమనీ చూస్తున్నాం కదా. వాళ్ళ నిర్ణయం రానీయండి, ఆలోచిద్దాం".

సునీత ఆలోచనలో పడింది. వాళ్ళ నిర్ణయం ఎలా వుంటుంది? ఎలావున్నా సరే తన మనసులో మాట చెప్పేస్తే ? - ఈ సంబంధం అన్ని విధాలా మంచిదని చాలా కష్టపడి వాళ్ళని, వొప్పించి, పెళ్ళిచూపులు ఏర్పాటు చేయించారు. ఈ దశలో తాను అభ్యంతరం చెప్తే ... నాన్నా, అన్నయ్యా బాధపడతారు. తన పెళ్ళి గురించి చాలా అవస్థ పడుతున్నారు.

వారం గడిచింది.

రంగనాథం నుంచీ వుత్తరం వచ్చింది. తాను చదివి కొడుక్కి ఇచ్చాడు ధర్మారావు. ప్రభు కూడా చదివేడు. "రేపే వెళ్ళి మాట్లాడివద్దాం" అంటూ వుత్తరాన్ని

పక్కనే వున్న చెల్లెలి చేతికిచ్చాడు.

సునీత చదువుకుంది.

"మేము చూసిన సంబంధాల్లో ఆస్తీ అంతస్తుల దృష్ట్యా మిగిలినవన్నీ మీ కంటే ఎంతో మిన్నగా వున్నై. అయినా పిల్ల ఎత్తరిగా వుండాలని మా అబ్బాయి కోరిక దృష్ట్యా మీ పిల్ల నచ్చింది. మీరిక్కడికి వచ్చి మిగిలిన విషయాలు మాట్లాడుకోవలసినది".

'పెద్ద హిపోక్రట్‌లా వున్నాడు' కోపం వచ్చింది సునీతకి.

ఇప్పుడన్నా తన మనసులో మాటని తండ్రికీ, అన్నకీ చెప్పాలని అనుకున్నది గానీ చెప్పలేదు.

తనలో తానే అనుకున్నది – "ఎందుకనో నాకు మనస్కరించడం లేదు".

మర్నాడు – హైదరాబాదు వెళ్ళారు ధర్మారావూ, ప్రభూ.

వాళ్ళిద్దరూ వూళ్ళో లేనప్పుడు శ్యామల సునీతకు తోడుగా వున్నది.

మూడోరోజు ఉదయం అన్నా, తండ్రీ తిరిగొచ్చారు. వాళ్ళిద్దరి ముఖకవళికల్ని గమనించి వెళ్ళినపని ఏమైందని ధైర్యం చేసి అడగలేకపోయింది సునీత.

వాతావరణం గంభీరంగా వుంది. ఎవరి పనుల్లో వారు వున్నారు. ధర్మారావు వాలుకుర్చీలో పడుకుని దినపత్రికని తిరగేస్తున్నాడు. ప్రభు ఆఫీసుకు పోవడానికి తయారౌతున్నాడు.

టిఫిన్ సిద్ధం చేసి పిలిచింది సునీత.

నలుగురూ డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నారు.

"నెక్స్ట్ ప్రోగ్రాం ఏమిటి?" వాతావరణాన్ని ఈజ్ చేయాలనే వుద్దేశ్యంతో తన సహజ హాస్య ధోరణిలో అడిగింది శ్యామల.

శ్యామల కళ్ళల్లోకి చూస్తూ "కాఫీ తాగడం" అన్నాడు ప్రభు. తలెత్తి

కూతురి కేసి చూశాడు ధర్మారావు.

శ్యామల, సునీత సన్నగా నవ్వుకున్నారు. తండ్రి ఏదో చెప్పబోయేలోగా ప్రభు అన్నాడు, "మంచిరోజు చూసి తాంబూలాలు పుచ్చుకోవడానికి వస్తారు వాళ్ళు".

"నేను కొంచెం వెనకాముందూ ఆలోచించుకుందామని ఆగమన్నాను. కానీ మీ అన్నయ్య వాళ్ళడిగిన కట్నానికి వొప్పేసుకుని వచ్చాడు. ఎక్కణ్ణుంచి తెస్తామో ఏమో" కూతుర్ని ఉద్దేశించి అన్నాడు ధర్మారావు.

శ్యామల, సునీత వొకరి మొహాలొకరు చూసుకున్నారు. శ్యామల కళ్ళు చికిలించి సన్నగా ఈల వేసింది. సునీత తల వంచుకుంది.

క్షణాల తర్వాత అన్నాడు ధర్మారావు "లక్షకి రూపాయి తక్కువైనా కుదరదన్నారు వాళ్ళు".

"లక్ష...!" శ్యామలా, సునీత ఇద్దరూ తమలో తాము గొణుక్కున్నట్టుగా అన్నారు.

"తప్పదు మరి. మార్కెట్లో రేట్లు ఇంకా మండిపోతున్నై. రంగనాథం గారు అన్నట్టు ఇది చాలా చౌక బేరమే" అని చెల్లెలి కేసి చూశాడు ప్రభు. ఆమె చూపుల్లో చాలా ప్రశ్నలు చదువుకున్నాడు.

తలవంచుకుని చెప్పసాగేడు. "మన తాహతుకి ఇది ఎత్తలేని బరువే. పెద్ద కష్టమైన పనే. కాదనను. కానీ, పరిస్థితులు అలా వున్నై. ఎక్కడో ఒకచోట చూద్దాం. జస్ట్ ఎడ్జస్ట్‌మెంటే గదా. రేపు నేను కట్నంగా తీసుకునే డబ్బు సర్దుబాటు చేద్దామని చెప్పి నేనే వొప్పించాను నాన్నని".

సునీతా, శ్యామలా ఇద్దరూ ప్రభు మాటలకి ఆశ్చర్యపోయారు. వాళ్ళ ఆశ్చర్యానికి కారణం ప్రభుకు తెలియనిది కాదు. అందుకే అన్నాడు, "నలుగురితో బాటు నేనూ నారాయణా అనుకున్నాను. వాస్తవంతో బతక్క తప్పదు. జీవితంలో అడుగడుగునా రాజీపడక తప్పదు మరి. ఇక్కడి కీ బాధ్యత తీరుతుంది".

అందరూ మౌనం వహించారు. యాంత్రికంగా కాఫీలు ముగించారు.

మరో గంటకి శ్యామల వెళ్ళిపోయింది.

పన్నెండున్నరయింది.

పనులు పూర్తి చేసుకుని తన గదిలో పడుకుని దినపత్రిక చూడసాగింది సునీత. బాక్స్ కట్టి తాటికాయంత అక్షరాల్లో వార్త – "వరకట్నానికి మరో అబల బలి".

సునీత మేధస్సుని ఆలోచనలు ముసురుకున్నై. పత్రికని పక్కన పడేసింది.

తన ఆదర్శాలూ, ఆశయాలూ, ఆచరణా అన్నీ వొక్కసారిగా గుర్తుకొచ్చినై ఆమెకు. అంతర్విశ్వవిద్యాలయ వక్తృత్వ పోటీల్లో తన ఉపన్యాసం గుర్తుకొచ్చింది. అక్కడ అదే విషయం మీద పోటీ జరిగింది. వరకట్నం గురించిన సమస్త వివరాలూ తనకు క్షుణ్ణంగా తెలుసు. సాంఘికంగా, నైతికంగా, చట్టపరంగా ఈ దురాచారంలోని లోపాల్ని తను తూర్పార పట్టింది. వ్యవస్థలో మార్పు రావాలన్నది. వ్యక్తిలో మార్పు రావాలన్నది. అందుకు అనుగుణంగా యువతీ యువకులు ఆదర్శాన్ని ఆచరణలో పెట్టాలన్నది.

కాలేజీలో పదిమంది ముందూ తన వాదనని వినిపించింది. మిత్రబృందంతో చర్చించింది. పెద్దల్ని కొంటె ప్రశ్నలు వేసి అనేక సందర్భాల్లో ఇరకాటాన పడేసింది.

కానీ, ఈనాడు తాను చేస్తున్నది ఏమిటి? తాను మాత్రమే కాదు. తన వలన ప్రభు కూడా అతని ఆదర్శాన్ని గాలికిపోయిన పేలపిండిలా మార్చేసుకుంటున్నాడు. ఏమిటీ విషవలయం? – ఇదంతా ఎందుకిట్లా జరగాలి? దీనికి తానూ తలవొగ్గవలసిందేనా? కాదు – తను 'ఎందుకనో నాకు మనస్కరించడం లేదు' అని తన మనసులోని మాటను చెప్పేయాలి.

తలుపు తట్టిన శబ్దానికి ఉలిక్కిపడి లేచింది సునీత.

ప్రభు లంచ్‌కి వచ్చాడు. సునీత ఆలోచనల్లోంచి తేరుకుంది.

ఆ సాయంత్రం శ్యామల దగ్గరికి వెళ్ళింది సునీత. తాను అనుభవిస్తున్న

మానసిక సంఘర్షణని ఆమెకి చెప్పింది. ఇద్దరూ తమ అభిప్రాయాల్ని కలబోసుకున్నారు.

చివరికి అన్నది శ్యామల, "మీ అన్నయ్య చెప్పాడు గదా. వాస్తవంలో బతక్క తప్పదు. జీవితంలో అడుగడుగునా రాజీ పడక తప్పదు మరి. మనకేమీ నెత్తిన కొమ్ములు మొలవలేదు గదా కానీయ్ ... ఏం చేస్తాం."

తాంబూలాలకు కూర్చున్నప్పుడు మరోసారి ప్రయత్నించింది సునీత - "ఎందుకనో నాకు మనస్కరించడం లేదు" అని తన మనసులో మాట చెప్పాలని. కానీ, ఆడతనం అడ్డొచ్చి చెప్పలేకపోయింది.

ఆ తర్వాత అన్ని పనులూ త్వరత్వరగా జరిగిపోయినై.

పెళ్ళి కూడా ఆడంబరంగానే జరిగింది.

తమ అంతస్తుకి తగినట్టుగా సకల మర్యాదలూ జరిగినందుకు రంగనాథం గారి కుటుంబం తృప్తి పడింది.

ఆ రోజు -

తొలిరేయి ...

ఉద్విగ్నమైన మనస్సుతో గదిలోకి ప్రవేశించింది సునీత.

రూపలావణ్యంలో ముగ్ధమనోహరంగా వున్న భార్య చేయందుకుని పాన్పు దగ్గరికి నడిపించేడూ - రాజు.

మంచం మీద కూర్చుంది సునీత.

ఆమె చుబుకాన్నెత్తి ముఖాన్ని తన వైపు తిప్పుకున్నాడు రాజు. ఆమె కనుకొలకుల్లో నీళ్ళు.

రాజు విచలితుడైనాడు.

"ఎందుకనో నాకు మనస్కరించడం లేదు" అంటూ ఠక్కున మంచం మీద నుంచి దిగి పక్కగా నిలబడింది సునీత.

ఉరుము వురిమిందో పిడుగు పడిందో తెలిలేదు రాజుకి. క్షణంలో సగం సేపు గాలి స్తంభించినట్లయింది. మరుక్షణం తనను తాను సంబాళించుకున్నాడు. బుద్ధి పనిచేసింది. నెమ్మదిగా కదిలేడు.

సునీత వెనగ్గా నిలబడి ఆమె నడుము మీద చెయివేసి పొదివి పట్టుకున్నాడు.

ఆమెలో నిరసన అలవోకగా కదిలింది.

ఆమె కళ్ళముందు తన షర్టు జేబులో నుంచీ తీసిన కాగితాన్ని రెపరెపలాడించాడు రాజు.

కళ్ళు విచ్చుకుని చూసింది సునీత. తన పేరున లక్ష రూపాయల డ్రాఫ్టు!

ఆశ్చర్యం, ఆనందం కలిసి తబ్బిబ్బు చేసినై ఆమెను.

"ఆకారంలోనే కాదు, ఆదర్శంలో కూడా ఉన్నతమైన దానివని తెలుసుకున్నాను. నూరేళ్ళ జీవితంలో నీకు మనస్కరించని పనిని చెయ్యడం నాకూ మనస్కరించదు. అందుకని మన అందరి వ్రతమూ చెడినట్లు అనిపించినా, ఫలం దక్కేటట్లు చేశాను" అని. "అవును" అన్నట్లు కళ్ళు చికిలించాడు రాజు.

"థాంక్స్" అని ఇంకా ఏదో అనబోయింది సునీత.

"అవన్నీ మీ కాబోయే వదిన - అదే మీ శ్యామలకి. నాదీ వో బండి కంకర" అని నవ్వేశాడు రాజు.

ఆశయ సాఫల్యం, అనురాగరాగాన్ని అమృతమయం చేసింది.

ఆ తర్వాత అక్కడ అంతా పూలజల్లు!!!

(యువ ఏప్రిల్ 1986)

# మౌనరాగాలు

సరోజ మనస్సు ఒక్కసారి భగ్గుమంది.

ఆమె చెవుల్లో ఆనంద్ చెల్లెలు రమణి మాటలే గింగురుమంటున్నై. "పెళ్ళయ్యాక కూడా వుద్యోగం చెయ్యాలనుకుంటున్నావా నువ్వు?".

కనీసం 'మీరు' అని కూడా సంబోదించకుండా అడిగిన ఆ ప్రశ్నలో ఓ విధమైన 'గీర' కనబడింది సరోజకు. అయినా నెమ్మదిగా "అప్పటి పరిస్థితి బట్టి" అన్నది.

రమణి అంతటితో వూరుకోలేదు. "పెళ్ళయ్యాక కూడా నీచేత వుద్యోగం చేయించాల్సిన ఖర్మేం లేదు మాకు" కళ్ళెగరేస్తూ 'నేను గాక యిలా మాట్లాడుతున్నాననే' భావం మొహంలో ప్రస్ఫుటింపచేస్తూ అన్నది రమణి.

సరోజకు కోపం పొంగుకొచ్చింది. తమాయించుకుంది, రమణి ఆఫీసర్ భార్య అయితే అవుగాక. ఇంత మర్యాద లేకుండా మాట్లాడటాన్ని భరించలేకపోయింది.

రవి ఆనంద్‌ని ఏదో ప్రశ్నించడంతో ఆ సంభాషణ అంతటితో ఆగిపోయింది.

"ఏమ్మా, సరోజా భోజనం చేశావా?" సరస్వతమ్మ మాటలతో ఈ లోకంలో పడింది – సరోజ.

"ఇంకా లేదండీ, చెయ్యాలి".

"పొద్దుపోతోంది చెయ్యి, అది సరే గానీ, ఇంతకీ ఏం నిర్ణయం తీసుకున్నావ్? అబ్బాయి బాగానే వున్నాడు. ఒప్పుకున్నట్లేనా?".

"లేదు పిన్నిగారూ, యింకా నిర్ణయించుకోలేదు. ఎటూ తేల్చుకోలేకపోతున్నాను. అతని చెల్లెలి ధోరణి చూశారు కదా. ఆ అమ్మాయి అసలు మర్యాద తెలీని మనిషిలా అనిపిస్తోంది. ఆ అమ్మాయి మాటల్ని తలుచుకుంటే

నా మనస్సు వెనక్కి అడుగేస్తోంది. ఈ సంబంధం నేను చేసుకోలేననిపిస్తోంది. అయినా లోగడ ఆరుసార్లు జరిగిన విషయాల్ని, నా నిర్ణయాల్ని మీకు చెప్పాను గదా! నాదే తప్పనిపిస్తోందా మీకు?" సరోజ మాటల్లో రోషం తొంగిచూసింది.

ప్రక్క వరండాలోంచి సరోజ మాటల్ని వింటున్న రవి నెమ్మదిగా అక్కడికి చేరేడు.

"ఆ అమ్మాయి రేపో మాపో అత్తవారింటికి వెళ్ళిపోతుంది. నీకు బాధేముంది. వేరే బాదరబందీ లేమీ లేవు. ఆమె వచ్చినప్పుడు కాస్త జాగ్రత్తగా వుంటే సరి, నీ మనస్సు తెలుసుకుని తనే నీతో కలిసిపోతుంది. ఈ మాత్రం దానికి ఇంత ఆలోచన అనవసరం సరోజా". నెమ్మది మీద ఎలాగైనా సరోజను ఒప్పించాలనే ధోరణిలో ఉన్నాడు రవి.

సరోజ ఏమీ మాట్లాడకపోవడంతో, "సరే నీ యిష్టం, ఏమాలోచిస్తున్నావో, ఏం నిర్ణయించుకుంటావో, నీకు వెనకాల ఎవ్వరూ లేరన్నావ్ కనుక, నువ్వా ఒకింటిదానివయితే చూడాలనుకున్నాను. కానీ, ఎప్పటికేది జరగాలో అప్పటికే జరుగుతుంది. పద రవీ" అంటూ వెళ్ళిపోయింది - సరస్వతమ్మ.

"ఆడదానికి వివాహం అంత అవసరమా రవీ."

సరోజ మాటలకు చిన్నగా నవ్వేడు రవి.

"ఒక్క ఆడదానికే పెళ్ళి అవసరం అని ఎవరన్నారు - సరోజా ! ఆడదానికి వివాహం ఎంత అవసరమో మగవాడికి అంతే అవసరం. ఇందులో ఎవరికి అవసరం, ఎవరికి అనవసరం అనే ప్రశ్నకు తావేలేదు. వయసులో వున్నప్పుడు తెలియకపోయినా, జీవితంలో ఎప్పటికైనా ఒక తోడు అవసరం అనే నా అభిప్రాయం".

"మరి ఇన్ని అభిప్రాయాలుంచుకుని నువ్వెందుకు పెళ్ళి చేసుకోలేదు?"

సరోజ ప్రశ్నకు తడబడ్డాదు రవి.

"ఇప్పుడు చేసుకోవాలనే అనుకుంటున్నాను"

సరోజ మరేం మాట్లాడలేదు.

"సరే నేను వెళ్తున్నాను. మరీ పిచ్చిగా ఆలోచించకు. రేపు ఆదివారం కదా, నీ అభిప్రాయాన్ని ఎల్లుండి ఆఫీసులో చెప్పమన్నాడు ఆనంద్".

సరోజ ఇంకా ఆలోచనలోనే వుండిపోయింది.

క్షణాల తర్వాత నెమ్మదిగా వెళ్ళిపోయేడు రవి.

సరోజ ఆలోచనల్లో గతం చోటు చేసుకుంది.

మొదటిసారి పెళ్ళి చూపులప్పుడు రామ్మూర్తి వచ్చేడు. అతను ఎం.కాం. ప్యాసై ఇంకా ఉద్యోగ అన్వేషణలోనే ఉన్నాడు. కొత్తల్లో పరిస్థితి సరదాగా వున్నా, పోనుపోను అతను ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుకు లోనయ్యే ప్రమాదముందని భయపడి ఆ సంబంధాన్ని వదులుకుంది.

"రేపోమాపో వుద్యోగం దొరుకుతుంది. నీకా భయం అక్కర్లేద" న్నాడు రామ్మూర్తి.

ఆ రేపు ఎప్పటికొస్తుందోనని కాదంది.

రెండవసారి రఘు వచ్చాడు. అతనికి ఒక తల్లి తప్ప ఎవరూ లేరుట. మధ్యవర్తి ద్వారా కబురు చేశారు.

తనకు సాయంగా వుంటుందని తన ఆఫీసులో పనిచేసే శారదని రమ్మంది తను.

తీరా అతన్ని చూడగానే - అతని తల్లికి క్షయ అనీ, మందులకి లొంగక ముదిరిపోయిందని, అతను తనకు బాగా తెలుసని చెప్పింది శారద.

ఈ పెళ్ళి చేసుకుని తాను అక్కడ సుఖపడేదేమీ వుండదని భయపడి మానేసింది.

మూడవసారి రాజారావు వచ్చాడు. అతను స్టేట్ బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు.

అతనితోపాటు రవి వచ్చేడు. రవి, అతను కలిసి పనిచేస్తున్నారు. అప్పుడే

తనకు రవితో పరిచయమైంది.

రాజారావు విడిగా బాగానే వున్నాడు గానీ, తన ప్రక్కన పొట్టిగా కనిపిస్తాడు. పొట్టిగా వుండటం వలన కుదేసిన గూటంలా వున్నట్లనిపించాడు. వరహీనం అవుతుందని అతన్ని కాదంది.

నాల్గవసారి నరేంద్ర వచ్చాడు.

ఆ రోజు ఆఫీసుకు సెలవు పెట్టింది.

మర్నాడు ఆఫీసుకు వెళ్ళగానే అందరూ కారణమడిగారు. వివరించింది.

"అతనా ! అతను గొప్ప గ్రంథకారుడు" అంటూ అతని రాసక్రీడలను వివరించారు. చూడటానికి ముచ్చటగా వున్న నరేంద్ర వెనకాల వున్న కథ, అతనంటే భయాన్నీ, అసహ్యాన్నీ కలిగించింది.

అతనితో తన నిర్ణయాన్ని చెప్పినప్పుడు అతనెంతో బాధపడ్డాడు.

నిజానిజాలు తనకి తెలీకపోయినా, అతని బాధ మాత్రం నటనే అని సమర్థించుకుంది.

ఐదవసారి ప్రసాద్ వచ్చాడు.

అతనితోపాటు అతని తండ్రి కూడా వచ్చాడు.

ప్రసాద్ అన్ని విధాలా తనకు నచ్చాడు. అతనికి తను నచ్చిందా లేదా అనే అనుమానమే లేదు.

కానీ, చివరికి వాళ్ళు వెళ్ళిపోతున్నప్పుడు అప్రయత్నంగా తన చూపులు ప్రసాద్ తండ్రి కాళ్ళమీద ఆగిన్నై.

వళ్ళు జలదరించింది. కాళ్ళ నిండా తెల్లటి బొల్లి మచ్చలు.

అంతే ! ఆ సంబంధం అక్కడితో ఆగిపోయింది.

విసిగిపోయిన తన ప్రాణం తప్పనిసరిగా ఆరోసారి కృష్ణను ఆహ్వానించింది.

అతని ఆకారం, ఉద్యోగం, జీతం అన్నీ తనకి నచ్చాయి.

కానీ, అతనికి వెనకాల గంపెడు సంసారం. అతనే పెద్దకొడుకు. అతనితో పాటు ఆ బాధ్యతల్ని తను కూడా పంచుకోవాలనీ, తనకిక స్వేచ్ఛగా కాలం గడపడం అనేది వుండదనీ, పంజరంలో పక్షి బ్రతుకులా అవుతుందని భయపడి ఆ సంబంధాన్ని వొదులుకుంది.

ఈ మధ్యలో రవితో పరిచయం పెరిగింది.

ఉన్నట్లుండి ఇంటివాళ్ళు ఇల్లు అవసరమైందనీ ఖాళీ చెయ్యమని అడగడంతో ఇరుకునపడింది. ఉన్న ఇల్లు ఆఫీసుకు దగ్గరగా వుంది. మళ్ళీ ఇళ్ళ వేటలో పడక తప్పలేదు.

ఆ సాయంత్రం రవి కలిసినప్పుడు ఇంటిని గురించి చెప్పింది. అతని సాయం కోరింది.

తమ ఇంట్లో వాటా ఖాళీగా వుందనీ, అభ్యంతరం లేకపోతే రేపే వచ్చి చేరమని చెప్పాడు.

మర్నాడే వచ్చి చేరింది. ఈ ఇంట్లోకి వచ్చి ఇంకా ఏడాది అవలేదు.

సరస్వతమ్మ ఎంతో ఆపేక్షగా కన్న కూతురిలా చూసుకుంటోంది.

ఆరు నెలల నాడు తను పనిచేస్తున్న ఆఫీసుకు కొత్తగా వచ్చిన ఆనంద్ తనకు బాగా దగ్గరయ్యేడు. వారం రోజుల నాడు తన అభిప్రాయాన్ని బయటపెట్టాడు.

తనకూ అభ్యంతరాలేమీ కనిపించలేదు.

అతని చెల్లెలు తనని చూడాలనీ, ఫలానా రోజు వస్తామనీ చెప్పాడు.

ఆ ముచ్చట కూడా ఈ రోజు తీరిపోయింది.

అతని చెల్లెలు ఇంత గడుసుదని తాననుకోలేదు. ఎలాగైనా భరించటం

కలత నిద్రతోనే తెల్లవారింది సరోజకు.

భోజనం చేసి తీరికగా పేపరు చదువుకుంటూ కూర్చుంది సరోజ.

"నిద్రపోతున్నావా" అంటూ వచ్చింది సరస్వతమ్మ.

ఆవిడ మంచి స్థూలకాయురాలు, నిశితమైన చూపు, మంచి వాగ్ధాటి కల వ్యక్తి. ఆవిణ్ణి చూసినవాళ్ళెవరికైనా గౌరవ భావం కలిగి నమస్కరించ బుద్ధవుతుంది.

"రండి" అంటూ పేపర్ ప్రక్కన పడేసింది సరోజ.

ఆవిడ వచ్చి సరోజకు కాస్త పక్కగా గోడకు ఆనుకొని కూర్చుంది.

ఆవిడ ఏదో చెప్పాలనే వుద్దేశ్యంతో వున్నట్లు అర్థం చేసుకుంది సరోజ.

ఇంతలో సరస్వతమ్మే మొదలెట్టింది, "మళ్ళీ అడుగుతున్నానని ఏమీ అనుకోకు. ఏం నిర్ణయించుకున్నావ్?".

సరోజ ఏం మాట్లాడలేదు. నేలచూపులు చూస్తూ కూర్చుంది.

ఆ మౌనంలోని అర్థాన్ని గ్రహించలేనంతటి అమాయకురాలు కాదు సరస్వతమ్మ.

"సరే ... నీ యిష్టం, నేను నీకు ఓ కథలాంటి నిజాన్ని చెప్తాను. అది విన్న తరువాతయినా నీ అభిప్రాయాన్ని మార్చుకుంటే సంతోషిస్తాను. అన్నట్టు మధ్యాహ్నం ఏ సినిమాకయినా వెళ్తావా? వెళ్ళనంటే చెప్తాను ..." అర్థోక్తిగా సరోజ వైపు చూస్తూ అందావిడ.

ఓ గంట ముందు బయలుదేరి శారదను తీసుకుని సినిమాకు వెళ్ళాలనుకున్న తన నిర్ణయాన్ని మనస్సులోనే కేన్సిల్ చేసుకుంది.

"అబ్బే - ఎక్కడికీ వెళ్ళడం లేదండీ. చెప్పండి వింటాను ..." అంటూ సర్దుకుని కూర్చుంది - సరోజ.

"నలుగురు అన్నదమ్ములు, నలుగురు అక్కచెల్లెళ్ళు ఉన్న ఇంట్లో పెద్ద కూతురిగా పుట్టింది లక్ష్మి.

మొదటి కానుపు గనుక కొన్ని ముచ్చట్లు బాగానే జరిగాయి.

లక్ష్మి తల్లికి పది కాన్పులూ జరిగేసరికి ఇంట్లో ఇక్కట్లు ప్రారంభమయ్యాయి.

లక్ష్మి కాలేజీ చదువు మధ్యలో వుండగానే తండ్రి పోయేడు.

వస్తున్న స్కాలర్షిప్‌తో డిగ్రీ పూర్తి చేసింది.

ఉన్న కాస్త పొలాన్నీ అమ్మేసి, వచ్చిన డబ్బు బ్యాంకిలో వేసి జాగ్రత్తగా గడుపుకొచ్చింది కొన్నాళ్ళు.

ఆ డబ్బు అయిపోతే, తరువాత తాము అనుభవించబోయే ఇబ్బందుల్ని తలచుకుని – ముందు జాగ్రత్తగా ఉద్యోగాల వేట ప్రారంభించింది.

ఒకరోజు మార్కెట్ నుంచీ వస్తుంటే కాలేజీ నాటి ఫ్రెండ్ కనిపించింది.

కుశల ప్రశ్నల తరువాత ఇంటి ప్రసక్తి వచ్చింది. తనకు ఉద్యోగపు అవసరాన్ని వివరించి చేతనైతే సహాయం చెయ్యమంది లక్ష్మి.

"రేపు మా యింటికి రా, మా నాన్నగారితో చెప్తాను" అంటూ అడ్రసిచ్చింది ఆ ఫ్రెండ్.

అనుకున్న టైముకి వాళ్ళ యింటికెళ్ళింది లక్ష్మి.

ఎక్కడికో వెళ్ళబోతున్న వాడల్లా లక్ష్మిని చూసి ఆగేడు స్నేహితురాలి తండ్రి.

వివరాలు తెలుసుకున్నాడు. 'నీకు వుద్యోగం వచ్చినట్లే' అని హామీ ఇచ్చేడు.

ఆయన పుణ్యమా అని అక్కడే వున్న హైస్కూల్లో టీచర్ వుద్యోగం వచ్చింది.

జీతంతోనూ, ప్రైవేట్ల మూలంగా వచ్చిన డబ్బుతోనూ, తమ్ముళ్ళ, చెల్లెళ్ళ అవసరాలు తీర్చడమే కాక విద్యావకాశాలు కల్పించింది. పెద్ద చదువులు చదివించింది. వాళ్ళతోపాటుగా తాను ఎం.ఏ. పూర్తి చేసింది. లెక్చరరుగా స్థిరపడిపోయింది.

తోడబుట్టిన వాళ్ళందరికీ మంచి సంబంధాలు చూసింది. పెళ్ళీ, పేరంటాలు చేసింది.

ఎవరి దారిన వాళ్ళు రెక్కలొచ్చిన పక్షుల్లా ఎగిరిపోయారు.

అంతవరకూ కాకాపట్టి తమ అవసరాలు తీర్చుకున్నవాళ్ళంతా లక్ష్మిని

పట్టించుకోవడం మానేశారు. లక్ష్మి వయసు, మనసు గ్రహించాల్సిన అవసరం లేకపోయిం దెవ్వరికీ.

ఇంత జీవితం జరిగిపోయాక తనని తాను అద్దంలో చూసుకుంది లక్ష్మి.

కాలం తనకేం మిగిల్చింది అని ప్రశ్నించుకుంది.

నెరిసిపోతున్న జుట్టునీ, ముడుతలు రాబోతున్న శరీరాన్నీ, తీరని అలసటనీ, చెరగని నైరాశ్యాన్నీ, చెదరని గుండె ధైర్యాన్నీ, నలభై ఏళ్ళ వయసునీ మిగిల్చింది.

కానీ, తాను అనుభవించటానికి తన జీవితమేమీ మిగల్చలేదన్న సత్యం ఆమె కంటిలో నీరు తెప్పించింది.

అకస్మాత్తుగా పక్షవాతంతో మంచాన పడిన తల్లిని చూసేసరికి లక్ష్మి మనసు గిజగిజలాడింది. వున్న గుండె ధైర్యం సడలింది.

ఎన్ని మందులు వాడినా లొంగలేదు తల్లి జబ్బు. పైగా లక్ష్మికి తోడెవ్వరూ లేరనే విషయం ఆ ముసలితల్లి గుండె తొలిచేయడం ప్రారంభించింది.

ఒకరోజు లక్ష్మిని దగ్గరకు పిలిచింది. "నిన్ను నీ చెల్లెళ్ళు, తమ్ముళ్ళు పూర్తిగా మరిచిపోయారు. వాళ్ళ అవసరాలకు వుపయోగించుకునే నీ డబ్బు తప్ప వాళ్ళకు నీ అవసరం లేదు. వాళ్ళను ఇప్పుడున్న స్థితికి నువ్వే తీసుకొచ్చిన విషయం వాళ్ళకు గుర్తులేదు. నేను మంచాన పడిన ఈ ఆరు నెలలనుంచీ నువ్వన్ని వుత్తరాలు వ్రాసేవ్, ఒకరు కాకపోతే ఒకరన్నా వొచ్చి నన్ను చూశారా? తల్లినైన నేనే వాళ్ళకు గుర్తు లేదు. ఇంక నువ్వేం గుర్తుంటావు. ఇప్పటికైనా నా మాట విని నీదనే ఒక తోడుని ఏర్పాటు చేసుకో. ఇరవై ఏళ్ళ నుంచీ చెప్పి చెప్పి విసిగిపోయింది నా ప్రాణం. ఇక నీ యిష్టం. నే నెన్ని రోజులో బ్రతకను. బ్రతికినా నీకు భారమౌతానే గానీ, నీ సమస్యకు పరిష్కారాన్ని మాత్రం కాను" అలసటలో చివరి వాక్యాన్ని సరిగా పలకలేకపోయింది.

మర్నాడు – ఈ లోకం నుంచే నిష్క్రమించింది లక్ష్మి తల్లి.

చావు కబురు తెలిసి కూడా అందరూ రాలేదు. వచ్చినవాళ్ళు మొక్కుబడిగా

వెంటనే వెళ్ళిపోయారు.

ఏకాకిగా మిగిలింది లక్ష్మి.

అప్పుడు తెలిసింది లక్ష్మికి - తానింతవరకూ ఎలాంటి జీవితాన్ని కోల్పోయిందో ! అయినా తన పిచ్చిగానీ, ఇప్పుడు తన నెవరు పెళ్ళి చేసుకుంటారు?

రోజులు దొర్లిపోతున్నై -

"ఎందుకండీ, ఈ మధ్య మీరు ఉత్సాహంగా ఉండటం లేదు. దిగులుగా కనపడ్తున్నారు. మీకు అభ్యంతరం లేకపోతే కారణం తెలుసుకోవచ్చా?"

తోటి లెక్చరర్ రాఘవరావు లక్ష్మిని అడిగేడు.

ఆరేళ్ళ నుంచీ ఇద్దరూ కలిసి పనిచేస్తున్నారు. అతని భార్య పోయి అయిదేళ్ళయింది. పిల్లలు లేరు.

ఆ రోజున -

అతని భార్య పోయినప్పుడు తనే ధైర్యం చెప్పింది.

ఈ రోజు - తనని అనునయిస్తున్నాడు. నవ్వుకుంది లక్ష్మి. తన పరిస్థితి అంతా అతనికి విప్పి చెప్పింది.

అంతా విన్నాడు. "ఈ రాత్రికి ఆలోచించి రేపు నా సలహా చెప్తాను. సరేనా..." అన్నాడు. 'సరే' అన్నట్లు తలవూపింది లక్ష్మి.

మర్నాడు, అతను చెప్పిన సలహా విన్న లక్ష్మి నిర్ఘాంతపోయింది. ఆమె కళ్ళల్లో సన్నటి నీటి తెర కదిలింది.

"మీకు అభ్యంతరం అయితే చెప్పండి. ముందుగా మీ మనస్సెలా వున్నదీ తెలుసుకోకుండానే నా వుద్దేశాన్ని బయటపెట్టాను. మిమ్మల్ని బాధపెట్టినట్లున్నాను, క్షమించండి...".

"ఆగండి"

ఆమె మాటలకు ఏమిటన్నట్లుగా నిలబడ్డాడు. చటుక్కున ముందుకు

నడిచి అతని కాళ్ళకు నమస్కారం చేసింది. అనుకోని ఆమె ప్రవర్తనకు అతను నిర్ఘాంతపోయేడు.

ఆ నెలలోనే ఇద్దరూ రిజిష్టరు మారేజి చేసుకున్నారు.

కులం, మతం ఇవేవీ ఆలోచించలేదు వాళ్ళు. ఇద్దరికీ మిగిలిన జీవితం గడపడానికి ఒక తోడు కావాలి. ఒకరికొకరు అండగా నిలిచి సుఖమైన జీవితాన్ని గడిపేరు.

ఆ తరువాత ఉద్యోగానికి రిజైన్ చేసి, తాను కోరుకున్న విధంగా ఇల్లు దిద్దుకుంది లక్ష్మి.

మళ్ళీ ఏడాదికి కొడుకు కూడా కలిగేడు.

అప్పుడు ఆమె అనుభవించిన తృప్తిని మాటల్లో వివరించలేను.

ఒక విషయం అడుగుతాను చెప్పు. నీకు ఆ లక్ష్మికి వచ్చిన సమస్యలు కానీ, బరువు బాధ్యతలు కానీ ఏమైనా వున్నాయా? లేవు. అయినా, నువ్వు వచ్చిన ప్రతి సంబంధాన్నీ ఏదో ఒక వంకపెట్టి పంపుతున్నావు. నీ వయస్సంతా అడవి కాచిన వెన్నెల చేసుకొంటున్నావు. వయస్సులో ఎంతో ధైర్యంగా బ్రతికినా, వున్న వోపిక కాస్తా హరించేటప్పటికి నీకో తోడు కావాలని తప్పనిసరిగా అనిపిస్తుంది".

అలుపు తీరదాని కన్నట్టు కాస్సేపు ఆగింది సరస్వతమ్మ.

నీ సమాధానం ఏమిటన్నట్టు సూటిగా సరోజ కళ్ళలోకి చూసింది ఆమె. సరోజ తలవంచుకుంది.

"లక్ష్మి ఎవరో అనుకుంటున్నావు కదూ. నేను నీ కోసం కల్పించిన పాత్ర అని కూడా అనుకుంటున్నావు కదూ. కానీ ఆ లక్ష్మిని నేనే .... నేనే".

సరస్వతమ్మ గొంతు జీరపోయింది. ఉద్విగ్నంగా వెనక్కు వాలి కళ్ళు మూసుకుంది.

క్షణాల తర్వాత నూతిలో నుంచి అంటున్నట్టు అన్నది, "తరువాత అయిదేళ్ళకు ఆయన పోయినా కూడా రవిని చూసుకుని బ్రతుకుతున్నాను ...".

నిర్ఘాంతపోయినట్లుగా చూస్తుండిపోయింది సరోజ.

సరోజ మనస్సులో అనేక ఆలోచనలు చోటు చేసుకుంటున్నై - ఒకే సెల్‌లో కుక్కిన ఖైదీల్లా, గాలి స్థంభించినట్లయింది. నుదురంతా చెమట పట్టింది. ముఖంమీద పడ్డ వెంట్రుకల్ని సవరించుకుంది.

ఆనంద్ రూపం కళ్ళముందు మెదిలింది. రమణి మాటలు చెవుల్లో మార్మోగినై. ఏవేవో భయాలూ, అనుమానాలు వలయాలు వలయాలుగా కదిలేయి. మలిగేయి. వాటన్నింటినీ వెనక్కి తోస్తూ - రవి ప్రత్యక్షమైనాడు.

"వయస్సులో వున్నప్పుడు తెలీకపోయినా, జీవితంలో ఎప్పటికైనా ఒక తోడు అవసరమనే నా అభిప్రాయం".

"మరి ఇన్ని అభిప్రాయాలున్నవాడివి నువ్వెందుకు పెళ్ళిచేసుకోలేదు"

"ఇప్పుడు చేసుకోవాలనే అనుకుంటున్నాను"

అతని మాటలు సరోజ చెవుల్లో ఏవేవో వూసులు చెప్తున్నట్లన్పించేయి.

తాను ఇంతకాలంగా అన్వేషిస్తున్న ఆత్మ ఇంత దగ్గరలోనే వుందని తెలిసి ఆశ్చర్యపోయింది - సరోజ.

ఇప్పుడంతా ఆనందంగా హాయిగా వుంది గాలి. ప్రక్కవీధిలో సన్నాయి మ్రోగుతోంది.

(యువ జనవరి, 1984)



# వలయం

'రామ్మూర్తి అప్రయోజకుడు' అని నాకు నేనుగా చాలాసార్లు అనుకున్నాను.

ఈ అభిప్రాయాన్ని నా నిర్ణయంగా కూడా చక్రపాణికి అనేకసార్లు చెప్పాను. రామ్మూర్తి చక్రపాణికి స్వయానా మేనమామ కొడుకు. చక్రపాణి తాడేపల్లి గూడెం వెళ్ళొచ్చినప్పుడల్లా అడిగేవాణ్ని నేను. 'రామ్మూర్తి ఏం చేస్తున్నాడూ?' అని.

చక్రపాణి తన 'స్టాక్ రిప్లై' నా ముఖాన్న విసిరేవాడు – "ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్యమైన పట్టణాల్లో రోడ్లు కొలవడం అయిపోయిందిట, దార్వార్ వస్తానంటున్నాడు రమ్మంటావా?".

తన సమాధానానికి అనుబంధంగా సంధించిన ప్రశ్నకి నా దగ్గర జవాబు లేదు. ఈ సంగతి పాణికి తెలుసు కనుక ఆ సంభాషణ అంతటితో వొక గంభీరమైన వాతావరణంలోకి ప్రవేశించేది. చక్రపాణీ నేను ఒకే అఫీసులో పనిచేస్తూ ఉన్నాం. ఉండటం కూడా దగ్గర దగ్గర ఇళ్ళలోనే.

"– దేశంలో పరిస్థితులు ఎంత దారుణంగా ఉన్నాయనుకున్నా. ఈ విద్దూరం మాత్రం నేను నమ్మను – పాణీ. రామ్మూర్తి వర్త్ సోమరి, అతనికి ఏ మాత్రం 'పుష్షూ, ఇనీషియేటివ్' లేవు" అనేవాణ్ని నేను. రామ్మూర్తి అప్రయోజకత్వానికి జాలిపడటం మాట అటుంచి, విలక్షణమైన అతని తత్వం, స్వభావం, రూపురేఖలూ గుర్తుకొచ్చినప్పుడల్లా, విరోధాభాసంలో పడిపోయేవాణ్ని నేను.

రామ్మూర్తితో నా పరిచయం వయసు పదేళ్ళు.

మొదటిసారి అతను ధార్వార్ వచ్చినప్పుడు పాణి పరిచయం చేశాడు. "ఏమ్మే చదువుతున్నాడు: తెలుగు. ఈ ఏడాదితో అయిపోతుంది. మమ్మల్ని చూద్దామని వచ్చాడు" అని. రామ్మూర్తిని తేరిపార చూశాను. గుప్పెట్లో నాణెం

క్రింద పారేసుకుని వెతుక్కుంటున్న పిల్లవాడిలా నేలచూపులు చూస్తున్నాడతను. ఎదుటి మనిషి తన కళ్ళల్లోకి చూస్తుంటే అతను మొహాన్ని క్రిందికి వంచేస్తాడు. ఆకారం-దూలం పట్టుకు వ్రేలాడుతున్న బూజు పోచలా ఉంటుంది. నూనె మొహం చూడని దుబ్బు జుట్టేమో గాలితో ఆడుకుంటూ ఉంటుంది.

పాణీ, నేనూ కలిసి అతనికి కర్నాటక యూనివర్సిటీ అగ్రి కాలేజి మొదలైన ప్రదేశాలు చూపించాం. కర్నాటక యూనివర్సిటీ చాలా ఎత్తయిన కొండ మీద విశాలమైన ఆవరణలో ఉంది. ఆహ్లాదకరమైన వాతావరణం. గజారోహణం చేసిన కవిరాజులా యూనివర్సిటీ బిల్డింగు. దానిముందు చక్కటి ఉద్యానవనం, చుట్టూ బొటానికల్ గార్డెన్స్, పాలుపోసి ఎత్తుకొనేందుకు వీలైనట్లు పరిశుభ్రమైన రోడ్లు, పచ్చటి లాన్స్, వివిధ భవంతులూ చూశాం. ఆ ప్రదేశాన్ని తలుచుకుంటేనే మనసు పులకిస్తుంది. వెన్నెల్లో పావురాల్తో ఆడుకుంటున్న అనుభూతి కలుగుతుంది.

రెండు గంటలు తిరిగేము.

ఇంటి నుంచి తీసుకెళ్ళిన 'చిరుమోరియా' 'అవలక్కీ' తిని నీళ్ళు తాగేము.

అంతా అయిన తర్వాత తిరిగి వచ్చేందుకు 'సాధన కేశి' బస్సు ఎక్కేము.

'ఎలా వుంది యూనివర్సిటీ?' అన్న పాణి ప్రశ్నకు 'ప్చ్. ఏదో ఫర్వాలేదు' అన్నాడు రామ్మూర్తి.

గాలి తీసినట్లయింది నాకు మాత్రం. అతి ప్రియమైన బొమ్మని లాక్కుని విరిచి పగలగొట్టి పొయ్యిలో పడేసినట్లనిపించింది.

ఆ మర్నాడే వ్యవసాయ విశ్వవిద్యాలయం చూశాము.

మెయిన్ బిల్డింగ్, డెయిరీ ఫారమ్, హోమ్ సైన్స్ విభాగంలో కేకులూ, బ్రెడ్ తయారుచేసే సాధనాలూ, వ్యవసాయ క్షేత్రం, పూలు పళ్ళ తోటలూ చూపించాము. అక్కడి తోటల్లో విశేషం - కొబ్బరి, నిమ్మ, సపోటా, బత్తాయి, మామిడి, పనస చెట్లలో రకరకాల జాతులు. పూలమొక్కల్లో - వివిధ రంగుల్లో

అడుగు వ్యాసం గల మందారాలూ, కనువిందు చేసే గులాబీలూ - ఒక్కొక్కటీ విశదంగా వర్ణిస్తూ వివరంగా చెప్పేరు మా మిత్రుడు, వెంకట్రామయ్యగారు. తిరిగివస్తుంటే సన్నని తుంపర మొదలైంది.

హృదయం గీసుకున్న చిత్రాలకు రంగులు వేసేందుకు మనసుకు సహాయం చేస్తున్నది, చిరుజల్లు. రుచికరమైన ప్రకృతి కవితకు రాగాలు కూర్చుకోసాగింది, నాలుక. బస్సులో కూర్చొన్నాము.

రామ్మూర్తి ఏవీ మాట్లాడలేదు. పచ్చటి చెట్లని తొడుక్కున్న కొండల్ని చూస్తూ కూర్చున్నాడు. 'పూలు చాలా బాగున్నై కదూ?' అడిగేడు పాణి. 'ఏదో వున్నై. పళ్ళికల్లా. అన్‌వీల్దీగా పెరిగిన ఆడదానిలా' అన్నాడు రామ్మూర్తి. మేమిద్దరమూ విస్తుపోయి కళ్ళప్పగించి చూస్తూ వుండిపోవాల్సి వచ్చింది.

అప్పుడే అతన్ని జోగ్ కూడా తీసుకువెళ్ళాం మేము.

జోగ్‌ని చూసి - "దీని కోసం ఇంత దూరం రావడం 'వేస్ట్'. ఈ మాత్రం నీరు చాలా కొండల్లో నుంచీ వస్తూ వుంటుంది" అన్నాడు. పాణి అతనికి జోగ్ గురించిన గణాంక వివరాల్ని బోధించాలని ప్రయత్నించాడు గానీ, రామ్మూర్తి ఉత్సాహం చూపలేదు.

మరోవైపు నడిచి ఒకచోట ఆగేం. క్రిందికి చూస్తే కొన్ని వందల అడుగుల లోతులో రెండు కొండల మధ్యగా శరావతి నిశ్చలంగా పారుతోంది, అక్కడ. అంత ఎత్తునుంచీ చూస్తుంటే పెద్ద ముత్తైదువ పాపిటలా వుంది - నది. దానికి పక్కగా పవర్ హౌస్ కలశం మీద నిలబెట్టిన టెంకాయలా.

చాలా అవస్థపడి పవర్‌హౌస్‌లోకి వెళ్ళేందుకు అనుమతి తీసుకుని వచ్చాడు పాణి. ట్రాలీ మీద భూగర్భంలోకి ప్రయాణం. అదొక 'థ్రిల్'. నాకూ, పాణికీ చాలా ఆనందంగా వుంది.

'మీరు పోయిరండి' అన్నాడు రామ్మూర్తి. పాణి ఊరుకోలేదు అతని బలవంతాన వచ్చాడు, రామ్మూర్తి. క్రింద పవర్ జనరేటర్లూ వాటి వివరాలూ తెలుసుకున్నాం. పైకి వచ్చాం.

తిరుగు ప్రయాణంలో నేనూ, పాణీ ఆ అనుభూతిని నెమరువేసుకుంటుంటే రామ్మూర్తికి విసుగేసింది అతనన్నాడు, "ఇంతగా సంబరపడిపోవటానికి వీటిల్లో ఏముందనీ, ఎవడి ఉద్యోగం వాడు చేశాడు, చేస్తున్నాడు, అంతేగదా". నేను విచారంతో క్రుంగిపోయాను. కోపంతో లోలోపల నా మీద నేనే చుర్రుబుర్రులాడుకున్నాను. తెలుగు ఎమ్మే వాడికుండాల్సిన సున్నితమైన మనస్సు, స్పందన – ఈ మనిషికి కనీస స్థాయిలోనన్నా లేవేమో అని బాధపడ్డాను.

ఆదివారం వచ్చింది. పదిగంటల వేళ – టిఫిన్ అయిన తర్వాత కూరగాయల మార్కెట్‌కి వెళ్ళిరావడం నాకూ, పాణికీ అలవాటు. నేను బయల్దేరి వాళ్ళ భాగంలోకి వెళ్ళాను. పాణీ, రామ్మూర్తీ భోజనం చేస్తున్నారు. నేను ఆశ్చర్యంగా 'ఇదే మిటివ్వాళ ఆదివారం మామూలు రోజుల్లాగా పదింటికే భోజనాలవుతున్నై' అని అడిగాను.

పాణి భార్య సుకన్య. ఆమె అన్నది "హుబ్లీ ప్రయాణం. మీరూ రండి" అంటూ నాకూ విస్తరి వేసింది, హడావిడిగా. నేనేమీ మాట్లాడలేకపోయాను. మనస్సులో మాత్రం ఉత్సాహంగా లేదు. రామ్మూర్తి నిరాసక్తత, నిర్లిప్తత, ఉదాసీనతలకి మళ్ళీ బాధపడాల్సి వస్తుందేమో అనే సందేహం.

పాణి అన్నాడు, "సరదాగా పోయొద్దాం పద".

వాళ్ళ భోజనాలు కావచ్చినై. రామ్మూర్తి అన్నంలో పాలు పోసుకున్నాడు – క్షణాలు తర్వాత అతను సుకన్యని అడిగేడు, వడియాలు వెయ్యమని. ఆమె వేసింది. వాటిని చితిపి పాల అన్నంలో కలుపుకుని తినడం మొదలెట్టాడు, రామ్మూర్తి.

వెన్నున గాటు పెట్టినట్టయింది నాకు.

భోజనం అయిందనిపించి లేచాను. – హుబ్లీలో నృపతుంగ బెట్ట చూశాము. అదొక కొండ. అక్కడే ఆ మహర్షి తపస్సు చేశాడని చెప్తారు.

ఆ తర్వాత ఇందిరా పార్క్, గ్లాస్ హౌస్ చూసి, మూరు సావిరమఠ్‌కి వచ్చాం. అది చాలా పెద్ద మఠం. ఎత్తయిన కట్టడం. విశాలమైన ఆవరణ. ఎన్నెన్నో గదులు, సీలింగ్‌కి దూలాలకీ చాలా తేనె పట్లు వుండి చిత్రంగా ఉంటుంది ఆ ప్రాంగణమంతా. చిన్న శివాలయం. ముఖద్వారం లోవైపు గున్న ఏనుగు.

అన్నీ చూసి, 'కామత్' లో టిఫిన్ చేసి సినిమా హాలుకి వచ్చాం. 'సిరిసిరిమువ్వ' ఆడుతోంది. టిక్కెట్లు తీసుకుని హాల్లోకెళ్ళి కూర్చున్నాం. సినిమా ఇంకా ప్రారంభం కాలేదు. "హుబ్లీ ఎలా వుంది" అడిగేడు పాణి, రామ్మూర్తిని ఉద్దేశించి.

పట్టువదలని విక్రమార్కుడు గుర్తుకొచ్చాడు నాకు – సన్నగా నాలో నేను నవ్వుకున్నాను.

రామ్మూర్తి నాకేసీ పాణి కేసీ చూపులు మార్చిమార్చి చూశాడు. తలవంచుకున్నాడు. నేలచూపులు చూస్తు "ప్రయోగానికి సిద్ధం చేసిన రాకెట్‌కి పసుపూ కుంకుమా పెట్టినట్లుంది" అన్నాడు.

అతని మాటల్లోని భావాన్ని అర్థం చేసుకోవడానికి చాలా సేపు పట్టింది నాకు, సినిమా జరుగుతూ వుండగా మధ్యలో తట్టింది – నాగరికతను పెంచుకుంటున్న పట్నంలో మూరు సావిర మఠ్, నృపతుంగ బెట్టలను బహుశా రామ్మూర్తి అలా పోల్చాడు కాబోలు అని.

చాలా అయిష్టంగానే – ఆ తర్వాత రెండ్రోజులకి – మలప్రభ డామ్‌కి బయల్దేరాను నేను – రామ్మూర్తీ పాణిలతో కలిసి.

కృష్ణకు ఉపనది మలప్రభ. రెండు కొండలకు మధ్యన చిన్న డామ్ అది. నదికి అవతలి ఒడ్డున డామ్‌కి ప్రక్కగా కొండమీద నెమలిబొమ్మ రంగుల్లో వుంది. మమ్మల్ని అక్కడ నిలబెట్టి ఫోటోలు తీసాడు పాణి. డామ్‌కి దిగువన నది వేగం

తక్కువ. చుట్టు బండలన్నీ మద్దికాయల్లా పైకి కనబడుతూ వుంటాయి, అక్కడ స్నానాలు చేశాం. గెస్ట్‌హౌస్, పార్కు మొదలైన ప్రదేశాలు చూసి తిరుగు ప్రయాణమైనాం.

దారిలో సౌదత్తిలో మా భోజనాలు, హుబ్లి ధార్వార్‌కి సౌదత్తి నుంచీ నీటి సరఫరా పథకం నిర్మాణంలో వుంది – కొన్ని లక్షల ఖర్చుతో ఆ పని జరుగుతోంది. దాని వివరాలూ, దానికి జీవితబీమా సంస్థ ఋణాన్నివ్వడం మొదలైన విషయాలు చెప్పసాగేడు, పాణి.

దిక్కులు చూస్తూ పరధ్యాన్నంగా వున్న రామ్మూర్తి యధాలాపంగా అన్నాడు. "ఈ డబ్బులో సగం పెట్టి ఏ కొండ దిగువనో చెరువును తవ్విస్తే సరిపోయేది. ధార్వార్‌లో వర్షానికేం కరువులేదుగా" అని.

పాణి సంభాషణ అంతటితో ఆగిపోయింది.

సౌదత్తి నుంచి ఎల్లమ్మగుట్ట చేరాము.

దేవాలయం ప్రాచీనమైనది. అయితే, వాతావరణం చాలా అపరిశుభ్రంగా వుంది. అక్కడి నుంచీ వెంటనే ధార్వార్ వచ్చేశాము.

"దేశం మొత్తాన్ని అద్దంలో చూసినట్టుంది" అనేది ఎల్లమ్మగుట్ట గురించి రామ్మూర్తి వ్యాఖ్య.

ఆ ఏడాది చివర్లో రామ్మూర్తిని నేను రెండోసారి చూశాను.

బెంగుళూరులో ఏదో ఇంటర్వ్యూకి వచ్చాట్ట. అటు నుంచీ ధార్వార్ వచ్చేడు. అప్పటికి అతను తెలుగు సాహిత్యంలో ఎమ్మే యూనివర్సిటీ ఫస్ట్ అయ్యాడు.

'రిజల్టును మాకు వ్రాయలేదేం?', అన్నాన్నేను నిష్ఠూరంగా అతనితో మాట్లాడుతూ.

"పెద్ద విశేషమేం వుంది మాష్టారూ, ఎవరో ఒకరికి ఇవ్వాలిగదా,

నాకిచ్చారు. నా దరిదాపుల్లో - వాళ్ళకి కావాల్సిన వాళ్ళెవరూ లేకపోవడం 'యాక్సిడెంట్' అంతే" అన్నాడు చాలా నిర్లిప్తంగా.

నేనతనికి మంచి భవిష్యత్తును ఆశిస్తూ, ఏదైనా కాలేజీలో చేరమనీ, ఆ తర్వాత పి.హెచ్.డి. చేయమని సలహా ఇచ్చాను. విని వూరుకున్నాడు.

మర్నాడే అతను తాడేపల్లి గూడెం వెళ్ళిపోయాడు.

అప్పట్నుంచీ - ఏటికో కోటికో వొకనాడు అతని నుంచీ జాబు వచ్చినపుడు చక్రపాణి - చెపుతూండేవాడు- 'రామ్మూర్తికి ఇంకా ఉద్యోగం రాలేదు' అని, పాణి వేసవికి తాడేపల్లి గూడెం వెళ్ళివచ్చినప్పుడల్లా నేను రామ్మూర్తి గురించి విచారించడమూ నాకు అలవాటయిపోయింది. 'రామ్మూర్తి ఏం చేస్తున్నాడు?' అని నేనడగటం, 'ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్యమైన పట్టణాల్లో రోడ్లు కొలవడం అయిపోయిందట. ధార్వార్ వస్తానంటున్నాడు, రమ్మందామా?' అని పాణి అనడమూ, మా సంభాషణ అంతటితో ఆగిపోవడమూ పరిపాటయిపోయింది.

అడపాదడపా ఆఫీసులో కొత్తగా రిక్రూట్‌మెంట్ జరిగి, కాలేజీలో చదువుకుంటున్న గడ్డాలు మొలవని కుర్రాళ్ళూ, లంగాలు వదలని ఆడపిల్లలూ కుప్పతెప్పలుగా ఉద్యోగాల్లో చేరిపోతున్నప్పుడూ, వారిలో తమ ఆర్థిక పరిస్థితినీ ఉద్యోగవసరాల్నీ చెప్పుకోవడాన వొకరిద్దరికి నేను చేయగలిగిన సహాయం చేస్తున్నప్పుడూ - రామ్మూర్తి నా కళ్ళముందు మెదుల్తూ వుండేవాడు.

విజయవాడ స్టేషనులో - బందరు నుంచీ తిరుపతి పోతూ ప్లాట్ ఫారమ్ మీద పచార్లు చేస్తున్నాను, రైలుకు చాలా టైముంది.

హఠాత్తుగా రామ్మూర్తిని చూసాను. పాతబడి, పాదానికి ఆరంగుళాల పైదాకా వున్న ఫాంటు, తనది కాదేమోననిపించేటంత వదులైన చొక్కా. చేతుల్ని గోగుకాడల్లా వూపుకుంటూ దగ్గరగా వచ్చేడు. రిఫ్రెష్‌మెంట్ రూమ్‌కు వెళ్ళి కూర్చున్నాం. కాఫీలు ఆర్డర్ చేశాను.

యోగక్షేమాలకంటే ముందు నా గుండె గొంతుకలో కొట్టాడే ప్రశ్ననే అతని ముందుంచాను. 'ఏం చేస్తున్నావిప్పుడు?'.

చాలా చిత్రంగా నవ్వేడు రామ్మూర్తి 'మీలాంటి వాళ్ళు కాఫీ ఆర్డర్ చేస్తే తాగుతున్నాను' అంటూ కాఫీ సిప్ చేయసాగేడు.

నా కళ్ళముందు ఒక్కసారిగా చీకట్లు కమ్మేసినట్లైంది. ఆలోచన పరిపరివిధాల పోయింది. బాధ, కోపం కలిసిన స్వరంతో బయట పడిపోయాను, "దేశంలో పరిస్థితులు ఎంత దారుణంగా వున్నాయనుకున్నా ఈ విద్దూరం మాత్రం నేను నమ్మలేకుండా వున్నాను. నీకు ఏమాత్రం పుష్షూ ఇనీషియేటివ్ లేవు. లేకుంటే ఎమ్మే యూనివర్సిటీ ఫస్ట్ వాడివి. ఎనిమిదేళ్ళ నుంచీ వుద్యోగం లేకుండా ఇలా...". నా ఆవేశాన్ని మధ్యలోనే ఆపు చేస్తూ నవ్వసాగేడు రామ్మూర్తి. కీలుబొమ్మ కిచకిచ మన్నట్టుంది ఆ నవ్వు. క్షణాల తర్వాత గంభీరంగా చెప్పసాగేడు.

"రైలు ప్రయాణీకుల్లో ఎన్ని తరగతుల వాళ్ళున్నారో ఆలోచించండి, ఏసీ తెప్పించుకునే వాడొకడు, బెర్త్ రిజర్వ్ చేసుకునేవాడొకడు, సీటు ఖాయం చేసుకునేవాడొకడు; వీళ్ళల్లో ప్రతివాడూ తమ క్రిందివాడు కొరగానివాడనే అనుకుంటాడు. జనరల్ కంపార్ట్‌మెంట్‌లో కూడా తోసుకునీ, నెట్టుకునీ ముందు ఎక్కగలిగినవాడు ప్లాట్‌ఫారమ్ మీద మిగిలిపోయిన వాణ్ణి చూసి భీరువు, అసమర్థుడు గానే భావిస్తున్నాడు నా పరిస్థితీ అలానే వుంది"

రామ్మూర్తి చెప్పటం ఆపి, పక్కగా వెళ్తున్న బేరర్‌ని కేకేశాడు. "రెండు దోశె పట్రా" అన్నాడు. నేనేదో అనబోయాను. "మీకు కాదులెండి. రెండూ నాకే" అన్నాడు.

గొంతు సరి చేసుకుని నేలచూపులు చూస్తూ మళ్ళీ మొదలెట్టాడు.

"కొన్ని ఉద్యోగాలకి అనుభవం కావాలి, కొన్నిటికి సిఫారసు కావాలి. ఇవన్నీ అలా వుంచండి. కొన్నిటికి అదే ప్రాంతంలో పుట్టి పెరిగి చదివి అక్కడే

ఛస్తూ వుండాలి. కొన్నిటికి భాష అడ్డుగోడ. కాదంటారా ?"

ఆ కంఠస్వరం కొంచెం కరుకుతేలటం గమనించాను.

"మీరు నా కేవిధంగానూ సహాయం చేయలేకపోవడానికి కూడా ఇదే కారణం. కదూ?"

అవునన్నట్టు తల వూపేను.

అతను కొనసాగించేడు, "నేను ఎమ్మేని కావడం కొన్ని ఉద్యోగాలకు అనర్హత. వాటికి కనీసార్హత బియ్యే అయినా, ఆ బియ్యేలోనూ యూనివర్సిటీ సెకండ్ రాంక్ నాకున్నా - నేను చివరికి తెలుగు ఎమ్మే చేశానని తేల్చేసారు, పక్కకు తోసేస్తారు" ఉద్వేగంతో రామ్మూర్తి గొంతు బొంగురుపోయింది.

"ఇవన్నీ మనకు తెలియని పరిస్థితులు కావనుకో. గొంగట్లో భోజనం చేస్తూ వెంట్రుక లేరుకోనఖ్కర్లేదు పోనీ, ఏ పత్రికలోనన్నా ప్రయత్నించవచ్చుగా".

"మాబాగా చెప్పారు. అదీ అయింది అక్కడ ఇంటర్వ్యూలో ప్రశ్నలు చెప్పనా?" అని సన్నగా నవ్వేడు.

"కమ్యూనిష్టుల పట్ల నీ అభిప్రాయం ఏమిటి? పాతివ్రత్యానికి ఇంగ్లీషు పదమేవిటి? నిన్ను నక్సలైట్ అంటే ఏమంటావ్? పిల్లలకు మాత్రమే అని పెద్దవాళ్ళని ఆకట్టుకునే సెక్స్ సీరియల్ రాయగలవా? సినిమా ఎడ్వర్‌టైజ్‌మెంట్ సంపాదించే మార్గాలు నాలుగు చెప్పు? - ఇవీ ప్రశ్నలు. ప్రతి పత్రిక్కీ పాలసీ వుంటుంది కాదనను. కానీ, అన్ని పత్రికల ఆరాటమూ పుట్టిన ఆరోనెల్లోనే అనన్య సామాన్య ప్రచారం పొందాలనే తాపత్రయం. దానికి మన తెలివి పనికి రాదని వాళ్ళు పసికట్టేశారు."

దోశెలు తెచ్చాడు బేరర్. వాటిని చాలా ఆబగా తినసాగేడు రామ్మూర్తి. నేను మౌనంగా కూర్చున్నాను.

అవి తినడం పూర్తవుతుండగా రెండు ప్లేట్ల వడలకి ఆర్డరిచ్చాడు రామ్మూర్తి. "మీ దగ్గర ఈ మాత్రం డబ్బుకు కొదవ లేదనుకుంటా?" అన్నాడు రామ్మూర్తి

యధాలాపంగా. ప్లేట్‌లోనే చెయ్యి కడుక్కున్నాడు. నా సమాధానానికి ఎదురు చూడలేదు. నేను పరీక్షగా అతనికేసి చూస్తూ అతని చొక్కానీ, పాంట్‌నీ పరిశీలించసాగేను. దీన్ని అతడు పసిగట్టేడు. "మీరు నా వంక అలా పరీక్షగా చూస్తుంటే చెప్పాలనిపిస్తోంది. నేను ధార్వార్ వచ్చినప్పుడు మా పాణీ మీరూ కలిసి చాలా ప్రదేశాలు చూపించారు నాకు. అవన్నీ చూసి నేను చాలా సాదాగా పెదవులు చప్పరించేసేవాణ్ణి గుర్తుంది కదూ. అలాంటిదే ఈ దుస్తుల అవతారమూను. దేశం ముందుకే పోతున్నదనీ దానికి దాఖలాగా పెరుగుతున్న పట్టణాల్నీ పైకిలేస్తున్న భవంతుల్నీ, రద్దీతో రొద చేస్తున్న సినిమా హాళ్ళనీ, జనంతో కిక్కిరిసిన మార్కెట్లనీ, టీవీ సెట్లనీ చూపిస్తాం మనం, కానీ –", అని ఆగేడు.

వడ ప్లేట్లు వచ్చినై. నేను రెండు కాఫీ చెప్పేను. వడలు తినడం పూర్తి చేసి కాఫీ కూడా తాగేవరకూ రామ్మూర్తి పన్నెత్తి మాట్లాడలేదు. కుడి ముంజేత్తో మూతి తుడుచుకుని నా చేతిలోని దినపత్రిక తీసుకుని మొదలెట్టాడు మళ్ళీ. "కడుపు నిండినవాడు మాత్రమే కళ గురించీ, అభివృద్ధి గురించీ, సంస్కృతి గురించీ, నాగరికత గురించీ మాట్లాడగలడు, వాటి రూపాల్ని చూసి స్పందించగలడు. ఇప్పుడు చూడండి. నాకు రెండు రోజుల ఆకలి తీరింది. పేపర్ చూద్దామనే కోరిక కలుగుతోంది".

నేను ఆలోచనలో పడ్డాను.

( విజయ జులై 1983 )



# ఎత్తు పల్లాలు

వరమ్మ గారిది లంకంత కొంప. ముందు టెన్నిస్ కోర్టంత మేరలో వాకిలి, దాన్లో రకరకాల మొక్కలు. తూర్పు ప్రహరీ గోడ వారగా పొగడచెట్టు దాని కింద రాతి అరుగు.

వెనకాల ఫుట్‌బాల్ కోర్టంత పెరడు. రాచ, ఉసిరి, జామ, పెద్ద ఉసిరి, బాదం చెట్లు, మూలగా కొబ్బరి చెట్లు, బావి గట్టున అరటి.

పడమర సరిహద్దు పొడవునా ఒక చింత, ఒక ఉత్తరేణి, వాటి పక్కగా చిటికేనరపు చెట్లు ఉండేవి.

దక్షిణాన మూడు గదుల ఔట్ హౌస్ - రేకులది. వీటికి కొంచెం అవలగా ఖాశిం గుడిసె.

భవంతి జమీందారుల వేసవి విడిదిగా అనిపించేది. రాజద్వారంలో నుంచీ, హాల్లోని చెక్క ఉయ్యాల కనిపిస్తూ ఉండేది.

వరమ్మ భర్త ఆమె చిన్నతనంలోనే కాలం చేశాడు. ఆమెకు ఒక్కతే కూతురు - సరోజ. విదేశాల్లో ఉండే ఇంజనీరు కిచ్చి సరోజకి రంగరంగ వైభవంగా పెళ్లి చేసింది వరమ్మ. ఆరేళ్ల కాపురంలో ఒక కొడుకునీ, ఒక కూతుర్ని ఇచ్చి విదేశాల్లోనే విమాన ప్రమాదంలో పోయాడు సరోజ భర్త. అత్తవారింట్లో ఆస్తి పంపకం చేసుకుని అమ్మదగ్గరికే చేరింది సరోజ. పెద్దవాడు రఘు, రెండోది సంపూర్ణ.

వరమ్మగారికీ, నాకూ బంధుత్వం ఉంది. అయితే అది ఎక్కడో కొడితే ఎక్కడో రాలిన సామెత. బంధుత్వం కంటే తన ఆస్తి వివరాలకూ, కూతురు అయివేజు వ్యవహారాలకూ లెక్కా పత్రం జాగ్రత్త చేసేందుకే తమ ఔట్‌హౌస్‌లో నాకు ఆశ్రయమిచ్చింది వరమ్మగారు.

మా ఆవిడ పట్ల వరమ్మ గారికి ప్రేమ, అభిమానం అనీ అంటూ ఉంటారు, మమ్మల్ని తెలిసినవాళ్లు. ఇంటి పురోహితుడి కూతురుగా - శారద - పుట్టినప్పటినుంచీ తెలుసు వరమ్మగారికి.

ఇంక ఖాశిం విషయానికొస్తే, అతడు తోటమాలీ, కూలీ, పనిపాటలకు చేతి కింద మనిషి.

ఖాశిం భార్య ఖాజాబాయ్. ఆ ఇంట్లో పనిమనిషి. ఖాశింకి నలుగురు సంతానం. పెద్దవాడు సత్తార్, ఆ తర్వాత ముగ్గురూ ఆడపిల్లలు.

రాణి, రజని, శంకర్ - మా పిల్లలు. ఖాజాబాయ్, శారద వరమ్మగారికి రెండు కళ్లు. పండక్కీ, పబ్బానికీ చెప్పేదేముంది గానీ, రోజూ కూడా వీళ్లిద్దరే ఒళ్లు విరుచుకునేవారు.

వరమ్మ మాట తీరే వేరు. రాత్రి ఉతికి ఆరేసిన నేత చీరను తెల్లవారుజామున కప్పుకున్నట్లు ఉంటుంది - ఆమె మాటలు వింటుంటే!

"స్నానం చేసే వచ్చావుటే ! రాత్రల్లా మొగుడి పక్కలో పడుకుని, ఉదయాన్నే లేచి అట్టాగే రాబోకు, కాస్త మడీ దడీ ఉన్న ఇల్లు. అందులోనూ పూజ గది పక్కగా పాటికి పదిసార్లు తిరుగుతూనే ఉంటావ్!" అనేది వరమ్మగారు.

"పోండమ్మా, మీరు మరీనూ! నలుగురి పిల్లల తల్లిని, నిన్నో, మొన్నో షాదీ అయిన పిల్లనా?" అంటూ ముసిముసి నవ్వులు నవ్వేది ఖాజాబాయ్.

సందె చీకటి, పిల్లలు ఆడుకుంటున్నారు.

పొగడ చెట్టు కింద రాతి అరుగు మీద కూర్చుని ఉంది వరమ్మగారు.

ఖాజాబాయ్ పక్కగా వెళ్తోంది. పిలిచింది - "గోరింటాకు నూరి పెట్టాను. తీసుకుపో! పిల్లలకు పెట్టి, నువ్వూ పెట్టుకో! రేపు అట్ల తద్ది. రాత్రికి పొట్లకాయ కూర చేసి, పెరుగన్నం కలపమని చెప్పాను శారదకి. ఉయ్యాల కట్టమని చెప్పు మీ ఆయనకి!"

లేత వెన్నెట్లో కమ్మ తెమ్మెర వీస్తున్నట్టుండేది. హాలు మధ్యగా కూర్చుని గచ్చు మీద కందిపప్పు పోసుకుని బాగుచేస్తున్నారు శారదా, ఖాజాబాయ్.

ఉయ్యాల బల్ల మీద కూర్చుని భాగవతం చూస్తోంది వరమ్మ. యధాలావంగా అంది – "ఈ పనులన్నీ ఎప్పుడూ ఉండేవే గానీ, శారదా! రేపు రథసప్తమి. కాసిన్ని జిల్లేడు ఆకులు కోయించు. పొంగలికి పాల సంగతి చూడు. పెందరాళే స్నానాలు కానీయండి! అందరికీ భోజనాలు ఇక్కడే అని చెప్పు. మీ ఆయనకి నే చెప్పాన్లే. ఇంకా కొన్ని చిన్న చిన్న పనులున్నాయి. వాటిని తను చూసుకుంటాడులే!" అని పక్కకు తిరిగి, "నువ్ ఖాశింకి చెప్పు!" అన్నది ఖాజాబాయ్ నుద్దేశించి.

"అదేంటి, పిన్నీ! రథసప్తమి క్కూడా భోజనా లెందుకూ? పూజ చేసి పొంగలి తీసుకుంటాములే!" సందేహంగా అన్నది శారద.

"నాకు తెలుసులేవే అవన్నీ! నే చెప్పినట్లు చెయ్! ఒక్క రోజు భోజనాలకి పుట్టేమీ మునిగిపోదులే. నువ్వొక్కత్తెవే తొక్కిసలాట లాడకు. సరోజ కూడా చూస్తుందిలే వంట పని!"

వరండాలో పుస్తకాల బీరువా సర్దుతున్న నేను సన్నగా నవ్వుకున్నాను.

మర్నాడు రాత్రికి అర్థమైంది మాకు – ఆవేళ వరమ్మ భర్తగారి తిథి అని. వేరే ఏ ఆర్భాటమూ ఉండేది కాదు. అన్ని జ్ఞాపకాల ఆరాటమూ ఆకుచాటు పిందెలా లోమదిలో ఉంచుకునేది వరమ్మగారు.

మే నెల చివరి వారం జరుగుతోంది.

ఆ వేళ –

బావి గట్టున నీ రెండ పడుతోంది. నూతి పళ్లెం అంచున మినపప్పు కడుగుతోంది శారద. నేను బాదం చెట్టు ఆకులు కోస్తున్నాను. వరమ్మగారు దొడ్డి గడప మెట్టు మీద కూర్చుని, కొబ్బరి ఈనెల్ని సరిచేస్తోంది.

"శారదా! పిల్లలుకాశీ మజిలీ కథలుకావాలని గొడవ పెదుతున్నారు. వాళ్లను నా దగ్గర పదుకోని ! సెలవులేగా ! సరోజా, నేనూ వాళ్లకి కథలుచెప్తాం" అంది వరమ్మ గారు.

"అట్టాగేలే, పిన్నీ ! అంటూ చేయి కదుక్కుని లేచింది,శారద,

చీకటిపడింది ఖాశీం చేత చిన్న బుట్టెదు మల్లెమాలలు పంపింది. ఆ తర్వాత కాసేపటికి పాల గిన్నెతో వచ్చింది. ఖాజాబాయ్ నేను ఏదో పత్రిక తిరగేస్తున్నాను " అమ్మ పంపించింది!' అంటూ పాల గిన్నెని అక్కదే ఉంచి వెళ్లింది ఖాజాబాయ్.

శారద తనలో తాను 'నవ్వుకుంది " ఏయ్,పిల్లలూ ! అన్నాలకి రందర్రా !' అని పిల్లల్ని పిలుస్తూ నా వంక క్రీ గంట చూసింది, శారద. నా కేమీ అర్థం కాలేదు.

అందమైన ఆ రాత్రి - అటు తర్వాత చెప్పిన కథలూ, విప్పిన జ్ఞాపకాల దొంతరలూ వరమ్మగారి మనసూలా - చల్లగా, ఆర్ద్రంగా, ఆహ్లాదంగా, ఆనందంగా నన్నూ శారదనూ ఏవో దివ్యలోకాల్లో తేలియదజేసినాయి.

తెల్లని వెన్నెల పూర్తిగా మా కోసం ఒలికినట్లేంది ఆదో మనోజ్ఞమైన అనుభవంగా మిగిలింది ఆ అర్థరాత్రికి ఏదో అర్థం చేకూరినట్లయింది.

మర్నాదు చెప్పింది శారద - "పిచ్చిపిల్ల! నిన్న నీ పెళ్లిరోజు అని అప్యాయంగా భుజం తట్టిందట వరమ్మగారు

వాత్సల్యం జీవితంలా ప్రవహించడం అంటే ఇదేనేమో ననిపించింది నాకు శారదకూ,

"సంక్రాంతి ముందూ

వద్ల బస్తాలతో దిగేవాళ్లు రైతులు

ఆదో పెద్ద కోలాహలం,

ఆరు ఎడ్లబండ్లు, పది పన్నెండుమంది వచ్చే వాళ్లు వాటితో

రోడ్డు వారగా - ప్రహరీ గోడను ఆనుకుని చెట్లకింద ఏడ్లకి విశ్రాంతి

గాదెలో ధాన్యం నింపి, ఊరంతా తిరిగి సరకులూ, తినుబండారాలూ, వెచ్చాలూ - అవి ఇవీ కొనుక్కొని వచ్చే వాళ్లు రైతులు.

ఏ నాలుగోరోజునో, అయిదో రోజునో పల్లెకు తిరిగి వెళ్లడం

“అరేయ్ పుల్లాయ్ ! మీ అందరికీ ఎప్పుడేం కావాలో అప్పుడు తినండి. మొహమాటం లేకుండా ఆ శారదను అడిగి పెట్టించుకోండి మంచి సెబ్బరలు దాచుకోమాకండి ఊరి విశేషాలూ కళ్లం కబుర్లూ ఆ రామ్మూర్తితో మాట్లాడండి ఏటీ కేడాది ఒళ్లు పుందు సేసుకునేదే మీ పని. హాయిగా విశ్రాంతిగా నిద్రపోండి. రాత్రిళ్లు సినిమాలని షికార్లనీ తిరగమాకండి ! ఇలా ఉండేవి అమె మాటలు

వాళ్లంతా పల్లెకి తిరిగి వెళ్లే నాటికి - అందరికి కొత్త బట్టలు తెప్పించేది. వాళ్ళ భార్యా పిల్లలకి అందేవి అవి. ఆడపిల్లలున్న వాళ్ల కోసం గాజూలూ, పూసలూ, రిబ్బన్లూ కొనిపించేది ప్రత్యేకంగా.

వాళ్లందరూ తిరిగి వెళ్లిన తర్వాత ఓ రోజు అడిగేది నన్ను - “ఎట్టా ఉంది ఈ ఏడాది ఫలసాయం ” అని

నేను ఎవరెవరు ఎంతెంత బకాయి పెట్టారో చెప్పేవాణ్ణి అంతా విని, “కానీ పాపం గింజ రాలందే వాళ్లయినా ఏం చేస్తారు.” అని, ‘బాకీలూ, గీకిలూ అని వాళ్ల నెత్తిన కూర్చోకు. మన కేం అంత సరిపోని పరిస్థితి కాదుగా ! అనేది

ఆమె మనసు నాకు తెలుసు పదేళ్లనుంచీ పాత బకాయిల్లో వసూలైన పద్దు ఏముందికనుక ? నేను మౌనంగా ఉండేవాణ్ణి

ఆషాఢం వెళ్తోంది.

ఉదయాన్నే వచ్చాడు రాజయ్య వస్తూ వస్తూ వాననీ వెంటబెట్టుకుని వచ్చాడు.

పల్లె విషయాలు, పరామర్శలూ అయినాయి. మెరకే చేను చూసేది అతనే.

గ్లాసులో కాఫీ పూర్తి చేసి గుండెల్నిండా భయం నింపుకున్నాడు రాజయ్య,

బెరకు బెరుగ్గాచెప్పాడు "పెద్దమ్మాయి పెళ్లి చేయాలని ...." నసిగాడు.

వరమ్మగారు ఠక్కున అన్నది – "శుభం !కానీ ! క్షణాల తర్వాత అడిగింది, పిల్లవా డెవర్రా?" అని

"పుల్లయ్య కొడుకే నమ్మా ! ఏదో తెలిసిన నమ్మంధం మంచోళ్లు. ఆకుర్రాడు ఈడనే ఏదో ఆఫీసుసులో జవానుద్యోగం సేస్తా వున్నాడు చెప్పాడు రాజయ్య.

"బాగుంది ముహూర్తం పెట్టుకున్నారా!"

" ఇంకా లేదమ్మా ! మీతో వో మాట చెప్పి దిగుదామని ..."

" నాతో చెప్పేందు కేముందిరాజయ్యా ! అట్టాగేకానీ ! అంది

నేనేదో చెప్పబోయాను. సందేహంగా ఆమె కేసి చూశాను.

" నాకు తెలుసులే రామ్మూర్తీ మన పాత బాకీలు కొత్త కష్టాలూ ఎప్పుడూ ఉండేవే ! వాటి కోసం వయసొచ్చిన పిల్లల్ని ఎండగట్టామా ! నువ్ కానీయ్, రాజయ్యా!" అన్నది.

చీకటి గుండెలతో వచ్చి, వెలుతురు కళ్లతో తిరిగి వెళ్లాడు రాజయ్య వాన కూడా ఆసరికి వెలిసింది

ఆ మధ్యాహ్నం నాతో చెప్పింది వరమ్మగారు "ఓ పది బస్తాలు ధాన్యం మిల్లు కేసి ఆ దబ్బును రాజయ్యకు పంపు !" అని.

నేను ఆశ్చర్యపోయి దిక్కులు చూస్తూంటే, పక్కనే ఉన్న సరోజ అమ్మకు వంతపలికింది ఆవును వాళ్ల మంచీచెడూ చూడాల్సిందికూడా మనమే కదా ! ఆ బాధ్యత కాదంటే ఎట్టా?"

నాకు సగం అర్థమై, సగం కానట్టుగా ఉంది.

నా పరిస్థితిని పసిగట్టి సన్నగా నవ్వుకుంటోంది పోదే పనిలో ఉన్న శారద

మధ్యాహ్నం ఒంటిగంట దాటుతోంది.

హాల్లో వచ్చీసు జరుగుతోంది పందేలూ పై పందాలుసాగుతున్నాయి వరమ్మగారూ సరోజ,శారద, ఖాజాబాయ్ - ముగ్గులో ఉన్న మనుషులు

వీళ్ళకి పక్కగా పిల్లలు చేరి గచ్చకాయాలూ, పులిజూదంసాగిస్తున్నారు. ఇటు వీళ్ల అరుపులూ, అటు వాళ్ల ఆరుపులూ!

ఇల్లంతాపెళ్లి పందిరిలా ఉంది

గచ్చకాయలు ఆడుతున్న మా రాణీ, రజనీ, ఖాశీం కూతుళ్లు ఫాతిమా, ముంతాజ్ - గవ్వలాట పక్కగానే ఉన్నారు దాంతో వాళ్ల అరుపులూ, వాళ్ల మాటలూ కలగాపులగంగా కలిసి ధ్వనినీ ప్రతిధ్వనినీ సృష్టిస్తున్నాయి.

ఆ హాల్లోనే ఓ మూలగాకూర్చుని సత్తార్‌కి లెక్కలుచెప్తున్నా న్నేను.

"ఇవ్వాళ మీ అమ్మ పెరుగన్నం భలే చేసింది, ముంతాజ్ ! అబ్బ ! ఎంత బాగుందో ? నాకైతే ఆ గిన్నెలో ఉన్న అనమంతా నేనే తినేయా లనిపించింది" - రాణి అంటోంది.

ప్రతిగా ముంతాజ్ అంది "మా చెయ్యి బహుత్ పసంద్!"

ఆదవాళ్ల ఈ మాటలు విన్నారు.

శారద ఉలిక్కిపడ్డట్లు గమనించాను రాణి వేపు ఆదోలా చూసింది. గోద నున్న వస్తువుని వెదుకుతున్నట్లు ఆమె విశాల నేత్రాలు నాకేసి కొన్ని దృక్ బాణాల్ని వదిలినాయి

వరమ్మగారు అన్నది "అయితే ఈపిల్లలు మీ ఇంట్లో అన్నీ తింటున్నారుటే! ప్రశ్న రానే వచ్చింది.

శారద భయపడింది. నిజానికి ఈ ప్రశ్న వస్తుందనే కొద్దిసేపు కళవళపడి

క్షణాల తర్వాత చెప్పింది. " ఎప్పుడైనా పెరుగన్నమో, సేమ్యా పాయసమో అయితే.."

"అవును, అంతే అంతే !" వంతపిలికింది ఖాజాబాయ్

"అయితే అంత బాగా చేస్తావా!" యధాలాపంగా అంటున్నట్లు అని పందెం వేసి పావు కదిపింది వరమ్మగారు

ఏదో కష్టాన్ని గట్టెక్కిన దానిలా నిట్టూర్చింది, శారద.

ఆ రాత్రి

ఖాజాబాయ్ సేమ్యా పాయసాన్ని రుచి చూసింది వరమ్మగారు ! హాల్లో గులేబుకి వేళ్లాడుతున్న పిచ్చుక కిచకిచ మంది !

ఇరవై ఏళ్ల క్రితం జరిగినసంగతులూ, సంభవాలు - ఇవన్నీ. స్మృతుల పేటిక తెరిస్తే మాసినవీ, మెరిసేవీ - అన్ని వస్తువులూ బయటకు తొంగి చూశాయి మరి!

ఇప్పుడు -

వరమ్మ గారి లో వాకిట్లో షాపులు వెలిసినాయి ఒక షాపులో నేను ఫోటో స్టూడియో పెట్టుకున్నాను దాని మీదరాబడి కంటే ఒ వీడియో కేసెట్ల అద్దే అంతో ఇంతో కూడ బెడుతున్నదంటే అతిశయోక్తి కాదు

ఖాశీం నా షాపు పక్కగా సైకిల్, స్కూటర్ మెకానిక్ అయిపోయాడు

మా పిల్లలంతా పెద్దవాళ్లయి అక్కడా, ఇక్కడా చిన్న చిన్న ఉద్యోగాలలో ఉన్నారు ఆడపిల్లల పెళ్లిళ్లు అయిపోయాయి

వరమ్మగారి పరిస్థితిగురించి చెప్పాలంటే కన్ను చెమరిస్తుంది నిజానికి ఆమె గుండెల మీద జడివాన కురిసిందనే చెప్పవచ్చు.

రైతులు తాము సేద్యంచేస్తున్న పొలాల్ని తామె తీసేసుకుంటా మన్నారు బేరసారాల మాట వచ్చే సరికి పాత బాకీలన్నీ గాలికిక్కొట్టుకుపోయినై వారు ఇస్తామన్న సొమ్ముకి నే నేవె అంకెలు చెప్పబోతే, వరమ్మగారు ఒక ఉదాసీసపు నవ్వు నవ్వి వదిలేసింది.

వచ్చిన డబ్బుతో సరోజమ్మగారి పిల్లల పెళ్లిళ్లు పూర్తి చేశారు.

పాత దాయాది పరంధామ్య వచ్చి, నోటీసులూ, వఖీళ్లూ అని మొదలెడితే– నిబ్బరంగా, నిదానంగా, "మీక్కావల్సింది ఈఇంట్లో సగభాగమేగా తీసుకోండి! అమ్ముకున్నా, అర్చుకున్నా మీ ఇష్టం. న్యాయం మీకు తెలుసు. చట్టం మనిద్దరికీ తెలియకపోవచ్చు నేను ధర్మం మీద పోతాను" అన్నది. ఎంత వేదాంతాన్ని ఆమె బుర్రక్కించుకున్నదో మరి !

ఇల్లు రెండుగా చీలింది. పెరదు ప్రహారీ నుంచిముంగిలి ప్రవాహారీదాకా ఇదిగో ఇవతలి సగం లోనే మా షాపులు ఏర్పాటు చేసుకున్నది. అదీ ఆమె చలవే ! "మీ ఇద్దరూ ఏది బాగుంటుందిదనుకుంటారో అట్టా చేసుకోండి !" అంది.

సరోజ కూడా తల్లి మాటలకు తల ఊపింది. అమె చ్నిప్పటి నుంచీ అలవరుచుకున్న స్వభావానికి ఆఇ దేమీ విరుద్ధం కాదని మాకుతెలుసు.

ఇదంతా ఇట్టా ఉంచి సరిగ్గా ఇవ్వాళ జరిగింది చెప్తాను

సంపూర్ణ, ఆమె భర్త శేఖరం వచ్చారు ఢిల్లీ నుంచి అతను అక్కడే సెంట్రల్ సెక్రటేరియట్ లో ఉద్యోగం చేస్తున్నాడు.

మురళీ, అతని భార్య రమణి కూడా ఇంట్లోనే ఉన్నారు మురళికి పక్క టౌన్లో ఏదో ఎరువుల కంపెనీలో ఉద్యోగం

ఖాశీం నీ, నన్నూ పిలిపించారు శారద ఖాజాబాబాయ్ కూడా వచ్చారు.

మధ్యాహ్నం రెండు గంటలుదాటింది

సంపూర్ణ సరాసరి విషయం ప్రస్తావించింది.

అన్నయ్యా మమ్మల్ని రమ్మని రాశాడు అంతా ఆలోచించి వేం మోనిర్ణయానికొచ్చాం. ఇల్లుని పూర్తిగా డిస్పోజ్ చేసేయాలని మా ఉద్దేశ్యం. ఆ తతంగమంతా అయింది. వచ్చే సోమవారం రిజిస్ట్రేషన్. ఇక వారంరోజులుంది. మురళి టౌన్లోనో ఉంటాడుట అమ్మమ్మ వాడి దగ్గర ఉంటుంది. అమ్మని నేను తీసుకుపోతాను. మీరిద్దరూ - షాపులూ, మీ ఇళ్ళ అద్దె విషయం కొత్త యజమానితో మాట్లాడుకోవాల్సి ఉంటుంది !"

ఈ చివరి మాటల్ని నన్నూ ఖాశీంనీ ఉద్దేశించి చెప్పింది

మేమంతా ఒకరి మొహాలొకరం చూసుకున్నాం మాగుండెల్లో ముల్లు గుచ్చుకుంది ఊపిరి బిగిసింది అందరం కలిసి వరమ్మగారి కేసి చూశాం

మాట పెగల్చుకుని అడిగింది ఆమె - బేరంపెట్టింది ఎవరికిరా ?"

"పరంధామయ్య మామయ్యకి ! మురలి జవాబు

వరమ్మగారు మౌనం వహించింది సరోజమ్మ అన్నది- "పోనీలే పాపం ! ఆయనే తీసుకుంటే మొత్తంగా అనుకూలంగా ఉంటుంది. మంచి పని చేశారు."

ఠక్కున లోపలికి వెళ్లిపోయింది ఆమె. ఈ మాటలు పూర్తి చేస్తుంటే సరోజమ్మ గొంతు బొంగురు పోవడం మేము గమనించకపోలేదు.

మా పరిస్థితి అదోలా ఉంది ఏం అనాలో ఏమి అనకూడదో తెలియడంలేదు నేనులేచి నిలబడ్డాను. నా వెనుక ఖాశీం లేచాడు. మళ్లీ అంతలోనే ఇద్దరమూ కూర్చున్నాం. శారదా, ఖాజాబాయ్ కళ్లు తుడుచుకుంటున్నారు వాళ్ల కేమీ మాటలు విడివడటం లేదు.

వరమ్మగారు తాపీగా నిబ్బరంగా అన్నారు - "రిజిస్టరీ తేది ఇంకా ఉందిగా ఇంత ముందుగా చెప్పఖర్లేదులేరా ! ఇల్లు ఖాళీ చేసి బయటకు నడవమన్నా మీ

అమ్మా నేను ఏమీ అభ్యంతరం చెప్పమనీ తెలుసుగా, సంపూర్ణా ! అట్లాగే కానియ్యండి!"

ఆతర్వాత వాతావరం గంభీరంగా మారింది మరో పావుగంటకి ఎటువాళ్లు అటు వెళ్లిపోయారు నేనూ నిమ్మళంగా కదిలాను

మర్నాడు రాత్రి -

శారదనీ, ఖాజాబాయ్ నీ పిలిపించారు వరమ్మగారు. వరమ్మగారికీ, సరోజమ్మగారికీ రాకుడనికష్టం వచ్చిందని నిజంగానే వాళ్ల ముందుబావురు మన్నారట, వాళ్లిద్దరూ

పెదవుల మీద వీడని వెలుగుతో,ముఖన తొలగని కాంతితో, నిండు మనసుతో అన్నదిట – "పిచ్చి పిల్లల్లారా! ఏదో ఓ రోజు ఇలా జరుగుతుందని నాకు తెలుసు. అందుకే ఇదిగో మీ డబ్బు మీకు భద్రపరుస్తూ వచ్చాను. రామ్మూర్తీ, ఖాశిం చేసిన పనికిగానీ, మీ ఇద్దరి శ్రమకీ, ఆప్యాయతకీ గానీ విలువ కట్టడం కాదు గానీ, నా శక్తి కొద్దీ ఈ మాత్రం మిగిల్చాను తీసుకోండి" అని నోట్ల కట్టని చేతుల్లో పెట్టిందట. "వచ్చినంతలో ఓ చిన్న గూడుని సమకూర్చుకోండి !" అని ఇద్దరినీ విడివిడిగా అక్కున చేర్చుకుందిట.

అరచేతుల్లోకి తీసుకొని ఆప్యాయంగా కళ్ళనీళ్ళు పెట్టుకుందిట సరోజమ్మ.

ఈ విషయం చెప్పి వెక్కిపడసాగింది శారద.

ఆ వేళ మధ్యాహ్నం వరమ్మగారు తన బ్యాంక్ అకౌంట్ని రద్దు చేయించి నా చేత డబ్బు తెప్పించుకున్నది ఇందుకన్నమాట!

ఆరుబయట ఆలోచిస్తూ పడుకున్నాను.

వాస్తవం నుంచి కలలోకి జారుకుంటున్నాను. ఒక మహాస్వప్నం నుంచి వాస్తవంలోకి తేరుకుంటున్నానో క్షణకాలం అర్థం కాలేదు నాకు.

సముద్రం ఒడ్డున గులకరాయిలా నిలబడిపోయాను. తలెత్తి ఆకాశం కేసి చూశాను. కన్నీటి పొర అడ్డుకుంది. శుక్ర తార మసక మసగ్గా కనిపించింది!

గుండె అంతా చిత్రమైన భావంతో నిండిపోయింది - ఏదో పోగొట్టుకున్నట్లు, ఎన్నడో దొరక్కపోదన్నట్లు !

ఈ కథంతా విని, "నేను నమ్మను, వరమ్మ గారూ, సరోజమ్మ గారూ - ఇవాళా రేపూ ఎక్కడా కనపడరు" అన్నాడు మా మనవడు.

నేను సన్నగా నవ్వాను - "మరి ఇతరుల సంగతి?" అడిగాను.

"నువ్వే చెప్పు" అన్నాడు.

"నేనేరా ఆ కథలో రామ్మూర్తిని !" అన్నాను. వాడు నావైపు తేరిపారా చూస్తున్నాడు.

"ఆ తర్వాత సరోజమ్మా, వరమ్మ గారూ ఎలా ఉన్నారో మళ్ళీ చెప్తాను" అని లేచాను.

( ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక - 16-22 మార్చి, 1994 )

